








ఈ సర్టిఫికెటు ఎలా కొనాలి ?

అంతకంటే సులభమైన పని మరొకటి లేదు.

మీ దగ్గరలో ఉన్న పోస్టాఫీసుకి వెళ్ళి మీ పుట్టినతేది, మీ వివరాలు ఇస్తూ (రుజువులేమీ అక్కరలేదు) అక్కడ దరఖాస్తుని పూర్తిచేస్తే వెంటనే ఈ సర్టిఫికెటు లభిస్తుంది. ఐతే మీరు 18-45 సం॥రాల మధ్యవయస్కులై ఉండాలి

అటు జీవితానికి బీమా
ఇటు సంసారానికి పొదుపు.

ఈ సర్టిఫికేటు కొన్నవారు చల్లగా ఉంటే పది సంవత్సరాలలో మీపొదుపు మూడురెట్లు పెరుగుతుంది 500 రూ॥నుంచి 5000 రూపాయల వరకు సర్టిఫికెట్లు కొనుక్కోవచ్చు

వివరాలకు :
మీ దగ్గరలో నున్న పోస్టాఫీసు, మీ జిల్లాకలెక్టరు కార్యాలయంలోని స్పెషల్ తాసీల్దారు, మీ దగ్గరలో నున్న జాతీయ పొదుపు వారి ఏజెంట్లు, మీ జిల్లాలోని పొదుపు పథక అధికారి-వీరిలో ఎవరినైనా సంప్రదించండి

కమీషనర్
స్మాల్ సేవింగ్స్
H. No 3 6 237/2
హిమాయత్‌నగర్
హైదరాబాదు. 29

జాతీయ పొదుపు సంస్థ

# పొదుపు నేర్చుకో ముందర - ఖర్చుకెందుకు తొందర

KPA/CSS.W.3

శ్రీరస్తు – శ్రీ త్రిపురసుందరీ వరశివాభ్యాంనమః





# ఆంధ్రపత్రిక

## శ్రీ క్షయ నామ సంవత్సర పూర్ణశాస్త్రీయ పంచాంగము



'దైవజ్ఞచిన్తామణి' శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,

'భాషాప్రవీణ' శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సిద్ధాన్తి సోదరులచే గుణింపబడినది.

ఆంధ్రపత్రికా కార్యాలయము

ప్రతి 1-కి రూ. 5-00

గాంధీనగరం, విజయవాడ - 3.

బషీర్ బాగ్, హైదరాబాద్-29

సంపుటము : 63 ఫిబ్రవరి 1986 సంచిక : 2

# భారతి

## సాహిత్య మాసపత్రిక

సంస్థాపకుడు
కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్
(1938-1972)

## విషయానుక్రమణిక

ముఖచిత్రం బేబి సునిత చౌదరి



# స్వవిషయం

భారతి అట్ట మీద నర్తకీమణులు, నర్తకులు, సంగీత విద్వాంసులు, రచయితలు, రచయిత్రులు, కవయిత్రులు, కవులు మొదలయిన వారి బొమ్మలు వెయ్యటానికి ప్రయత్నిస్తున్నాము కాని వీటి సేకరణ అంత తేలిక కాదని తెలుస్తోంది! బొమ్మలు తీసేవారి సహకారంతో, వాటిని గురించి రాసేవారి సహకారంతో భారతి ముఖచిత్రాలు కూడా తెలుగువారి సంస్కృతిని ప్రతిబింబించగలవని ఆశిస్తున్నాము.

★ ★ ★ ★ ★

చిన్న నవలల పోటీకి చాలా నవలలే వచ్చాయి. వీలయినంత త్వరలో పోటీ ఫలితాలు ప్రకటించటానికి ప్రయత్నిస్తున్నాము. చిన్న నవలలకీ, పెద్ద కథలకీ ఎక్కువ తేడా లేదని కొందరి అభిప్రాయం. మాసపత్రిక కనుక భారతిలో ప్రతినెలా ఒక చక్కటి కథ లేదా నవలని వెయ్యటానికి వీలు కలుగుతుందని అనిపిస్తోంది.

★ ★ ★ ★ ★

భారతి 1985 డిసెంబరు సంచికని కీ. శే. నిడుదవోలు వెంకటరావుగారి సంస్మరణ సంచికగా వెలువరించినందుకు పాఠకులు తమ హర్షాన్ని వ్యక్తం చేస్తూ మాకు రాసారు. గతంలో చెప్పినట్టుగానే త్వరలోనే మరికొందరు ప్రముఖుల సంస్మరణ సంచికలని వెలువరించటానికి ప్రయత్నాలు చేస్తున్నాము.

★ ★ ★ ★ ★

సుప్రసిద్ధ కన్నడ రచయిత డాక్టర్ కె. వి. పుట్టప్ప రాసిన "శ్మశాన కురుక్షేత్రం" నాటకం తెలుగు అనువాదాన్ని ఈ సంచికలో ప్రచురించాము. వీలువెంబడి వారి రచనలు మరికొన్నిటిని వేద్దామనుకుంటున్నాము.



విడి పత్రిక వెల : నాలుగు రూపాయలు

నాగేశ్వరరావు ఎస్టేట్సు ప్రయివేటు లిమిటెడ్ తరఫున ముద్రాపకుడు, ప్రచురణకర్త : శివలెంక రాధాకృష్ణ.
ముద్రణ : ఆంధ్రపత్రికప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3; సంపాదకుడు : శివలెంక రాధాకృష్ణ.

# నాట్యాకాశంలో మరో తార
# సునీతచౌదరి



రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్ గౌరవార్థం ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు హైదరాబాద్ పబ్లిక్ గార్డెన్స్‌లో ఇచ్చిన విందు సందర్భంగా నృత్యప్రదర్శన చేసిన చి॥ సునీతచౌదరిని అభినందించి ఆటోగ్రాఫ్‌తో ఉన్న వందరూపాయల నోటును అందచేసిన రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్, అప్పటి గవర్నరు శ్రీ శంకర్‌దయాళ్ శర్మ, ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు.

ఎందరో నృత్య కళాకారులను తీర్చిదిద్ది, ఆంధ్ర కళా వైభవాన్ని లోకానికి చాటుతున్న "భరతకళాప్రపూర్ణ" డాక్టర్ నటరాజ రామకృష్ణ శిష్యురాలుబేబీ సునీతచౌదరి.

తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురానికి చెందిన శ్రీ రెడ్డి కృష్ణానంద చౌదరి మేనకోడలైన చి॥ సునీత అతి చిన్న వయస్సులోనే ఆంధ్రనాట్యాన్ని అభ్యసిస్తూ రామచంద్రపురం. రాజమండ్రి, హైదరాబాదు, విజయవాడ, విశాఖ పట్నం, మద్రాసు వంటి పట్టణాలలో ప్రదర్శనలిచ్చి, "అసాధారణ ప్రజ్ఞావంతు రాలు" గా, "బాల మేధావి"గా ప్రశంసలందుకుంది.

రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్ గౌరవార్థం ముఖ్యమంత్రి హైదరాబాద్‌లో ఇచ్చిన విందు సందర్భంగా నృత్య ప్రదర్శనచేసి, రాష్ట్రపతినుండి ఆయన ఆటోగ్రాఫ్‌తో ఉన్న వందరూపాయల నోటును చి॥ సునీత అందుకుని ప్రశంసలు పొందింది. సునీత నృత్య ప్రదర్శనను చూచి ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు తమ ఆశీస్సులు తెలియచేస్తూ వ్రాసిన ఉత్తరంలో ఇలా పేర్కొన్నారు. "నీవు లయబద్ధ పదగతులతో నర్తించి, ప్రేక్షకులను సమ్మోహితులను గావించావు. ఆనంద పరవశులను చేశావు. అనతికాలంలోనే వివిధ నృత్య కళారీతుల నభ్యసించి, అత్యున్నత శిఖరాలను అధిరోహించి, నాట్య కళాకారిణివై వర్ధిల్లాలని మనసారా ఆశీర్వదిస్తున్నాను. "చిరంజీవ, సుఖీభవ"- ఆశీస్సులతో ఎన్. టి. రామారావు.

నృత్యప్రదర్శనల సందర్భంలో కేవలం ఎనిమిదిసంవత్సరాల వయస్సున్న చి॥ సునీత హుందాగా, చిరుమందహాసంతో రంగప్రవేశం చేస్తూనే ప్రేక్షకులన సమ్మోహితులను చేస్తున్నది. చక్కని రూపలావణ్యం, సున్నిత భావాలన సుస్పష్టంగా వ్యక్తంచేయగల నేర్పు, లయ తప్పని అడుగులు ప్రేక్షకులన ముగ్ధుల్ని కావిస్తున్నాయి.

ఆలయ సంప్రదాయ రీతిలో అయిదుమాత్రల గతితో నడిచే "పుష్పాంజలి' నృత్యాన్ని, 72 మాత్రల గతితో లయప్రధానంగా సాగే కాళికా సంప్రదాయ నృత్యమైన "వినాయక కౌతం నర్తనాన్ని, భావ ప్రకటనసూ- పాద విన్యాసానికి ఎక్కువ ప్రాముఖ్యమున్న "శ్రీశైల మల్లికార్జున స్తుతి"ని చి॥ సునీత మనోహరంగా ప్రదర్శిస్తున్నది. "దశావతారా"లను వయస్సుకు మించిన పరిణతిలో కడురమ్యంగా ప్రదర్శించడం చి॥ సునీత ప్రత్యేకత. "నవజనార్దన పారిజాతం"లో సత్యభామ హావభావాలను ప్రదర్శించడంలో ఈ చిన్నారి పరిణతి సాధించి పెద్దవారికి ఏమాత్రం తీసిపోని రీతిలో అభినయిస్తున్నది.

"చిరంజీవి సునీత ఒక మంచి నర్తకిగా తయారై, ఆంధ్ర నాట్యాన్ని పలుప్రాంతాలలో ప్రదర్శించి, తనకూ, తనకి నాట్యం నేర్పించినవారికీ మంచి పేరు తీసుకురాగలదనడంలో ఏమాత్రం సందేహం లేదని" ఆమె గురువుగారైన డా॥ నటరాజ రామకృష్ణ తమ అభిప్రాయం వ్యక్తంచేశారు.

శ్రీ కొత్త కమలాకరం

శ్రీ కొల్లూరు సూర్యనారాయణ

# విమలాదిత్యుడు జైనమతావలంబకుడా?

తెలుగునాట తొలి కావ్యావిర్భావానికి కారకులై, తెలుగువారి సాంస్కృతిక చరిత్రలో ప్రముఖ స్థానమలంకరించిన పాలకులు వేంగిచాళుక్యులు. తెలుగువారి సాహిత్య పరిధులను విస్తృతపరచి తెలుగు భాషకు కావ్యగౌరవ, సభాగౌరవాలనందించటంలో వీరు చూపిన శ్రద్ధాశక్తులు గణనీయమైనవి. క్రీ.శ. ఏడవ శతాబ్ది తొలిదశలో ప్రారంభమైన వీరి పాలన ఎన్నో ఒడిదుడుకుల నధిగమించి పన్నెండవ శతాబ్దివరకూ కొనసాగింది. మతపరంగా అనేక వైవిధ్యాలున్నప్పటికీ, మతసామరస్యానికి ఏ మాత్రపుటాటంకం లేకపోయినప్పటికీ, ప్రముఖంగా వీరు శైవమతాభిమానులు. తెలుగునాట ప్రసిద్ధ శైవక్షేత్రాలైన పంచారామాలు వీరి నిర్మితాలే అని ప్రతీతి. కాని తొలిదశలో కుబ్జవిష్ణువర్ధనుని భార్యయైన అయ్యణ మహాదేవివంటి కొందరు కృష్ణాతీరంలో నెడుంబి వసతివంటి జైనబసదుల్ని నిర్మించి ప్రోత్సహించటం నాటికింకా ఉజ్జ్వలంగా వెలుగుతున్న జైన ప్రభావాన్ని చాటుతుంది.[1] సమకాలీన కాలంలో తెలంగాణా ప్రాంతం జైనానికి పూర్తి ప్రోత్సాహమిచ్చి, ఆదరించి యావద్దక్షిణ దేశంలో అగ్రగామిగా నిల్చింది.

కాని యీ వంశీయుల చివరిదశలో ఈ జైనమతం ఎంతవరకు ప్రోత్సహింపబడిందో చెప్పటానికి ఆధారాలు తక్కువ. ఈ దశలో ఉత్తరాంధ్రలో జైన ప్రభావం చాలవరకూ నశించింది. అయినప్పటికీ రాజరాజనరేంద్రుని తండ్రియైన విమలాదిత్యుడు జైనమతాన్ని స్వీకరించాడని రామతీర్థంలోని త్రికాలయోగి సిద్ధాంత దేవర శాసనం ఆధారంగా శ్రీ నేలటూరి వెంకటరమణయ్య[2], శ్రీ భావరాజు వెంకట కృష్ణారావు[3] మున్నగు పరిశోధకులు గుర్తించటం, వారి అభిప్రాయాన్నే నేటికీ అంగీకరించటం అందరెరిగిన విషయమే. కాని వాస్తవానికి ఆ శాసనంలో పేర్కొనబడిన విమలాదిత్యుడు, రాజరాజనరేంద్రుని తండ్రియైన విమలాదిత్యుడా అనేది పరిశీలింపదగిన అంశము.

వేంగిచాళుక్య వంశంలో మొదటి శక్తివర్మ తరువాత క్రీ.శ. 1011 లో అతని సోదరుడైన యీ విమలాదిత్యుడు సింహాసనమధిష్ఠించి క్రీ.శ. 1018 వరకు పాలించటం జరిగింది. ఈ వంశస్థులు సంప్రదాయసిద్ధంగా ధరించే సర్వలోకాశ్రయ, విష్ణువర్ధన బిరుదులకు తోడుగా యీతడు సమస్త భువనాశ్రయ, బిరుదాంకభీమ, ముమ్మడిభీమ భూపమహేంద్ర, రాజమార్తాండ మున్నగు బిరుదుల్ని ధరించాడు. మొదటి రాజరాజచోళుని పుత్రికయైన కుందవాంబ, తెలుగు చోడ రాకుమారియైన మేళమదేవి, యీతని భార్యలు. అనేక అస్తవ్యస్త పరిస్థితులున్న ఆనాటి రాజకీయ సంఘర్షణలో యీతని పాలన నిస్తేజంగానే జరిగినట్లు భావించవచ్చు. కొన్ని పరిస్థితుల్లో యీతడు దాయాదులచే రాజధానినుండి తరిమివేయబడినట్లును, తలదాచుకొనుటకై తాత్కాలికముగా తన బావమరదియైన మొదటి రాజేంద్రచోళుని శరణుజొచ్చి చోళ రాజ్యమునకు పారిపోయినట్లును కూడ భావింపబడుతోంది. రణస్తిపూడి శాసనం సవిస్తరంగా విమలాదిత్యుడు వేంగిని తిరిగి ఏ విధంగా స్వాధీనపరచుకొన్నాడో వివరిస్తుంది.[4]

వేంగిచాళుక్యులలో విమలాదిత్యుని ముందు వెనుకలలో ఏ ఒక్కరునూ జైనమతాన్ని స్వీకరించలేదు. విమలాదిత్యుని శాసనాలైన రణస్తిపూడి, సిరిపోడి పూండివంటి శాసనాల్లో ఎక్కడా యీతని జైనమతస్వీకృత ప్రస్తావనే లేదు. పైగా అవి యీతడు మహేశ్వర భక్తుడని తెల్పుతున్నాయి. ద్రవిడ దేశమున తిరువైయ్యారులోని పంచనాదేశ్వర శివునికి యీతడు కానుకలు సమర్పించెననుట కూడ గుర్తింపబడిన చారిత్రక అంశమే. అన్నింటికన్న విశేషంగా యీ చాళుక్యుల కులదైవమనదగు ద్రాక్షారామ భీమేశ్వరునివంటి దైవం లేనేలేదని ఘనంగా ప్రస్తుతించిన శాసనం కూడ మరేదియుకాక యీతని రణస్తిపూడి శాసనమేనని మరువకూడదు. ఈతని దానశాసనములైనను బ్రాహ్మణులు, కౌండిన్య గోత్రజులునైన వజ్జియ ప్రెగ్గడకును, బాదప మల్లనకును సమర్పింపబడినవి. వీనిలో ఏ సందర్భమునను యీతని జైనమతాదరణ సూచింపబడలేదు. వీనినిబట్టి తేలుచున్నదేమనగా శైవమతాభిమానులైన చాళుక్య వంశీయుడైన యీ విమలాదిత్యుడు, శైవులైన (జైనమును అసలు సహింపని) చోళుల సహాయ సంపత్తిపై పూర్తిగా ఆధారపడి రాజ్యపాలన చేయుచున్న ఆనాటి అస్తవ్యస్త రాజకీయములో అవైదికమైన జైనమును స్వీకరించుట కాదు సరికదా, ఆదరించెననుటకు కూడ ఆధారము లేదు.

కాని వేంగి చాళుక్య చరిత్రపై పరిశోధనలు సల్పిన పండితులందరును విమలాదిత్యుడు తన చివరి దినములలో జైనమును స్వీకరించి యుండునని భావించుచున్నారు, విమలాదిత్యుని శాసనములు కాని, అతని వంశీయులందించిన యితర వివరములు కాని ఎచ్చటనూ యీ విషయమును బలపరుచుట లేదు. ఈ సందర్భమున పై పరిశోధకులు తమ వాదమున కాధారముగా తీసుకొనిన రామతీర్థ కన్నడ శాసనాన్ని[5] కొద్దిగా పరిశీలింపవలసి వుంది. గమనించండి—

1. స్వస్తి [॥] సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజ రాజమార్తాండ ముమ్మడి భీమన గురుగళ్
2. శ్రీమత్ దేశిగణాచార్య రుసర్వ రాజపూజితరుం మధ్యాహ్న సుభిక్ష—
3. శ్రీ త్రికాళయోగి సిద్ధాంతదేవర ।చన్ద। విమళాదిత్యనగురుగళు
4. శ్రీ త్రికాళయోగి మునీంద్రర్ శ్రమ మతివ్రజిన [భక్తిముకమితం] శ్రీరామ కుండ మంబన్దిసిదర్।
5.
6. (వాక్యములు శిథిలమైనవి)
7.

దీనినిబట్టి దేశిగణాచార్యుడు, సర్వరాజపూజితుడు అయిన త్రికాలయోగి సిద్ధాంతదేవుడు శ్రీరామకొండలో విడిసియుండెననియు, అతడు సర్వలోకాశ్రయ, విష్ణువర్ధన. రాజమార్తాండ, ముమ్మడిభీమ యిత్యాది బిరుదములు వహించిన విమలాదిత్యుని గురువనియు సూచింపబడుచున్నది.

పై శాసనమున పేర్కొనబడిన విమలాదిత్యుని రాజరాజ నరేంద్రుని తండ్రియైన విమలాదిత్యునిగా గుర్తింపవలెనా అనునది ఒక ముఖ్యమైన ప్రశ్న. రాజరాజనరేంద్రుని తండ్రి జైనమతావలంబకుడను విషయము యితరాధారముల వలన రూఢి అయినప్పుడుగాని, పై శాసనము విమలాదిత్యుని (రాజరాజనరేంద్రుని తండ్రి) కాలమునకు చెందినదే అని నిర్ధారింపబడినప్పుడు గాని, చాళుక్య వంశములలో తత్కాలమున మరే విమలాదిత్యుడులేని సందర్భమున కాని నిరాఘాటముగా పై విమలాదిత్యుని రాజరాజనరేంద్రుని తండ్రిగా గుర్తించగలం. కాని పై విషయములన్నింటికీ వ్యతిరేకపుటాధారములుకూడ వున్న కారణంగా నిర్ద్వంద్వంగా యీ శాసనంలోని విమలాదిత్యుని రాజరాజనరేంద్రుని తండ్రిగా చెప్పబూనటం పొరపాటే అవుతుంది.

1) విమలాదిత్యుని శాసనాలలో కాని, తదనంతరుల శాసనాల్లో కాని, సాహిత్యాధారాల్లో కాని పేర్కొనబడని కారణంగా అతడు జైనాన్ని స్వీకరింపలేదనే విషయం సుస్పష్టం. అంతేకాక ఆనాటి రాజకీయ రంగంలో కేవలం చోళ

# దశావతార పద్యములు

( సుగంధి వృత్తము )

వేదచోరు సోము జంపి వేద విద్య లేర్పడన్
ఆదిలో మనోజ్ఞ బుద్ధియాత్మ బోధ భాస్వతున్
మేదురంబుగా జలంగ మించినావు శక్తితో
అది దేవమత్స్య వేషనాత్మ నెంతు భక్తితోన్.

మంద రాద్రి ధారివై సమగ్ర మింద్ర కార్యమున్
సుందరంబుగా ఘటించి శుద్ధమౌని చిత్తమున్
కందళింప జేసితయ్య ఖండితారికచ్ఛపా
వందనంబు నీకు దేవవంది తార్తినాశకా!

కాంచనాక్షముష్ణ రశ్మి కాంతి నొక్క కంటితో
జించి చీకటుల్ హరించి చిద్విలాస తారతో
ముంచితయ్య భూమికాంతమోమునెంతొ జల్లగాన్
కాంచుమా! కిరీంద్రవేష! కమ్మగామమున్ విభో!

ప్రాణముల్ సురారి గుండెపట్టిజీల్చిగోళ్లతో
మానమున్ విదిల్చి బెర్కెముండు చండ నేత్రముల్
దానితో సురేంద్ర హృద్గతార్తి బంధమూడగా
బూనితౌర నారసింహ పూజ్య పాదమ్రొక్కెదన్.

మూడుపాదముల్ సమత్వమొప్ప మూడులోకముల్
కూడదీని అనురీయ గౌరవమ్ము వమ్ముగాన్
నాడు దేవతాళి పొంగ నాటితయ్య జ్ఞానమున్
ఈడు లేదు వామనేశ యీజగాన నీ కెటుల్!

అర్జునిన్ భుజాబలంబు నార్చి కూర్చి దుర్జయున్
అర్జవంబు మోహ భావ మాత్మ వేల్చి బ్రహ్మవై
అర్జితంబు ధరిపెన యాశవీడి త్యాగివై
అర్జితేందుకీర్తి! రేణు కాత్మజా! నమస్కృతుల్.

వాక్య కృత్సు తుండుపృధ్వి భారదక్షుడౌ ప్రభున్
ఐక్య భావసోదరుండు అత్యుదారమిత్రుడున్
జోక్యభావవర్జితుండు చోరరాక్షసాంతకున్
శక్యమేనుతింప! పూజ్య జానకీ పతిన్ సదా.

భూమి భారవారణంబు బూనిజేసెపూజ్యతన్
భూమినింపె నద్భుతంబు ముద్దు బాల చేష్టలన్
భూమి జుల్ స్వకర్మ బంధముర్వి నేర్పియోగివై
స్వామి! చక్రధారి కృష్ణ! సాగిలంగమ్రొక్కితిన్

భారతంబెకాదు సర్వ. భారపృధ్వి నంతటున్
భూరిసద్గుణాలినింపె భారతంపు వెల్గునాన్
భారతీయ రత్నభూతు బంధ వర్జితున్ మహా
సూరి బుద్ధదేవు బుణ్యశ్లోకుభక్తి మ్రొక్కితిన్

పాడవే మనంబ భక్తి పారవశ్య మొప్పగన్
చూడవేఘనుండు కల్కి శుభ్రకీర్తి రాజితో
కూడు నీభువిన్‌వినేతృ గౌరవంబు మించుచున్
తోడు నీడు భాగ్య దాత! దుష్టహంత మ్రొక్కెదన్

భగవాన్ శ్రీ వాసిష్ఠ కావ్య కంఠ గణపతి మునీంద్రుల
దశావతార గీతమునకు, తెలుగుసేత, గణపతి మునిపౌత్రి

పప్పు విశాలాక్షి

( కావ్య కంఠులవారి నలభై తొమ్మిదవ వర్ధంతి సందర్భ
ముగా రచించిన ఇతి వృత్తము. )

సహాయంతో మనుగడ సాగించుచున్న విమలాదిత్యుడు శైవాన్ని విడచి, జైనాన్ని స్వీకరించే అవకాశాలు బహు తక్కువ.

2) ఈ రామతీర్థ కన్నడ శాసనం రూఢిగ రాజరాజనరేంద్రుని కాలానిదే అని చెప్పలేం. అసలు శాసనంలో యిది ఏసంవత్సరములో యీయబడినదో తెలుప బడలేదు. లిపినిబట్టి సివెలు పండితుని పరిగణన ప్రకారము[7] యిది క్రీ॥శ॥ పన్నెండవ శతాబ్దికి చెందుతుంది. కనుక యిది ఆ విమలాదిత్యుని అర్వాచీన కాలానికి సంబంధించిన అంశం.

3) విమలాదిత్య నామాన్ని ధరించిన చాళుక్యులు అర్వాచీన వంశాల్లో యింకా వుండటాన్ని బట్టి విధిగా రాజరాజనరేంద్రుని తండ్రి యైన విమలా దిత్యుడే యిచ్చటి త్రికాలయోగి సిద్ధాంతదేవుని శిష్యుడని అంగీకరించవలసిన అవసరం లేదు. ఈ ప్రాంతంలోనే క్రీ॥శ॥ పన్నెండవ శతాబ్దిలో జననాథపుర చాళుక్య వంశంలో సత్యాశ్రయుని ద్వితీయపుత్రునిగా ఒక విమలాదిత్యుడు పేర్కొనబడ్డాడు.[8]

—కనుక రామతీర్థ శాసనంలోని అస్పష్టమైన అంశాన్నిబట్టి అందు పేర్కొనబడిన విమలాదిత్యుని, రాజరాజనరేంద్రుని తండ్రియయిన విమలా దిత్యునిగా గుర్తింపబూనటం సహేతుకం కాదని తెలుస్తోంది.

**అధోజ్ఞాపికలు :-**

1. సి. పి. నె. 9 ఆఫ్ 1916-17
2. ది యీస్టరన్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి, పే. 216
3. హిస్టరీ ఆఫ్ ది యీస్టరన్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి, పే. 309.
4. ఇ. ఐ, వాల్యూం 6, పే. 347.
5. భారతి, డిసెంబరు 1971, పే. 29.
6. యస్.ఐ.ఐ. వాల్యూం 9, నెం, 403; ఎ.ఇర్.ఇ. నెం. 831 ఆఫ్ 1917.
7. ఎ. ఆర్. ఇ. నెం. 372 ఆఫ్ 1905.
8. భారతి, జనవరి, 1984, పే. 20.

శ్రీమతి వై. కామేశ్వరి

# వచనకవిత - వాక్యలయ

కవి హృదయగత భావస్పందనని పఠితకు అందించడమే కవితా ధర్మం. కవికీ పాఠకుడికీ మధ్య వారధి కవిత. కవితలో భావస్పందనని అందించే ఈ సామర్థ్యం ఎలా వచ్చిందో పరిశీలించడమే వాక్యలయాధ్యయన పరమార్థం. కవితలో వాక్యాల ఆకృతికీ, వాటి గతికీ, అవి బోధించే అర్థానికీ, స్ఫురింపచేసే భావానికీ ఉన్న సంబంధాన్ని విశ్లేషించి చూడటమే వాక్యాలయాధ్యయనం చేసే పని.

కవిత ప్రధానంగా మూడు రూపాల్లో కనిపిస్తుంది. పద్య గేయ వచన కవితా రూపాల్లో పద్యకవితలో భావబోధ ఎలా జరుగుతోందో విశ్లేషించడానికి శ్రీ పోటిబండ మాధవశర్మగారి 'ఛందఃశిల్పం'లో అనుశీలనా మార్గాలు ఏర్పడ్డాయి. తిక్కన ఉద్యోగపర్వం ఆధారంగా శ్రీ పి.ఎల్.ఎన్. ప్రసాదుగారు చేసిన వాక్యలయను గురించిన పరిశోధన[1] మాధవశర్మగారి మార్గాన్నే అనుసరించింది. పదకవితలో లయాత్మకత రసానుభవానికి ఎలా దోహదం చేస్తోందో కుమారి టి.వి. నాగరంజనిగారి పరిశోధనా వ్యాసం వివరించింది.[2] 'రామదాసు కీర్తనలు - స్వర లయవిన్యాసం సాహిత్య రసపోషణం' అన్న ఈ వ్యాసంలోని అనుశీలన సూత్రాలనే గేయ సాహిత్యానికి కూడా వర్తింప చేయవచ్చు.

భగవంతుడి విశ్వరూప సందర్శనంలా రోజురోజుకు కొమ్మలు రెమ్మలు వేస్తూ, ఖండిక ఖండికకూ వైవిధ్యాన్నీ, నవనవోన్మేష సౌందర్యాన్నీ సంతరించుకుంటూ ఇదమిత్థమైన ఏ అన్వయ సూత్రానికి అందక వచనకవిత మనసుకేగాని మాటకందని అనుభవంలా నిలిచి ఉంది.

## వచనకవితకి జీవలక్షణం సహజవాక్యలయ :.

అర్థవంతమైన ప్రతి వాక్యం లయబద్ధంగానే ఉంటుంది. అలా లేనప్పుడు అది తన ధర్మాన్నే కోల్పోతుంది. 'అతిపరిచయాదవజ్ఞా' అన్నట్లు నిత్య వ్యవహారంలో ఉండే వాక్య గమన సౌందర్యాన్ని ఎవరూ గమనించరు. కవిత్వం నిత్య వ్యవహారంకంటే విలక్షణమైనది' ఈ భేదాన్ని గుర్తించిన పాశ్చాత్యులు "స్పీచ్ రిథమ్, వెరస్ రిథమ్" అంటూ గమన భేదాన్ని చెప్పారు. రెండవది మొదటిదానికి ఎంత దగ్గరగా ఉంటే అంత మనోహరంగా ఉంటుందని వారు అభిప్రాయపడ్డారు. నిజానికి ఏ భాషలోనైనా కవితారచన ఈ ప్రాథమిక సూత్రంపైనే ఆధారపడి ఉంది. కవితలో లయ సాంద్రమైన కవి అనుభూతిని మోసుకుని వస్తుంది. సాంద్రతరమైన అనుభూతి సాంద్రతరమైన గమనంతోనే వెలువడుతుంది. అది సాధారణ వాక్యగతికి సన్నిహితంగానో, అనుకరణంగానో ఉన్నపుడు దాని అందం ఇనుమడిస్తుంది.

వాక్యంలో సామాన్యంగా భాసించే గతికాక కవితలో విలక్షణంగా భాసించే వాక్యగతినే వాక్యలయ అనడం జరుగుతోంది.

వచన కవితకు ఒరవళ్లు దిద్దిన పఠాభి 'ఫిడేలు రాగాల డజన్'కు ఇంట్రో రాస్తూ శ్రీశ్రీ 'కవి హృదయంలో రాగాలాపన ఎట్టిటీగలుగా సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలి' అంటూ వచనకవితలో వాక్యగతిని కవిహృదయ స్పందనయే రూపు దిద్దుతుందని చెప్పాడు. ఈ విధంగా కవి హృదయ స్పందన వాక్యానికి తెచ్చే విలక్షణమైన గతే సహజ వాక్యాలయ. సహజసిద్ధమైన లయ వచన కవితా లక్షణమని శ్రీయుతులు కుందుర్తి ఆంజనేయులు,[3] టి.ఎల్. కాంతారావు గార్లు[4] కూడా ప్రతిపాదించారు. ఈ సహజలయలో కవి ప్రయత్నం తక్కువ. నియమబద్ధ శృంఖలాలేవీ లేని స్వచ్ఛమైన స్పష్టమైన స్పందన అభివ్యక్తి వచన కవితకి ప్రాణప్రదమైన లక్షణం. ఈ విధమైన లయను 'సహజ వాక్యలయ' అని ఈ వ్యాసంలో పేర్కొంటున్నాను.

సహజంగా నిరాడంబరంగా ఉండే వాక్యలయను విశ్లేషించే విధానాలను శ్రీశ్రీ సుమారు యాభై సంవత్సరాల క్రితమే ఇలా సూచించారు. "వచన గీతానికి ప్రాణప్రదమైన లక్షణం గమన వైవిధ్యం. ఇది సంభాషణలోని యాసలూ, కాకువులూ ఉచ్చారణ విశేషాలమీద ఆధారపడి వుంటుంది. శైలికి రీతికి సంబంధించిన సమస్యలెన్నో దీనినుండి బయలుదేరతాయి. ఒక్కొక్క కవి తన సామర్థ్యంతో ఒకొక్క ప్రత్యేక గుణం ప్రదర్శిస్తాడు"[5]

సహజ వాక్యలయను విశ్లేషించి విశేషాలను తెలుసుకోగలిగితే ఆయాకవుల కవితాశైలిని కనుగొనవచ్చు. గమన వైవిధ్యానికి భావగతికి ఉన్న అవినాభావ సంబంధాన్ని కనుగొన్నపుడు కవి హృదయస్పందన భౌతికరూపం దాల్చి పాఠకుడికి అందుతున్న తీరును తెలుసుకోగలుగుతాము.

## వాక్యలయ - వైవిధ్యం :-

వచనకవితకి ప్రాథమిక లక్షణం సహజ వాక్యలయ. అయితే భావసాంద్రతనుబట్టి, తీవ్రతనుబట్టీ కవి దాన్ని అలంకృతమో, ఉద్దీప్తమో చేస్తాడు. ఈ రెండు లక్షణాలు ఈషణ్మాత్రమైనా ఉన్నపుడే కవిత 'కవిత' అవుతుంది. ఈ దృష్టితో పరిశీలిస్తే వాక్యలయ ప్రధానంగా మూడువిధాలుగా కనిపిస్తుంది. 1. సహజ వాక్యలయ 2. అలంకృత వాక్యలయ 3. ఉద్దీప్త వాక్యలయ.

లయ వాక్యంలో రూపుదాలుస్తుంది. సహజసిద్ధంగా నిర్మితమైన వాక్యంలో లయ సహజంగా ఉంటుంది. దాని ఉనికిని గుర్తించకుండానే పాఠకుడు ఆ లయానుభవాన్ని పొందవచ్చు. వాక్యంలో ప్రవహించే ఈ సుప్తలయనే వ్యక్తం చేసే ప్రయత్నం దానికి అలంకారాన్ని ఉద్దీప్తతని కలిగిస్తుంది. అలంకృత వాక్యంలో లయ అలంకృతమవుతుంది. ఉద్దీప్తవాక్యంలో లయ ఉద్దీప్తమవుతుంది

నీటిని అనేక గొట్టాలద్వారా క్రమబద్ధంగా చిమ్మే యంత్రం వుంది. ఆ నీటిధారలొక పద్మంగా రూపుదాల్చి ప్రవహిస్తున్నవి. వివిధ వర్ణాల కాంతులను ఆయా ధారలపై క్రమబద్ధంగా ప్రసరింపచేస్తే ఆ పద్మంలోని వివిధ పత్రాలు వివిధ వర్ణాలతో ప్రకాశించి కొత్త అందాన్ని పొందుతుంది. కవితలో అలంకృత వాక్యలయ చేసేపని ఈ విధంగా కాంతిని ప్రసరింప చేయటమే. అంతకుముందే పద్మం వుంది. వర్ణంవల్ల అది అలంకృతం అయి స్పష్టమయింది. అలాగే వాక్యంలోని గతి వర్ణ విన్యాసంతో అలంకృతమై స్పష్టమవుతుంది.

జలప్రవాహగతికి ఒక వింత అందాన్ని కల్పించి ప్రస్ఫుటం చేయడానికి దారిలో మెట్లు నిర్మించినట్లు వాక్యగతిలో ఖండ, చతురస్రాది గతుల్ని కల్పించి ఉద్దీప్తం చేస్తాడు కవి. ఇలాగు ఉద్దీప్తం చేసే కవితలో ఉండేది ఉద్దీప్త వాక్యలయ. ఇది తాళగతికి ఒదిగి సంగీతానికి దగ్గరగా ఉంటుంది.

ప్రధానంగా సహజ వాక్యలయ వచన కవితలోను అలంకృత వాక్యలయ పద్యకవితలోను, ఉద్దీప్త వాక్యలయ గేయకవితలోను కనిపిస్తుంది. అయితే

ఈయీ వాక్యగతులు ఈయీ ప్రక్రియలకు నియతం అనే నియమం ఏదీ లేదు. ప్రతి ప్రక్రియలోను తక్కిన రెండు వాక్యలయలు కూడా కనిపిస్తుంటాయి.

**సహజ వాక్యలయ :-**

వర్ణవిన్యాసం వాక్యానికొక గతిని కల్పిస్తుంది. గతికి వాక్యానికి ఉన్న సంబంధం దీపానికీ వెలుగుకీ ఉన్న సంబంధం లాంటిది. వెలుగులేని దీపంగాని దీపంలేని వెలుగుగానీ లేనట్లు గతిలేని వాక్యంగానీ, వాక్యంలేక గతికి అభివ్యక్తి గాని లేదు. సహజ వాక్యలయను హృదయం సూటిగా అందుకుంటుంది. దీన్లో ఆలోచనకు తావులేదు. అప్రయత్నకృత గతివిన్యాసమే సహజ వాక్యలయ. ఇది వాక్యంలో అంతర్గతంగా వుంటుంది. అందువల్ల సహజ వాక్యలయ స్వరూపాన్ని అందుకోవడం క్లిష్టమైన పని. ఇది అలంకారాల్లో స్వభావోక్తిలాంటిది. సహజ సౌందర్యంతో మెరిసిపోతుందేగాని సామాన్యవాక్యంగా మిగిలిపోదు.

వాక్యవిన్యాసంలో తోచే శబ్దవిరామాలూ, పద పదబంధ విన్యాసాలూ, కాకువు, తూగు విసరుపంటి ఉచ్చారణ భేదాలూ సహజవాక్యలయలో ప్రాధాన్యత పొందుతాయి. వీటన్నింటిని విశ్లేషించి చూపే శక్తి ఏ నియత ఆకృతికీ లేదు. ఈ వివిధమైన విషయ విశ్లేషణ అంతా సహజ వాక్యలయకు సంబంధించిన అధ్యయనం లోనే సాధ్యమవుతుంది.

'వర్ణం' అంటే అర్థభేదాన్ని సృష్టించగల శబ్దభేదం. ఒకొక్క భాషకు ఒకొక్క సూత్రం వర్ణభేదం కలగడానికి కారణం అవుతుంది. ఇంగ్లీషు భాషలో ఊనిక ఆ పాత్రను నిర్వహిస్తుంది. సంస్కృతభాషలో ఉదాత్త అనుదాత్త స్వరితాలనే స్వరస్థాయీ భేదాలు వర్ణ భేదం పొందడంలో ప్రాధాన్యత పొందాయి. సంస్కృత భాషలో ఉన్నంతగా కాకపోయినా తెలుగులో కూడా స్వరభేదం అర్థ భేదాన్ని కలిగిస్తున్నందువల్ల "స్వరవర్ణం" వాక్యలయలో నిర్వహిస్తున్న పాత్రను పరిశీలించవలసి ఉంది.[6]

**అలంకృత వాక్యలయ :-**

సహజ వాక్యలయకు కవి అలంకరణం ద్వారా శోభాతిశయాన్ని చేకూరుస్తాడు. అలంకరణం ఆలోచనని రేకెత్తిస్తుంది. ఇదేమిటనే జిజ్ఞాసను కలిగిస్తుంది. ఆలోచనాత్మకంగా అనుభవించినపుడే అలంకృత వాక్యలయ సౌందర్యం సంపూర్ణానుభవానికి వస్తుంది.

అలంకృత వాక్యలయను అలంకృతం చేస్తుంది. 'అలంకరణం' అనే పదం చాలా విస్తృతార్థం కలది. ఇది ప్రయత్నపూర్వకంగా జరిగేది. ఇది మూడు విధాలుగా ఉండవచ్చు. 1. శబ్దాలంకరణ 2. అర్థాలంకరణ. 3. నిర్మాణాలంకరణ. శబ్దార్థాలని విడదీయడం అసాధ్యం అయినప్పటికీ శబ్దానికి ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చేదాన్ని అర్థాలంకరణమనీ అనడం జరుగుతోంది.

ఆధునిక సాహిత్యంలో వచ్చిన కావ్యబింబాలు, ప్రతీకలు మొదలైన విధానాలన్నీ ఒకవిధంగా చూస్తే అర్థాన్ని భావాన్ని అలంకృతం చేసేవిగానే తోస్తాయి. అందువల్ల ఈ వివిధాంశాలనే మనవారు పూర్వం చెప్పిన అర్థాలంకారాలని కలిపి సమాహారంగా వాక్యలయను అధ్యయనం చేసే ఈ సందర్భంలో 'భావాలంకరణ' అనవచ్చును.

ఝటితిస్ఫూర్తిగా తోచేది అర్థం. దాన్ని భావించగా వచ్చేది భావం. దీన్నే వాచ్యం, వ్యంగ్యం అన్నారు పూర్వులు. అయితే కావ్యబింబాలు ప్రతీకలు అనేవి వాచ్యం అనిగాని వ్యంగ్యం అనిగాని అనడానికి వీలులేదు.

"రోజూ చూస్తూనే ఉన్నాను
ఆ కళ్ళవెనక ఉమ్మెత్త చెట్లను ఊసరక్షేత్రాలను
ఉద్రేకవంతమైన సరస్సులను, ఉరి తీయబడుతున్న అక్షరాలను."

— అజంతా ?

ఈ వాక్యాలలో వాచ్యార్థం పొసగని మాట నిజం. వ్యంగ్యం స్ఫురిస్తున్న మాటా నిజం. అయితే ప్రతీకాత్మకంగా చెప్పిన ఆయా భావాలు వ్యంగ్యపరిధిని కూడా దాటి ఇంకా విస్తృతమైన భావాన్ని భావించే అవకాశం ఇస్తున్నాయి. అందువల్ల కావ్యబింబాలలో, ప్రతీకలలో వాచ్యవ్యంగ్య లక్షణాలు లేకపోలేదు. అలాగని అవి అంతకే పరిమితం కాలేదు. అయితే భావ భాసనం అర్థాలంకారాలకీ, కావ్యబింబాలకీ, ప్రతీకలకీ కూడా సామాన్య లక్షణం అవడంవల్ల దీనికి 'భావాలంకరణ' అనే సమాహారపదం వాడవచ్చును.

భావాలంకరణ శబ్దవిన్యాసం ద్వారా కాక 'భావభాసనం' ద్వారా సంపూర్ణానుభవానికి వస్తుంది. ఇది చెవికి వినిపించేది కాదు. కంటికి కనిపించేది కాదు. ఒక విధంగా చెప్పాలంటే ఇది కవితలో సుప్తంగానే, అంతర్గతంగానే ఉన్నట్లు చెప్పాలి. ఇది దీని స్వభావం అవడం వల్ల 'భావాలంకరణ'కు సంబంధించిన పరిశీలనని కూడా సహజవాక్యలయకు సంబంధించిన పరిశీలనలో చేర్చడం అవసరం.

అలంకారాలలో కొట్టవచ్చినట్టు కనిపించేది శబ్దాలంకరణ. శబ్దవిన్యాసాల వైవిధ్యంతో అనేక భావగతులు సాధించవచ్చు. శబ్దవిన్యాసాన్ని పూర్వులు ప్రధానంగా రెండు మార్గాలలో విశ్లేషించి చూపారు. 1. నియతచ్ఛందంలో ఉండే శబ్దవిన్యాసం. ఇది ప్రధానంగా ప్రాస యతులకు సంబంధించినది. యతిస్థానంలో పదం పూర్తవడం, విరగడం సంస్కృత సంప్రదాయం. తెలుగులో ఆ పద్ధతి యించుమించు నశించి శ్రవణసుభగత్వాన్ని మాత్రం కలిగిస్తూ ఆ నియమం అలంకారప్రాయంగా నిలిచిపోయింది. ప్రాస, యతి అనేవి రెండూ ఛందోఽలంకారాలుగా తెలుగుభాషలో వాడుకలో ఉన్నాయి.

2. శబ్దవిన్యాసం శబ్దాలంకరణగా మరో మార్గంలో విశ్లేషించబడింది. ఇది నియతచ్ఛందానికి నిషేధం కాదు. ఇవి గద్యపద్య రచనలలో యథేచ్ఛగా ఉపయోగించదగినవి.

పాశ్చాత్య సాంప్రదాయిక విమర్శలో ఛందః పరంగా అలంకార పరంగా ఉన్న శబ్దవిన్యాసాలన్నింటిని కూడా 'రైమ్'కు సంబంధించిన అధ్యయనంలోనే కలిపివేయడం జరిగింది.

వచన కవిత్వం స్వచ్ఛంద ప్రక్రియ. అది ఏ విధి నిషేధాలకు ఒదిగేది కాదు. కాబట్టి నియతచ్ఛందానికి సంబంధించిన శబ్దాలంకార ప్రాయాలైన ప్రాస యతులనీ, శబ్దాలంకారాదులైన ప్రాసాదులనే వేరు వేరుగా అధ్యయనం చేయవలసిన అవసరం లేదు.

"ప్రకృష్టో వర్ణవిన్యాసః ప్రాసః" అని ప్రాస అనే పదానికి నిర్వచనం. వర్ణ విన్యాసం లయకు మౌలిక లక్షణం. కాబట్టి పైన పేర్కొన్న వివిధాంశాల సమాహారంగా 'ప్రాస' పదాన్ని ఈ వ్యాసంలో వాడటం జరుగుతుంది. పాశ్చా



త్యులు దేన్నైతే 'రైమ్'కు ప్రధాన ధర్మం అన్నారో ఈ వ్యాసంలోని 'ప్రాస' పదానికి కూడా అదే ప్రధాన ధర్మం.

క్రియలు అంత్యంలో ఉన్న ప్రాసని క్రియాంత్య ప్రాస అనీ, అసమాపక క్రియలు అంత్యంలో ఉన్న ప్రాసని అసమాపక క్రియాంత్యప్రాస అనీ అనడం సమంజసం. వచన కవిత్వంలో అంత్యప్రాస క్రమంగానే ఉండాలని లేదు. అది ఒక పాదం విడిచి మరో పాదంతోగాని, మళ్ళీ అందులో సామ్యాలతో భేదాలతో అనంత విధాలుగా గానీ ఉండవచ్చు. పాదాల అంత్యంలో ఖండిక మొత్తంమీద గాని, ఒకోచోటగానీ ఏదో ఒక విధమైన సామ్యం ఉన్నపుడు దాన్ని అంత్యప్రాస కిందనే చేర్చవచ్చును. అసమాపక క్రియలు ఆరు విధాలు. అయితే వ్యావహారిక భాషే ప్రచురంగా ఉన్న వచన కవిత్వంలో శత్రర్థక క్త్వార్థక ప్రాసలు మాత్రం ఎక్కువగా కనిపిస్తాయి. ఈయా క్రియలు పాదం అంత్యంలో ప్రాసలుగా వచ్చినపుడు క్రియాంత్య ప్రాస అనీ, వాక్యం అంతటా వ్యాపించి ఉన్నపుడు క్రియా ప్రాస, అసమాపక క్రియాప్రాస అని అనవచ్చు,

అలంకరణ ఎప్పుడూ ప్రయత్నపూర్వకంగానే చేయడం జరుగుతుంది. కాని భాషలోని నుడికారంలో ఎన్నో శబ్ద విన్యాసాలు సహజంగానే అలంకార ప్రాయాలుగా తోస్తాయి. అయితే ఇది బుద్ధిపూర్వకంగా జరిగిన అలంకరణ కాదు. అందువల్ల అలంకృత వాక్యలయను ప్రధానంగా స్థూలంగా ప్రయత్నాలంకృత వాక్యలయ, అప్రయత్నాలంకృత వాక్యలయ అని విభజించవచ్చు.

పాశ్చాత్యులు కవితలో లయను మూడు అంతస్థులలో పరిశీలించారు. "రెగ్యులర్ వేవ్ లయిక్ రయిస్ ఎండ్ ఫాల్ ఇన్ ది ఫ్లో ఆఫ్ సెన్స్‌ఎంగ్ సౌండ్ కాన్‌స్టిట్యూట్స్ ది ప్రయిమరీ రిథమ్ ఆఫ్ పొయెట్రీ"7. ఇది మనంచెప్పే సహజ వాక్యలయ. వాక్యంలో ఉండే గతి భావానికి పోషకంగా ఉండటమే వీరనే ప్రయిమరీ రిథమ్ పాదాంత్యాలని గుర్తించే పద్ధతిని సెకండరీ రిథమ్ అన్నారు. దీనిలో 'రైమ్' ప్రధానపాత్ర వహిస్తుంది. వీరనే టెర్షియరీ రిథమ్ కూడా 'రైమ్'కి సంబంధించినదే. ఇది పద్యపర్యంతంగా ఉన్న పాదాల క్రమవిన్యాసాన్ని గుర్తిస్తుంది. అయితే వీరు చెప్పే ప్రయిమరీ రిథమ్ సహజ వాక్యలయలోను, సెకండరీ, టెర్షియరీ రిథమ్‌లు నిర్మాణాలంకృత వాక్యలయలోను అంతర్భవించి పోతాయి. అయితే ఈ దృక్పథం అందించిన స్ఫూర్తితో వాక్యలయలోని అలంకరణను మూడు అంతస్థులలో పరిశీలించడం జరుగుతుంది. 1. వర్ణ విన్యాసం 2. వాక్యవిన్యాసం 3. పద్యవిన్యాసం.

ఖండకావ్యం ఏక విషయమై రాసిన పద్యాల సమాహారం. అందువలన ఖండకావ్యాలలో కనిపిస్తున్న వివిధఖండాలని 'పద్యం' అనేపేరుతో ఈ వ్యాసంలో పేర్కొంటాను. 'వచనపద్యం' గురించి చర్చను సాగించిన శ్రీ చేకూరి రామారావుగారు, సంపత్కుమారగారు వచన పద్యం గురించి ఈ విధంగానే భావించినట్లు తోస్తోంది. ఇంగ్లీషులో 'స్టాంజా' అనే పదానికి పర్యాయంగా ఈ వ్యాసంలో 'పద్యం' అనే పదం వాడుతున్నాను.

వర్ణవిన్యాసం వాక్యవిన్యాసాన్ని, వాక్యవిన్యాసం పద్యవిన్యాసాన్ని పద్య విన్యాసం నిర్మాణ శిల్పాన్ని క్రమంగా వ్యక్తం చేస్తాయి. ఇవే వాక్యంలోను, కావ్యఖండికలోను ఉన్న భావగతిని వ్యంజింప చేస్తాయి. అలంకృత వాక్యలయను అధ్యయనం చేసే సందర్భంలో ఈ మూడు అంతస్థులలోను లయవిన్యాసం భావ పోషణకు ఎలా తోడ్పడుతున్నదో పరిశీలించవచ్చు. తద్వారా శబ్దాలంకరణం, నిర్మాణాలంకరణం అనే ప్రధానమైన అలంకరణలను పరిశీలించటమే కాక ఆ రెంటి పరస్పర సంబంధాలను గూడా పరిశీలించినట్లవుతుంది. ఎందువల్లనంటే కావ్యఖండికలో సౌందర్యం ఎప్పుడూ సమాహార స్వరూపమే. అందువల్లనే నిర్మాణాలంకరణకి సంబంధించిన అధ్యయనంలో శబ్దాలంకరణ, శబ్దాలంకరణకి సంబంధించిన అధ్యయనంలో నిర్మాణాలంకరణ చోటు చేసుకుంటాయి.

అచ్చుయంత్రం రావడం వల్ల వచ్చిన సౌలభ్యాలు వచనకవితా పరిణామంలో కొంత పాత్రని నిర్వహించాయి. పాశ్చాత్యులు ఈ అవకాశాన్ని బాగా ఉపయోగించుకొని 'దృశ్యలయ'ని వచన కవితలో ప్రవేశపెట్టారు. కవి చెప్పే భావానికి అనుగుణమైన ఆకృతిలో అచ్చు వేయడం ద్వారా ఇది సాధ్యమయింది. తెలుగు ప్రాంగణంలోనూ ఇలాటి వైచిత్రి విన్యాసాల ప్రయత్నం కొంత జరిగింది. ఒకవిధంగా చెప్పాలంటే ఇది క్షీణప్రబంధ యుగపు చిత్రకవిత్వం వంటి రచనా చమత్కారాల విన్యాసం. ఇది చమత్కారాన్ని కలిగించినంతగా అనుభూతిని అందించలేదు. అందువలన ఈ విధమైన రూపాలంకరణ గురించిన చర్చకు వాక్యలయాధ్యయనంలో తావు లేదు.

## ఉద్దీప్త వాక్యలయ :-

తాళగతి విన్యాసానికి ఒదిగి నడిచే వాక్యగతే ఉద్దీప్త వాక్యలయ. వచన కవితకి ప్రధానమైన లక్షణం నియతమైన గతి ఉండకపోవటమే. గేయకవితకి భిన్నంగా రూపొందిన కవితారూపమే వచన కవిత. అక్కడక్కడ గతిబద్ధమైన గమనం తోచినా వచన కవితలో దీనిపాత్ర తక్కువే. అయినా గేయకవితా సంప్రదాయం నుండి వచ్చిన కవుల కవితలో ఉద్దీప్త వాక్యలయ ఆధిపత్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

## వాక్యలయ - వచన కవుల శైలి :-

వచనకవులు చాలామంది పద్య గేయ కవితా ప్రక్రియలలో చేయి తిరిగిన వారవడంవల్ల సాంప్రదాయిక సాహిత్య భూమికనుండి వచ్చిన వారవడంవల్ల 'ఆయా ప్రక్రియల ప్రభావం వారి కవితలపై ఉంటుంది. అందుకు నిదర్శనంగా అక్కడక్కడ గేయకవిత్వపు పోకడలు పద్యపాదాల తునకలూ దొర్లుతుంటాయి. ఏ కవిపై ఏ కవితా ప్రక్రియ ప్రభావం ఎంతగా ఉందో పరిశీలించినపుడు ఆ కవి శైలిని నిర్ణయించడం సాధ్యం అవుతుంది. ఈ వాక్యలయల పరస్పర సమ్మేళనంతో వచనకవుల శైలులని ప్రధానంగా ఏడు రకాలుగా విభజించవచ్చు.

1. అలంకృత వాక్యలయకి ఉద్దీప్తవాక్యలయను పోషకంగా వాడుకునే వచన కవుల శైలి.

ఉదా :- శ్రీశ్రీ; బైరాగి

2. ఉద్దీప్తవాక్యలయకి అలంకృత వాక్యలయను పోషకంగా వాడుకునే వచనకవుల శైలి.

ఉదా :- సి.నా.రె, గంగినేని

3. అలంకృత వాక్యలయకి సహజ వాక్యలయను పోషకంగా వాడుకునే వచనకవుల శైలి.

ఉదా :- తిలక్, గోపాలచక్రవర్తి, ఆరుద్ర

4. సహజ వాక్యలయకి అలంకృత వాక్యలయను పోషకంగా వాడుకునే వచనకవుల శైలి.

ఉదా :- చేతనావర్త కవులు; శేషేన్

5. సహజ వాక్యలయకి ఉద్దీప్త వాక్యలయను పోషకంగా వాడుకునే వచన కవుల శైలి.

ఉదా :- గద్దర్, వంగపండు ప్రసాదరావు

6. ఉద్దీప్త వాక్యలయకి సహజ వాక్యలయను పోషకంగా వాడుకునే వచన కవుల శైలి.

ఉదా :- సుబ్బారావు పాణిగ్రాహి, శివుడు.

7. సహజ వాగ్వ్యుత్తి ప్రధానంగా ఉండి అలంకృత ఉద్దీప్త వాక్యలయలు నామమాత్రంగా ఉండే వచన కవుల శైలి.

ఉదా :- కాళోజీ, కుందుర్తి, శీలావీర్రాజు.

## వచనకవితలో వాక్యలయాధ్యయనం - ప్రయోజనాలు :-

అనంత వైవిధ్యం కలదైనా వచన కవిత కూడా భావప్రసారానికి ఏదో ఒక గతిని ఆశ్రయించక తప్పదు. అందువలన గతికి భావపోషణకి ఉన్న అనుబంధాన్ని విశ్లేషించే ఏ సూత్రమైనా వచన కవితకు అన్వయించడానికి అనువైన విశ్వజనీన సూత్రంగా రూపొందుతుంది. ఈ విధమైన అనుశీలన సూత్రాలు ఏర్పరిస్తే వాటితో ఏ వచనకవిత్వాన్నైనా అనుశీలించవచ్చు. అనువర్తిత విమర్శకు ఈ అధ్యయనం ఎంతో తోడ్పడుతుంది. ఈ సూత్రాలన్నీ అన్ని కావ్యఖండికలకూ అన్వయింపబడాలని నియమం లేదు. ఏవో కొన్ని సూత్రాల కలయిక ఏదో ఒక గతిని తెలియచేస్తుండవచ్చు. ఎందువల్లనంటే వచన కవిత ఖండకావ్య ప్రక్రియ మీద ఆధారపడి ఉంది. ఏ ఖండికకు ఆ ఖండికే తనదైన అభివ్యక్తి ధోరణినీ, తనదైన వాతావరణాన్ని సృష్టించుకొని ఉంటుంది. అందువలన ఈ అధ్యయనంలో చెప్పేవన్నీ సాపేక్ష అనుశీలన సూత్రాలు.

ఇలా అన్నంత మాత్రాన ఈ అధ్యయనంలో శాస్త్రీయ దృక్పథం కొరవడినట్లు భావించరాదు. వీటన్నింటిని పూసలలో దారంలాగ కలిపే మౌలిక దృక్పథం ఒకటి ఉంది. భావగతికి వాక్యగతికి అవినాభావ బంధం ఉన్నది. అనే మౌలిక సూత్రపు పునాదిపైనే ఈ అనుశీలన సూత్రాలు నిర్మింపబడుతున్నాయి.

ఏ కవి అయినా చిరకాలం నిలిచేది తన ఆత్మీయతా ముద్రతోనే. దాన్నే శైలి అంటాము. ఒక కవి శైలి రూపొందడంలో అతని ఉద్యమ ప్రవృత్తి ప్రయోగ ప్రవృత్తి, వ్యక్తిగత సంస్కార ముద్రల కలయిక తోడ్పడుతుంది. వాక్యలయ అధ్యయనం వల్ల కవి శైలి నిరూపితమవుతుంది. శైలినిబట్టి అతని ఉద్యమ ప్రయోగ ప్రవృత్తులను నిరూపించవచ్చు. కవి శైలీ నిరూపణమే ఏ ఉత్తమ విమర్శకైనా అంతిమ లక్ష్యం. వివిధ భావావస్థలలో ఒక కవి ఏ విధంగా స్పందించాడో ఏ వాహిక ద్వారా, ఏ గతిద్వారా తన వాగ్వృత్తిని ప్రవహింపచేశాడో వాక్యలయాధ్యయనం నిరూపిస్తుంది. ఒక కవికి పాఠకలోకంలో ఎందుకు ఆదరణ కలిగిందో, కవితాప్రపంచంలో అతని స్థానం ఏమిటో సహేతుకంగా నిరూపించి చూపుతుంది. ఇవీ వాక్యలయను వచన కవితలో అధ్యయనం చేయడం వల్ల కలిగే ప్రయోజనాలు.

### సూచికలు :-


1. ఉద్యోగపర్వము-వాక్యలయ పి.ఎల్.ఎన్. ప్రసాద్, ఎం. ఫిల్ పరిశోధనా వ్యాసం.(అముద్రితం), ఉస్మానియా విశ్వవిద్యాలయం 1981,
2. రామదాసు కీర్తనలు - స్వరలయవిన్యాసం; సాహిత్య రసపోషణం, టి.వి; నాగరంజని, ఎం. ఫిల్. పరిశోధనా వ్యాసం(అముద్రితం), హైదరాబాదు. కేంద్ర విశ్వవిద్యాలయం 1982.
3. ఆధునిక కవిత్వంలో ఇటీవలి పోకడలు; ఆధునిక కవుల ఆత్మవిమర్శ.(వ్యా) కుందుర్తి వచన కవిత-వివిధ కవుల పథాలూ దృక్పథాలూ
4. తెలుగులో వచన కవిత. కాంతారావు టి.ఎల్.(వ్యా) భారతి 1969 నవంబరు పేజి 30/31
5. నేటి తెలుగు కవిత; కొత్తపోకడలు శ్రీశ్రీ(వ్యా) భారతి 1939 ఫిబ్రవరి.
6. ఇక్కడ 'స్వరం' అంటే 'అచ్చు' అనే అర్థంకాదు. స్వరస్థాయి అంటే 'పిచ్'ఇది ఉచ్చారణలో మాత్రమే స్ఫురిస్తుంది.
7. ది ప్రిన్సిపల్స్ ఆఫ్ ఇంగ్లీష్ మేటర్ పు.7 ఎగర్టన్ స్మిత్, ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రెస్, హంఫ్రీ మిల్‌ఫర్ 1928. □




# నిజాయతీ

## కాలువశ్రీ

మా ఎండి పోయిన డొక్కలు
గోచిపాతర బతుకులు
మురికి మురికి జీవితాలు
కవితా వస్తువులుగా తీసుకొని
బ్రహ్మాండంగా వర్ణిస్తావు.
మాగడు కంబళి తిండి
గొడ్డుకారం అన్నం
దుర్గంధం ప్రక్కన నివాసాలు
కథలుగా మలుస్తూ
దయనీయంగా రాస్తావు.
మా తూట్లు పడ్డ గుడిసెలు
ఇంట్లోని చిప్పా కడు ముంతలు
దుర్భర దారిద్ర్యం
వస్తువులుగా గైకొని
కండ్లకు కట్టేలా లిఖిస్తావు.

మేం మాట్లాడే యాసా
మా మాండలీక భాషా
ముద్దుముద్దుగా రాసి
కవీ, రచయితా అనిపించుకుంటావు
బహుమతుల నందుకుంటావు
సన్మానాలను సైతం పొందుతావు.

సర్వ సౌఖ్యాల ననుభవిస్తూ
కార్లల్లో విహరిస్తూ
పేదరికం గూర్చి రాస్తున్నందుకు
నిన్నధిక్షేపించడం లేదు
మాలాగే నిన్నుండ మనటమూ లేదు.
కాని కేవలం
ధనార్జన కోసమో
పేరు ప్రఖ్యాతుల కొరకో
ఆత్మవంచన చేసుకుంటూ
నిజాయతీని వదులుకొని రాయడం
పడుపు వృత్తి కన్నా నీచమంటున్నాము.
మాపై నిజమైన సానుభూతి వుంటేనే
మా సమస్యలకు చలిస్తేనే
హృదయ పూర్వక పరిష్కారాన్నాశిస్తేనే
మా గురించి ప్రస్తావించ మంటున్నాము.
లేదా
ఏ భూత ప్రేత సమస్యలనో తీసుకొని
ప్రేమ విరహాలను వర్ణిస్తూ
సస్పెన్ థ్రిల్లర్లలో మునిగి తేలుతూ
మసాలాలు జోడించి
బండ్ల కొలదీ వండేసెయ్
మా కభ్యంతర మసలే లేదు

# చెంగప్ప

## గంటి రామలింగం

"ముసలాయన నిన్ను రమ్మన్నాడు...."

బయట ఎండలోకి చూస్తూ నుంచుని ఉన్న రావు ఈ మాటలు విని ఇంచుమించు ఉలిక్కిపడ్డాడు. ఇటు తిరిగి సమాధానం ఇవ్వబోయాడు. గదిలో దీపాలు వేసి ఉన్నప్పటికీ వెలుగు తీవ్రతలో మార్పు రావటంతో కళ్లు చీకట్లు కమ్మినట్లయింది. తనతో మాట్లాడిన అతను అప్పటికే వెళ్ళిపోతున్నాడు. "చిదంబరం!" అని అతన్ని పిలువబోయాడు. మాట పెగలలేదు. ఒకళ్ళిద్దరు టయిపు చేసుకుంటున్నారు. ఇంకొక వ్యక్తి కలం చేతిలో పట్టుకుని తన వయిపే శూన్యంగా చూస్తున్నాడు. మిగిలిన కుర్చీలు ఖాళీగా ఉన్నాయి.

రావు చేతిమీది గడియారంలో ఇంకా రెండు గంటలు కాలేదు. "ముసలాయన" సాధారణంగా తనని ఈ వేళలలో పిలవడు. ప్రత్యేకంగా ఏదయినా కారణం ఉందేమో ఇప్పుడు రమ్మనటానికి, అనుకుంటూ అతను లిఫ్ట్ వయిపుకి నడిచాడు.

"ఏమిటి సార్ ఇవాళ ఇంత త్వరగా పయికి వెడుతున్నారు?" అని పలకరించాడు. లిఫ్ట్ నడిపే దీక్షితులు. రావు రోజూ రెండున్నర తరువాతనే 'ముసలాయన'ని చూడటానికి వెడతాడని దీక్షితులికి తెలుసు.

"అవును దీక్షితులూ, అయ్యగారు ఇవాళ కునుకు తీస్తున్నట్లు లేరు." అన్నాడు రావు. లిఫ్ట్ తలుపులు మూసుకుంటూ ఉండే, దానిలోపల ఉక్కగా ఉంది. వేడెక్కిన నూనెవాసన వాళ్ళ తలమీద తిరిగే ఫాన్‌వల్ల మరింత ఎక్కువ అయినట్లు అనిపించింది అతనికి.

"మీ ఫ్లోర్ వచ్చేసింది సార్..." అని దీక్షితులు అనటంతో రావు ఆలోచనలోనుంచి తేరుకున్నాడు.

టేకు రంగు తలుపుమీద "మేనేజింగ్ డయిరెక్టర్" అన్న ఇంగ్లీషు అక్షరాల మీద ఉన్న పేరు తీసివేసి 'ముసలాయన' అని ఇంగ్లీషులోనే రాస్తే ఎలాగ ఉంటుందో, అనుకున్నాడు తను చాలా సారులే. దీనిని గురించి చెప్పుకుని నవ్వుకున్నారు కూడా తనతో పనిచేసేవారు. మేనేజింగ్ డయిరెక్టర్ అసలు గదిలోకి వెళ్ళాలంటే ముందు ఒక చిన్నదానిని దాటాలి. ఆ చిన్నగదిలోనే తను కూర్చుంటాడు. 'ముసలాయన' గది తలుపుకి ఉన్న చిన్న కిటికీలోనుంచి తొంగి



చూశాడు. ఆయనతో వేరే ఎవరూ లేరు. లోపల చాలా చల్లగా ఉంది. "ఎయిర్ కండిషనర్ ఉంటే మాత్రం వణుకు పుట్టే అంత చల్లగా పెట్టుకోవాలా ? అని ఎవరయినా అంటే 'ముసలాయన' పళ్లు కనపడేట్లు చిరునవ్వు నవ్వేవాడు.

"పిలిచారుట..." రావు బల్లకి ఇవతల పక్క నుంచుని తనలో తను మాట్లాడుకున్నంత నెమ్మదిగా అడిగాడు. 'ముసలాయన' సమాధానం చెప్పకుండా ఏవో కాగితాలు చదువుకుంటూ ఉండిపోయాడు. అతను బాగా ఎర్రటి మనిషి; మొహం అంతా సన్నటి ముడతలు; జుట్టు తెల్లగా నెరిసిపోయి ఉండేది.

కొన్ని క్షణాలపాటు ఇద్దరూ మాట్లాడలేదు. రావు తన ప్రశ్నని మళ్లీ వెయ్యబోయి ఊరుకున్నాడు. చివరకి 'ముసలాయ'నే తల ఎత్తి చూశాడు. అతని కళ్ళు రావుకి ఎప్పుడూ నీరు కారుతున్నట్లు కనిపించేవి. ఇంకా కొన్ని క్షణాలు గడిచాయి.

"చెంగప్ప సరే నన్నాడా ?" ఈ సారి ముసలాయనే మాట్లాడాడు.

రావుకి ఒళ్ళు ఝల్లుమన్నట్లయింది. అతను వెంటనే సమాధానం ఇవ్వక పోయేటప్పటికి 'ముసలాయన' ప్రశ్నార్థకంగా కనుబొమ్మలు కొంచెంగా పయికి ఎత్తి చూశాడు.

"సరే అనక ఏమి చెయ్యగలడు ?" అని గొణుగుకుంటున్నట్లు జవాబు చెప్పాడు రావు. ఎలాగో ధైర్యంచేసి ముసలాయన ముఖంలోకి చూశాడు. అతని పళ్ళు తెల్లగా మెరుస్తున్నాయి. నవ్వుతున్నట్లు పెదిమల్ని విడమరచి ఉంచటం అతనికి అలవాటే కాని నవ్వు వెనుక హాస్యం అనేది ఏమీ లేదని రావుకి బాగా తెలుసు. ముసలాయన బల్లమీది పెన్సిల్‌ని ఒకదానిని తీసి దానితో నెమ్మదిగా తనముందు పయి పళ్ళ వరుసమీద కొట్టుకోవటం ప్రారంభించాడు. కట్టుడు పళ్ల కాబట్టే అంత సమంగా చక్కగా ఉన్నాయి, అన్న ఆలోచన రావు మనస్సులో మెదిలి మాయం అయింది.

"సాయంత్రంలోపల మళ్ళీ కలుసుకుని పని పూర్తి చేసేస్తాను..."

"సరే, మూడు గంటల లోపల మనం మీటింగ్‌కి వెళ్ళాలి కదా ! తర్వాత వెళ్ళు చెంగప్ప దగ్గరికి." అన్నాడు ముసలాయన తన ముందు ఉన్న కాగితాలని సర్దుతూ.

"అరగంటలో సిద్ధంగా ఉంటాను" అని రావు ఆ గదిలోనుంచి బయట పడ్డాడు. తన కుర్చీలో కాస్సేపు కూర్చుందా మనుకున్నాడు. ముందు కాంటీన్‌కి టెలిఫోన్‌చేసి ఏదయినా తెప్పించుకోవచ్చు కాని కిందికి వెడితేనే బాగా ఉంటుందని మళ్ళీ అనిపించింది. కొంత సేపటిదాకా ముసలాయనకి దూరంగా ఉంటే మంచిదనుకున్నాడు.

బయట కారిడార్‌లో అప్పుడేవచ్చి కుర్చీలో కూర్చోబోతున్న ఎటెండరు నేరుగా నుంచుని "ఇందాకటినుంచి మీకోసం అడుగుతున్నారు ఆయన..." అన్నాడు.

రావు అవునన్నట్లు తలాడించి లిఫ్ట్ పయిపుకి నడిచి వెళ్లిపోయాడు. లిఫ్ట్ ఆపరేటర్ "కాంటీన్‌కేకదా ?" అన్న ప్రశ్నకి కూడా మాటలలో సమాధానం చెప్పకుండా తల పంకించాడు.

కాంటీన్‌లో బాగా ఖాళీగా ఉన్న చోటు చూసుకుని అక్కడికి తీసుకు వెళ్ళాడు తన కాఫీని. తనలాంటి వాళ్ళకోసం కొంచెం ఎక్కువ శ్రద్ధగా చేసినప్పటికీ కాఫీ తియ్యగా కొద్దిగా మందువాసన ఏదో వేస్తోంది. ఇక్కడినుంచి చెంగప్పకి ఫోన్‌చేసి మాట్లాడవచ్చు. ఇంతలో ముసలాయన చెయ్యకుండా ఉండాలి, అంతే. అతనికి ఇది సాధారణంగా ఒక చిన్న కునుకు తీసే వేళ. కాని ఏమిచేస్తాడో చెప్పటం కష్టం అనుకున్నాడు రావు. తాగుతున్న కాఫీని మధ్యలోనే వదిలివేసి ఫోన్ దగ్గరికి వెళ్ళాడు. కాంటీన్ అధికారి అతని ఉద్దేశాన్ని కనిపెట్టి తనవద్ద టెలిఫోన్‌ని కొంచెం ముందుకి తోశాడు.

చెంగప్ప దొరకలేదు. 'ఫరవాలేదు,' అనుకున్నాడు రావు. టెలిఫోను చేసి నందుకు డబ్బులు ఏమీ పుచ్చుకోలేదు కాంటీన్ మనిషి. కొంచెంసేపు ఆగి, తన గదిలోనుంచి టెలిఫోనుచేసి చూడవచ్చుననుకుంటూ రావు తిరిగి వెళ్ళిపోయాడు. మనసులో వ్యాకులం మాత్రం వాన ముసురులాగ అలుముకునే ఉంది. రావుని చూడగానే అటెండరు "మీకోసం అడుగుతున్నారు అయ్యగారు..." అన్నాడు.

"పది నిముషాలు ముందే బయలుదేరుదాము. డ్రయివరుతో చెప్పు !" రావు గదిలోకి వెళ్ళేప్పటికి నుంచునే ఉన్నాడు ముసలాయన. నిద్రపోలేదన్న మాట. 'మేలుకునే ఉండి ఏమి చేశాడో...' రావు ఆందోళన ఎక్కువ అయింది.

"అలాగే," అంటూ కిందకి ఇంటర్ కామ్‌లో చెప్పటానికి ఉద్యుక్తుడయ్యాడు.

* * *

కారులోకూడా ఎయిర్ కండిషన్ ఉంది. కిటికీల అద్దాలన్నీ కొద్దిగా రంగువి కావటంచేత లోపల అసలే ఎండ తెలియటంలేదు. బస్సుల చప్పుళ్ళూ, వాహనాల హారన్‌లూ సన్నగా వినపడుతున్నాయి. రావు డ్రయివరు పక్కన కూర్చుంటే ముసలాయన ఒక్కడూ వెనక సీటులో డ్రయివరు వెనక కూర్చున్నాడు.

"ట్రాఫిక్ ఎక్కువగానే వుంది." అన్నాడు రావు కొంచెంగా వెనక్కి తిరిగి. ముసలాయన ముభావంగా అతని పయిపు చూసి "అవును" అన్నాడు.

నడుస్తున్న కారు హటాత్తుగా ఒక కుదుపుతో ఆగిపోయింది. ముందు బస్సువాడు 'సడన్ బ్రేక్' వేశాడని నసిగాడు డ్రయివరు. ఆ బస్సు దట్టంగా పొగ వదులుతోంది. ఎలాగయినా దానిని దాటివెళ్ళమని డ్రయివరుతో రావు అన్నాడు.

"కష్టం ! ఈ పయిపు ఎదురుగా చాలా బళ్లు వస్తున్నాయి. ముసలాయన అన్న ఈమాటలువిని రావు అతనివంక చూశాడు. ముసలాయన తనచేతిగడియారం చూసుకుంటున్నాడు "మన మీటింగ్‌కి వెళ్లేముందు క్లబ్బులో ఒక నిముషం ఆగాలి.

"క్లబ్బులోనా ?" అనాలోచితంగా అడిగాడు రావు. అతని ఈ ప్రశ్నకి సమాధానం రాలేదు. ఏమి మాట్లాడాలో తెలియక రావు తన దృష్టిని ముందుకి మళ్ళించాడు. "చెంగప్పగారు క్లబ్బులో ఉంటారు సార్..." అని చాలా నెమ్మదిగా రహస్యం చెప్పినట్లు చెప్పాడు డ్రయివరు. అతని మాటలు వెనుక సీటులో వినపడి ఉండవు అనుకున్నాడు రావు. ఈ ఆలోచన వస్తూ వుండగానే అతని కలవరపాటు మరింత ఎక్కువయింది.

వాళ్ళ కారు వెనకాల వాహనాల హారన్‌లు ఒక్కసారిగా మోగటం మొదలు పెట్టాయి. డ్రయివరు అస్పష్టంగా ఏదో అంటూ బస్సుని తప్పించి ముందుకి వెళ్ళటానికి అతిప్రయాసతో స్టీరింగ్ వీల్‌ని తిప్పటంచూసి "జాగ్రత్త..." అని మందలించాడు రావు. కారు ఎడమవయిపున కూర్చుని ఉన్న అతనికి అవతల వయిపు బళ్ళు రావటం అంత బాగా కనపడటంలేదు. డ్రయివరు తమ కారు హారన్‌ని అదేపనిగా వేస్తూముందుకి వెళ్ళిపోతున్నాడు. బస్సు ఎందుకి ఆగిపోయిందో అప్పుడు తెలిసింది రావుకి. దాని ముందు ఒక లారీ నిలబడి వుంది. దాని తాలూకు మనిషి బస్సు డ్రయివరుతో చేతులు ఊపుతూ ఏదో చెబుతున్నాడు. రావు ఆ దృశ్యాన్ని ఒక్క క్షణం చూసి ముందుకి దృష్టి సారించాడు. ఎదురుగుండా ఇంకొక లారీ వస్తోంది. అది ముందుకి వచ్చేలోపలే లారీని కూడా దాటి వెళ్ళిపోవటానికి వేగం హెచ్చించాడు తమ డ్రయివరు. వెనక సీటునుంచి ముసలాయనా, ముందునుంచి రావూ కంగారుగా హెచ్చరికలు చేశారు. డ్రయివరు ప్రయత్నం ఫలించలేదు. లారీ, కారూ-రెండింటి బ్రేకులు కూడా పడ్డాయి కాని ప్రయోజనం లేకపోయింది. చెంగప్ప సంగతి ఏమిటి ? అన్న ఆలోచన మెరిసినట్లయింది రావుకి. ఇంచుమించు అదే క్షణం వాహనాలు రెండూ ఢీ కొన్నాయి.

రావు తను ఒక ఆసుపత్రి మంచంమీద పడుకుని ఉన్నానని గ్రహించాడు. నెమ్మదిగా చేతులు కదిలించి చూశాడు. ఆ తర్వాత కాళ్ళు కొంచెం మడిచి నేరుగా చాపుకున్నాడు. ఎముకలు ఏవీ విరిగినట్లు లేవు. సందేహిస్తూనే తల తడిమి చూసుకున్నాడు. కట్టు కట్టి ఉంది.

"తెలివి వచ్చిందన్న మాట!

మంచిది..." అప్పుడే తలుపు తెరిచి లోపలికి వస్తున్న అతను అన్నాడు. అద్దాలకి ఫ్రేములేని కళ్ళజోడు, మోకాళ్ళదాకా వచ్చే తెల్లకోటు వేసుకుని పొట్టిగా ఉన్నాడు. బట్టతల నున్నగా మెరుస్తోంది. డాక్టరు వెనకే వచ్చిన వ్యక్తి ముఖం రావుకి బాగా పరిచితమయినదే.

"మిమ్మల్ని తీసుకు వెళ్ళటానికి ఈయన వచ్చాడు. మీ ఆఫీసు వాళ్లు పంపారు..." అని చెప్పుకుపోతూ డాక్టరు మంచం దగ్గరికి వచ్చి రావుని పరీక్షించటం ప్రారంభించాడు." ఎముకలేవీ విరగలేదు. తలకి చిన్న దెబ్బతగిలిందంతే–కారు విండ్ స్క్రీన్ కొట్టుకొని స్పృహ తప్పింది. అదృష్టవశాత్తు ఇంకేమీ కాలేదు..."

రావు చూపులు డాక్టరుని దాటి వెనుక నుంచుని ఉన్న వ్యక్తి మొహంమీద నిలిచాయి, అతను పెదవి విరిచి తల కొద్దిగా, అడ్డంగా ఆడించాడు.

"మీరు లేచి నుంచోవచ్చు. కావలిస్తే వెళ్ళిపోవచ్చుకూడా... డ్రయివరుకి కూడా...పెద్ద దెబ్బలేమీ తగలలేదు. కాని మీ మేనేజింగ్ డయిరెక్టరు మాత్రం..." అని ఆగిపోయాడు డాక్టరు.

లారీకి అంత గట్టిగా కొట్టుకోలేదు కారు. ముసలాయన గుండె ఆగిపోయాడుట...!" ఈ మాటలు అంటున్నప్పుడు రావు తోటి ఉద్యోగి ముఖ కవళికలు మారలేదు.

* * *

ఇంటి ఆవరణలో జనం గుమిగూడి ఉన్నారు. కార్లు వచ్చి వెడుతున్నాయి. రావు ముందు ముసలాయన ఇంటికే వెళ్ళాలన్నాడు. అతన్ని తీసుకురావటానికి వచ్చిన వ్యక్తి అభ్యంతరం చెప్పలేదు. నడిచినప్పుడు తల కొంచెం తిరుగుతున్నట్లు అనిపించింది. కాని రావు ఎవరి చేయూతా లేకుండానే కారు ఎక్కి దిగ గలిగాడు. దారిలో యిద్దరూ పిచ్చపాటీ కొంచెం మాట్లాడుకున్నారు.

"ముసలాయన తమ్ముడే వస్తాడనుకుంటున్నారు..." రావుని తీసుకు వెడుతున్న అతను అన్నాడు. హాల్లోకి వెళ్ళమని ఎవరో చెబితే ఇంటివయిపు నడిచారు ఇద్దరూ.

"అడుగో చెంగప్ప వెళ్ళిపోతున్నాడు!" రావు అటు చూశాడు. నల్ల రంగు కిటికీ అద్దాలు ఉన్న కారు ఒకటి పోర్టికోలోనుంచి బయటికి వస్తోంది. ముందు గాజు కిటికీమీద వెల్తురుపడి మెరుస్తోంది. కాని లోపల డ్రయివరు మాత్రం అస్పష్టంగా కనిపిస్తున్నాడు. వెనక సీటులో వున్నవాళ్లు అసలే కనిపించటంలేదు.

తనతో వస్తున్న వ్యక్తి మలుపు తిరిగి, "అది చెంగప్ప కారని కూడా నాకు తెలీదు." అన్నాడు రావు. "లోపల మనుష్యులే కనిపించలేదు!"

"చెంగప్ప కారు, అంటే చెంగప్ప ఎక్కి వెడుతున్న కారు అని మాత్రమే అర్థం..." అని చిరునవ్వుతో సమాధానం చెబుతూ అతను తనని పలకరించిన వారితో ఎవరితోనో మాట్లాడటానికి కొంచెం పక్కకి వెళ్ళాడు.

"త్వరగా వెడదాము. ఇంకొంచెంసేపటిలో బయలుదేరుతారుట..." వెళ్ళిన వాడు మళ్ళీ రావు దగ్గిరికి వచ్చేశాడు.

హాలులో అగరవత్తుల పొగతో పువ్వుల వాసనలు కలిసిపోయి ఉన్నాయి. శవాన్ని గదిమధ్యలో పడుకోబెట్టారు. ముసలాయన భార్య పక్కనే కూర్చుని ఉంది. తల వంచుకుని ఉండటంచేత వెక్కిళ్ళతో కదిలే వంటినిబట్టి ఆమె ఏడుస్తోందని గ్రహించాడు రావు. ఆమె పక్కన మూగిఉన్న ఆడవారు ఏదో చెవుతున్నారు. రావు రాకని గమనించిన ఒకావిడ వంగి వృద్ధురాలి చెవిలో ఏదో చెప్పింది. ఆవిడ తలఎత్తి రావు వయిపు చూసింది. ఉబ్బిపోయి ఉన్న మొహం మీద కన్నీటి చారలు కట్టి ఉన్నాయి. రావు నమస్కారం పెట్టాడు. కాని ఆమె చూపులో గుర్తింపు ఏదీ కనపడలేదు. కొన్ని క్షణాలు అక్కడే నుంచుని రావు వరండాలోకి వచ్చేశాడు.

"మీకూ దెబ్బ తగిలి ఆసుపత్రిలో ఉండిపోయారు కాని లేకపోతే ఈ పని అంతా మీకే తగిలేది!" వరండాలో అతనితో మాట్లాడటానికి చుట్టూ చేరిన వారిలో ఒకరు అన్నారు.

"ఇప్పుడయినా ఏమి చెయ్యాలో తోచటం లేదు..." అన్నాడు రావు ఆ వ్యక్తితో.

"ముసలాయన తమ్ముడు రాగానే అంతా తెలుస్తుందిలెండి!" ఈ సమాధానం రావులో సన్నటి కలవరాన్ని లేవదీసింది. చెంగప్పని 'తమ్ముడు' కలుసుకుంటే...

"కారులో బయలుదేరాడుట. ఈపాటికి ఇక్కడికి వచ్చేసి ఉండాలి." రావుతో మాట్లాడుతున్న ఆయన రిస్టువాచి చూసుకుంటూ అన్నాడు.

'ఇంతలో తను వెళ్ళి చెంగప్పని కలుసుకోవచ్చు" అనుకున్నాడు రావు. ఇంట్లో ఎక్కడో టెలిఫోను మోగింది. దానిని తియ్యటానికి వెళ్ళిన మనిషి కాబోలు వచ్చి రావుతో అన్నాడు "చిన్న అయ్యగారు మీకోసం ఫోన్ చేశారు. మిమ్మల్ని వెంటనే ఆఫీసుకి రమ్మన్నారు!"

"ఇక్కడికి రాకుండా ఆఫీసుకే ముందు వెళ్ళారన్నమాట తమ్ముడు గారు..." అంతకిముందు రావుగారితో మాట్లాడిన వ్యక్తి అన్నాడు.

రావులో ఆందోళన బాగా ఎక్కువ అయిపోయింది. ఎవరికీ ఏమీ చెప్పకుండా టెలిఫోన్ దగ్గిరికి వేగంగా నడిచి వెళ్ళిపోయాడు.

"చెంగప్పగారు లేరండీ! మీ మేనేజింగ్ డయిరెక్టర్ ఆఫీసుకే వెళ్ళారు..."

రావు టెలిఫోన్ రిసీవరుని పెట్టేసి నెమ్మదిగా బయటికి నడిచి వెళ్ళాడు. □

## కవి వారసత్వం

### నిఖిలేశ్వర్

కవితాక్షరాల
నిషిద్ధీకృతమైన అనంతశక్తి
ధనానికేం తెలుసు?
పాలకుల దురాత్ములకేం తెలుసు?
అహంభావంతో షిరపీగేకవిత్వం
విలువలు పలువలుగా—
కథలల్లే కబుర్లరాయుళ్ళకే అంకితం!
తానుతప్ప ప్రపంచమంతా
పొట్టిపోయిందనే
ధూర్తప్రేలాపనలకేం తెలుసు—
ప్రతి మహోన్నతమైన కవికిపూర్వం
మరికొందరు వుండనేవున్నారు
ఆతర్వాత వచ్చేతరాల వెంబడి
ఇంకెందరో పుడుతూనే వుంటారు!

# ఆదా చేయండి రు. 11లు!

పోస్టుద్వారా
భారతి
తెప్పించుకోండి!




ఆఫ్‌సెట్
ముద్రణలో
భారతి !

భారతి సంవత్సర చందా (పోస్టు ద్వారా రు. 51/–లు) ఒకేసారి చెల్లించే వారికి రు. 11/–ల 'ముదరా' వుంటుంది.

**అంటే మీరు కేవలం రు. 40/–లు చెల్లిస్తే ప్రతినెలా భారతి పోస్టు ద్వారా మీ ఇంటికే అందుతుంది.**

చందా పైకమును ఆంధ్రపత్రిక, గాంధినగరం, విజయవాడ–3కి మనియార్డరు లేదా డిమాండు డ్రాఫ్టు ద్వారా పంపుతూ ఈ దిగువ కూపను జతవర్చ కోరుతాము.

**నేను 'భారతి' మాసపత్రికకు చందాదారునిగా చేరదలుచుకున్నాను చందా పైకము రు. 40/– డి.డి. / ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.**

పేరు : ______________________

ఊరు : ______________________

చందాదారుని సంతకం

సీరియల్

# సహగమనం




## మధురాంతకం నరేంద్ర

(గత సంచిక తరువాయి)

### 9

ఆ రోజు—

చాలా రోజుల తరువాత సూర్యోదయాన్ని చూసింది మానస.

యింకా నిద్రపోతున్న నగరవాసులపైపు ఆకాశం కళ్లెర్రజేసి చూస్తోంది, కార్పొరేషన్ కొళాయి మిమిక్రి ప్రాక్టీసు చేస్తోంది.

మార్నింగ్‌వాక్ చేస్తున్న ముసలివాళ్ళూ, రన్నింగ్ ప్రాక్టీసు చేస్తున్న కుర్రాళ్ళూ, నిద్రపోతున్న రోడ్లను తట్టితట్టి లేపుతున్నారు.

పాలవాడి కేకతో మెలకువ తెచ్చుకున్న అన్నపూర్ణ మిల్క్ కుక్కర్ని స్టౌపైకెక్కించి, కూతురిపడక ఖాళీగా కనిపించడంతో వెతుక్కుంటూ మేడపైకొచ్చి చూసింది.

"యివ్వాళింత తొందరగా నిద్రలేచేశావేమిటే అమ్మాయ్!" అంటూ ప్రశ్నించింది విస్తుపడిపోతూ.

బ్రష్‌తో తల దువ్వుకుంటూనే, మానస వెనక్కి తిరిగి చూసింది.

"అదేమిటిలా నవ్వుతావ్? అప్పుడే ముఖం కడుక్కునేశావన్నమాట!—"

"ముఖం కడుక్కోవడమే కాదు - స్నానంగూడా చేసేశాను—తల స్నానం—"

"యీ రోజేమైంది నీకు? నిన్నంతా ముక్కుతూ మూలుగుతూ వున్నావు గదా! యింత పొద్దున్నే లేచి స్నానమెందుకు చేశావు? పోనీ నీళ్ళయినా కాచుకున్నావా?" ఆమె కంగారుపడసాగింది.

"అయిదున్నరనుంచీ టాప్‌లో నీళ్ళొస్తున్నాయి. వుదయాన్నే వచ్చే నీళ్ళు, గోరువెచ్చగా యెంత ఫ్రెష్‌గా వుంటాయో తెలుసా అమ్మా నీకు—"

చాలా రోజుల తరువాత మానస ముఖంలో చిరునవ్వు కనిపించింది.

అయితే ఆనందించడానికి బదులుగా, అన్నపూర్ణ మరింతగా ఆందోళన పడసాగింది. "చన్నీళ్ళతో తలస్నానం చేశావా? యిదేం పోయేకాలమే నీకు? యేమిటీ అఘాయిత్యపు పనులు?—" అంటూ కేకలేయసాగింది.

"అబ్బబ్బా, ఉదయాన్నే అలా సైరన్‌లా గొంతు చించుకుని అరుస్తావెందుకు? ముందు కిందికి వెళ్దాం పద! వేడిగా కాఫీ తాగితేగానీ నీకు కోపం తగ్గదు."

తల్లికంటే ముందుగా మానసే కిందికి వచ్చేసింది.

వంటగదిలోకి వెళ్ళి తానే కాఫీ కలిపింది.

"అలా కళ్ళయినా ఆర్పకుండా చూస్తున్నావేమిటి? వింతగా కనిపిస్తున్నానా నేను?" కాఫీగ్లాసు అందిస్తూ ప్రశ్నించింది.

"చిన్నప్పటినుంచీ నువ్వు యెప్పటికప్పుడు వింతగానే కనిపిస్తూ వచ్చావు. కానీ యివ్వాళెందుకో మరీ విచిత్రంగా కనిపిస్తున్నావు—" అంది ఆమె.

"ముఖం వేలాడేసుకుని కూచున్నానని కంప్లయింటు చేసేదానివి గదా! యీ రోజునుంచీ నవ్వుతూ కనిపించాలని అనుకున్నాను. నేను నవ్వుతుంటే నీకేమో విడ్డూరంగా కనిపిస్తోంది—"

"........."

ఖాళీగ్లాసు డైనింగ్ టేబుల్‌పైన ఉంచుతూ "కొంచెం త్వరగా టిఫెను తయారు కావాలి. ఈ రోజు చాలా పెద్ద ప్రోగ్రాముంది..." అంది మానస.

"యేమిటది?" మరోసారి విస్తుపోతూ అడిగింది అన్నపూర్ణ.

"ఓసారి వూరు తిరిగి రావాలి. నువ్వేమీ కంగారుపడవలసిన అవసరం లేదులే! మా ఫ్రెండును కలుసుకోవాలి. చాలా రోజులయింది గదా చూసి—అందుకని..."

తన గదిలోకొచ్చి దినపత్రిక తిరగేస్తూ కూర్చొంది మానస.

కిటికీలోంచి నీరెండ పడుతోంది.

వీధిలో కూరగాయల వాడి కేకలు వినిపిస్తున్నాయి.

హెడ్‌లైన్స్ చూసిన తరువాత, దినపత్రికను కింద పడేసి, కుర్చీలోనే చేరగిలబడిపోయింది మానస.

నిన్నటి రాత్రి దొంగతనంగా వేసుకున్న రెండో నిద్రమాత్ర బుర్రలోంచీ ఆలోచనల్ని తరిమి కొట్టినట్టుంది. ఇంకా తల భారంగా వుంది.

మానస కళ్ళు మూసుకొంది.

'హృదయంలో శూన్యం ... మానవారణ్యంలో ఒంటరితనం...యెంత బిగ్గరగా పిలిచినా ప్రతిధ్వని సైతం వినిపించని పరిస్థితి...యేడుస్తూ యీ లోకంలోకి వూడిపడక మునుపెక్కడున్నాన్నేను? యే నిశిరాతిరి ప్రవాహంలోంచీ కొట్టుకొచ్చా నీవలికి? యే దుర్గమారణ్యాల పొదలమాటున దారితోచక కూలబడ్డాను? వొక చీకట్లోంచి మరో చీకట్లోకి...వొక అరణ్యంలోంచీ మరో అరణ్యంలోకి... యెక్కడికి?...యెంత దూరం?...యెంత కాలం...'

మానస విసుగ్గా గోడ గడియారంకేసి చూసింది.

ప్రతిక్షణాన్నీ నెమ్మది నెమ్మదిగా నమిలి మింగుతూ, పెద్దముల్లు భుక్తాయాసంతో భారంగా నడక సాగిస్తోంది.

మానస వంటగదివైపుకు నడిచింది.

"అయిదు నిముషాలు...యెనిమిది గంటలు కొట్టక మునుపే టిఫెను పెట్టేస్తాను..." అంది అన్నపూర్ణ.

తన గదికి వెళ్ళి, బట్టలు మార్చుకుని వచ్చింది మానస.

ప్లేటులో యిడ్లీలు పొగలు కక్కుతూ కనిపించాయి.

టిఫెను తింటూ వుండగా "యేమిటో విశేషం? యివ్వాళ యింత త్వరగా టిఫెను తింటున్నావు?" అంటూ పలకరించాడు సాగర్, బ్రష్‌పైకి పేస్టు వేసుకుంటూ.

మానస సమాధానం చెప్పలేదు.

"యెవరో స్నేహితురాలిని కలుసుకోవాలిట." అంటూ అన్నపూర్ణే సమాధానం చెప్పింది.

"యెక్కడ కలుసుకోవాలి?..."

"........."

"కాస్సేపాగితే, నేను కాలేజీకి వెళ్తూ వెళ్తూ నిన్ను డ్రాప్ చేసి వెళ్తాను-"

ఓసారి తల పైకెత్తి చూసి, తిరిగీ మౌనంగా వుండిపోయింది మానస.

ఆమె ధోరణి అతనికర్థం కాలేదు.

తాను బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

టిఫెను ముగిసిన తరువాత, హేండ్‌బాగ్‌నోసారి సవరించుకుని "మరి నేను బయల్దేరుతాను" అంది మానస.

"మీ అన్నయ్య డ్రాప్ చేస్తానన్నాడు గదా!" అంటూ ప్రశ్నించింది అన్నపూర్ణ.

"మరేమీ పరవాలేదులే! వొంటరిగా వెళ్ళడం నాకూ చేతనౌను. అన్నింటికీ తోడు కావల్సిన అవసరం లేదు..."

మానస యింటి బయటికొచ్చేసింది.

బస్‌స్టాపు దగ్గర అప్పుడే జనం గుమికూడిపోయారు.

రైలింగ్ నానుకుని నిల్చుంది.

ఎదురుగా కాంపౌండు వాల్‌పైన సినిమాపోస్టర్లూ బట్టలషాపుల ప్రకటనలూ ప్రక్కప్రక్కనే కొలువు తీరిపోయి వున్నాయి.

మార్నింగ్‌షోలతో నూరురోజుల పండుగ జరుపుకున్నానని ఫోజు కొడుతున్న పౌరాణిక చిత్రానికి పక్కనే నిలువెత్తు 'యే' లోంచీ తొంగిచూస్తున్న క్లబ్ డాన్సరు చిత్రం...

'చూస్తే సతీసావిత్రయినా చూడాలి. లేకపోతే శృంగార రాత్రులయినా చూడాలి' అనేది హరిణి.

'హరిణి!...యెన్నాళ్ళ తరువాత జ్ఞాపకం వచ్చింది...' అనుకొంది మానస. 'తానూ, హరిణీ కాలేజీకి కలిసే వెళ్ళేవాళ్ళు! అదే బస్టాండులో టౌను బస్సుకోసం గంటల తరబడీ నిలబడి కబుర్లు చెప్పుకునేవాళ్ళు. కాలేజీకెళ్ళే కాలనీ కుర్రాళ్ళూ, అమ్మాయిలూ అక్కడే గుమికూడి పోయేవాళ్ళు...అమ్మాయిల దృష్టిలోకి రావడం కోసం పిచ్చి పిచ్చి వేషాలు వేసే అబ్బాయిలూ, అబ్బాయిలవైపు దొంగచూపులు చూసే అమ్మాయిలూ - యెంత సరదాగా గడిచేవా రోజులు'! బిగ్గరగా నిట్టూర్చింది మానస.

'యెంతో అమాయకురాలిగా కనిపించే హరిణి: అలాంటిపని చేస్తుందని ఎవరనుకున్నారు? తనకు తానుగా ప్రేమలేఖ వ్రాసి, అతడి చేతి కందించిందన్న విషయం - ఆవిడే చెబుతూంటే విన్నప్పుడు తానెంత ఆశ్చర్య పడిపోయిందనీ! అతడి పేరేమిటి? యేమిటో!...గుర్తు లేదు...యెప్పుడూ ట్రిమ్‌గా కనిపిస్తూ వున్నాడని 'ప్రిన్స్' అని పిలిచేవాళ్లు...అసలు పేరు జ్ఞాపకం లేదుగానీ, నిక్‌నేమ్ మాత్రం గుర్తుండిపోయింది. ఆ ప్రిన్స్‌గాడు హీరో ఫోజుపెట్టి - నువ్వు నిజంగా ప్రేమించి వుంటే, నీ స్నేహితురాలిని పరిచయం చేయమని అడిగాడట! తన



దగ్గరికొచ్చి, ఆ మాట చెప్పి భోరుమని యేడ్చేసింది హరిణి. ఆ ప్రిన్స్‌గాడు వాడికా పేరు సరిపోదు - వాడిని విలన్ అని పిలవాలి - వాడు ఆ పిల్ల రాసిన ఉత్తరాన్ని తన మిత్ర బృందానికంతా చూపెట్టి రాద్ధాంతం చేసేశాడు. హరిణి తల పైకెత్తుకుని తిరగలేకపోయింది. చివరకు కాలేజీ మానేసి యింట్లోనే కూర్చొంది. తనసప్పటినుంచీ అన్నయ్య స్కూటర్‌లో తీసుకెళ్ళి కాలేజీ దగ్గర డ్రాప్ చేసి వెళ్ళేవాడు. ఆ ప్రిన్స్‌గాడు — కాదు, ఆ విలన్‌గాడు - తన కాలేజీ చుట్టూ ప్రదక్షిణలు చేసేవాడు. ఓసారి యేదో కవరు తన చేతి కందివ్వబోతుంటే చాచి లెంపకాయనొకటి ప్రసాదించింది తాను...అప్పటినుంచీ గడ్డం పెంచుకుని తన వెనకే ఫాలో అవుతూ వుండేవాడు. వాడు నిన్ను ప్రేమిస్తున్నానని చాటించు కుంటున్నాడు - అని కొందరు స్నేహితురాళ్లు చెప్పేవాళ్ళు. -వాడి మొహం! మా అన్నయ్యతో చెబితే సున్నంలోకి యెముకలు దొరకవు — అంటూ నవ్వేసేది తాను...హరిణి కాలేజీ మానేయడానికి కారణభూతుడయిన అతడ్ని తలుచుకుంటే, వొళ్ళంతా తేళ్ళు జెర్రియా పాకినట్టుగా అనిపిస్తుంది తనకు...అయినా పిచ్చి హరిణీ! నీకు ప్రేమించే హక్కెక్కడుంది? యీసడించుకునే అమ్మాయిని వేధిస్తూ వెంటాడే దుర్మార్గుడు అమర ప్రేమికుడు...వాడు హీరో...కానీ నువ్వు...పిచ్చి హరిణీ...'

బస్సొచ్చి నిల్చుంది.

మానస బస్సెక్కి యెక్కక మునుపే బస్సు కదిలేసింది.

ఖాళీసీటు కనిపించలేదు.

యువకుడొకడు పైకి లేచి, "మీరు కూచోండి, నేను నిలుచుంటాను" అన్నాడు ఉదారంగా.

"నో...థాంక్స్..." మానస ముఖం ముడుచుకుని, ముందుకెళ్ళి మరో చోట నిల్చుంది.

డబుల్ సీటర్‌లో కూచున్న గృహిణి, వాక్యానికి రెండువైపులా 'మావారు' అన్న మాటని మరచిపోకుండా అమరుస్తోంది.

మరోవైపున కూచున్న నడివయసు వ్యక్తి తన రాజకీయ పరిజ్ఞానాన్ని ప్రకటించుకుంటున్నాడు.

పరిగెడుతున్న బస్సు కిటికీలోంచీ నగరం సైతం పరిగెడుతున్నట్టుగానే కనిపిస్తోంది.

బస్సు మొక్కుబడిపు కోసమన్నట్టుగా రెండు మూడు స్టాపులలో ఆగి నట్టుగా ఆగి, ప్రయాణం కొనసాగించింది.

అరగంట ప్రయాణం తరువాత కండెక్టరు 'రింగ్‌రోడ్సు' అంటూ కేక వేశాడు.

మానస గబగబా గేటు దగ్గరికొచ్చి నిల్చుంది.

బస్సాగగానే దిగేసింది.

తానెక్కడ దిగానో తెలుసుకోవడం కోసం వోసారి చుట్టూ తిరిగి చూసింది.

పడిపోయిన ప్రహరీ గోడతో 'చిల్డ్రన్స్ పార్క్' కనిపించింది.

పార్కు ప్రక్కన వరుసగా ఏవేవో అంగళ్లు...అటుపక్క వొక ఆటో మొబయిల్ షాపు...దానికోవైపున పెద్ద సినిమా థియేటరు...

'యీ పార్క్ గనుక లేకపోతే తానీ ప్రదేశాన్ని గుర్తుపట్టడం సాధ్య మయ్యేది గాదు. యిటువైపు అంగళ్ళసలు వుండేవి కావు. సినిమా కెళ్ళాలంటే టౌను బస్సెక్కాల్సి వుండేది. అప్పుడిది నగరానికి శివారు...యిప్పుడు హార్ట్ ఆఫ్ ది టౌను...పదిహేనేళ్ళలో యెంత మార్పు!...'

రైలింజనుకంటే యేం తీసిపోయానో చూపెట్టమని సవాలు చేస్తూ బస్సు వెళ్ళిపోయింది.

రోడ్డుపైన రకరకాల వాహనాలు అటూ యిటూ పరుగులు తీస్తున్నాయి.

మానస ట్రాఫిక్ తగ్గేవరకూ వేచి చూసిన తరువాత రోడ్డు క్రాస్ చేసి, పార్కు గోడ వెంబడే నడవసాగింది.

'అయ్యయ్యో! పార్కిలా నాశనమై పోయిందేమిటి? ఒకప్పుడెంత అందంగా వుండేది? నందనవనంలా కనిపించేది! సిమెంటు బెంచీలు విరిగి పోయాయి. యెటు చూసినా పిచ్చి మొక్కలు...వృక్షాల కొమ్మలన్నీ విరిగి పోయాయి...వూయల బల్ల దగ్గర రెండు స్తంభాలు మాత్రమే కనిపిస్తున్నాయి. గొలుసులు గూడా లేవు. స్కూలు వదిలిపెడితే చాలు, యింటి లోపలికి పుస్తకాల సంచీ విసిరిపారేసి, పార్కులోకి పరిగెత్తుకొచ్చేసేది తాను. యెందరు స్నేహి తులు! చిన్ని - బాబీ - రాము - సుబ్బి - వూయల వూగడం కోసం నేనంటే నేనని కీచులాడుకునేవాళ్లు అందరూ...జారుడుబల్ల సైతం విరిగిపోయింది-ఎద్దులా పెరిగిపోతున్నావు. యింకా యీ ఆటలేమిటి నీకు?- అంటూ కేకలేస్తూ వుండేది అమ్మ! ఒకనాడు అమ్మ సరాసరి పార్కుకే వచ్చేసింది! చెవి మెలేసి యింటికి లాక్కెళ్ళిపోయింది! మగపిల్లలతో స్నేహం చేయడానికి నువ్వింకా చిన్నపిల్లవి కావు-పదేళ్ళయినా నిండలేదు...తానప్పుడే పెద్దదయిపోయిందా?...యేమో! ఆవేళ్టినుంచీ పార్కులో ఆడుకునే పిల్లలవైపు అసూయగా చూడడం తప్పితే యెప్పుడూ లోపలికడుగు పెట్టలేదు...'

పార్కు వెనకవైపుకొచ్చిన తరువాత, యెదురుగా కనిపిస్తున్న యిళ్ళ వరుసకేసి చూసింది మానస.

'యీ వీధి సైతం గుర్తు పట్టలేనంతగా మారిపోయింది. చిన్నప్పుడు, కొద్ది సంవత్సరాలకాలం యిక్కడే వున్నామని అనుకుంటే ఆశ్చర్యం కలుగుతోంది. అసలింతకూ తమ యిల్లెక్కడ?...అప్పుడు నాన్న గుమాస్తా మాత్రమే! యేదో స్కీము సహాయంతో యిక్కడో యిల్లు దొరికింది. టూ రూమ్ టైపు క్వార్టర్సు కొత్త యిల్లు కట్టుకున్న తరువాత దీన్నెవరికో అమ్మేశారు.

మానస చిట్టచివరికెలాగో తమ యింటిని గుర్తుపట్టగలిగింది. ముందున్న వరండానంతా పడగొట్టి, రీమోడలింగ్ చేసిపారేశారు. యిల్లు రోడ్డు పక్కనే వుండటం చేత, ముందో గదిని కట్టించుకుని, అక్కడో ఫ్యాన్సీషాపు పెట్టు కున్నారు.

షాపులోకెళ్ళి నిల్చుంది మానస.

అద్దాల తలుపులున్న షోకేసుల్నిండా యేవేవో వస్తువులు సర్దుకుని కూర్చుని వున్నాయి.

గుమ్మం దగ్గరి బెంచీపైన రకరకాల సైజుల్లోని సీసాలు తమ తమ సంపదల్ని ప్రదర్శించుకుంటున్నాయి.

యెరల్ని తగిలించుకున్న గాలాళ్లా, పై కప్పునుంచీ కాస్మెటిక్స్ పాకెట్ల దొంతరలు వ్రేలాడుతున్నాయి.

కాష్‌బాక్సు దగ్గర కూర్చున్న స్థూలకాయుడు "యేం కావాలి?" అంటూ ప్రశ్నించాడు.

డోర్ కర్టెనులోంచీ గృహాంతర్భాగంలోకి చూపులు సారిస్తున్న మానస ఉలిక్కిపడింది.

సమాధానం కోసం కాస్సేపు తికమక పడిపోయిన తరువాత, "మరి.. మరి...నాకు...జాన్సన్స్ బేబీ పౌడర్..." అంటూ షోకేసులకేసి దృష్టిని మర ల్చింది.

"స్టాక్ లేదండీ..." అన్నాడతను.

"హెయిర్ పిన్నున్నాయా?"

అతడు పైకి లేచి, హెయిర్‌పిన్స్ కోసం వెతకసాగాడు.

'వొకప్పుడిది తమ యిల్లు...తన బాల్యానికంతా ఆలంబనగా నిలిచిన యిల్లు...అన్నయ్యా, తానూ యిక్కడే పుట్టారు. యీ యింటిని గురించిన అనుభూతులు ఇంకా తనని వదలిపెట్టలేదు. ఆ రోజుల్ని అమ్మ గూడా యింకా తలుచుకుంటూనే వుంటుంది. మొదటిసారి కడుపుతోన్నప్పుడు తనకు కూతురు కావాలని అమ్మ కోరుకొందట! కానీ నాన్న మాత్రం కొడుకు కావాలని అనుకున్నారట। అమ్మ తన కోరికను వెల్లడించినప్పుడు నాన్న విస్తుపోయారట!-జ్యేష్ఠ సంతానం కొడుకే కావాలని యెవరయినా అనుకొంటారు. నీలా విచిత్రమైన ఆశల్ని పెట్టుకోరెవ్వరూ—అంటూ నాన్న చీకాకు పడ్డారట! రెండోసారయినా తన కోరిక తీరినందుకు తానెంత ఆనందపడిపోయానో ఆమె యింకా చెబుతూ వుంటుంది...'

షాపువాలా హెయిర్‌పిన్స్ పెట్టెను తీసుకొచ్చి మానస ముందుంచాడు.

పసిపాపగా తాను జోగాడిన యిల్లు...తాను తప్పటడుగులు వేసిన స్థలం-గోడను పట్టుకుని బుడి బుడి నడకలు నడచిన చోటు-స్నేహితులతో కలసి దాగుడుమూతలాడుకున్న చోటు-అన్నట్టు లోపలి హాల్లో తలుపుల వెనక చిన్న దీగుడొకటి వుండాలి—తానక్కడే దాక్కొంటూ వుండేదెప్పుడూ'

"యేది కావాలండీ?" షాపతను విసుక్కొంటున్నాడు.

మానస వూదా రంగు పిన్నులనూ, అయిదు రూపాయల నోటునీ అతడి ముందుంచింది.

చిల్లర డబ్బులతోబాటూ పిన్నుల్ని హాండ్‌బాగులోకి గిరవాటు బెట్టి బయటకు నడచింది.

సైకిలుపైన కుర్రాడొకడు రాకెట్టులా దూసుకొచ్చి, అంగడిముందు ఆగాడు. మానసను ఢీకొట్టినంత పనిచేసిన తరువాత 'సారీ' నొకదాన్ని ప్రసారం చేసి, అంగడిలో కెళ్ళిపోయాడు.

కాస్సేపు యింటికేసి చూస్తూనే నిలబడిపోయింది మానస.

నాలుగయిదడుగులకోసారి వెనుదిరిగి చూస్తూ నడవసాగింది.

'యిదే వరండాలో నాన్న సైకిలుండేదొకప్పుడు. అన్నయ్య సైతం సైకిలెక్కి రయ్యిమని తిరిగేవాడు. తానూ నేర్చుకోవాలని మారాం చేసింది. అన్నయ్యే నేర్పాడు. పంజాబీ డ్రస్సు తొడుక్కుని, సైకిలు తొక్కుతూ, కాలనీ వీధుల్లో జోరీగలా గింగిరాలు తిరుగుతూ వున్నప్పుడు, అందరూ ముక్కున వేలేసుకునేవాళ్ళు! కొత్త యింటికి వెళ్ళిపోయిన తరువాత హైస్కూలు దూరమయిపోయింది. వుమెన్స్ సైకిల్ కొనుక్కుని, స్కూలు కెళ్తానని తాను మారాం చేసింది-ఆడపిల్ల లెక్కడయినా సైకిల్ తొక్కుతారా?'-అన్నాడు అన్నయ్య. వొద్దమ్మా! అసలే హెవీ ట్రాఫిక్! నీ చేతగాదు-అన్నాడు నాన్న. బుద్ధిగా రిక్షాలో వెళ్ళిరా! యిష్టం లేకపోతే టౌను బస్సుందనే వుంది—అది అమ్మ ఆర్డరు—టౌను బస్సే తనకు శరణ్యమయింది-'

మానస నాలుగురోడ్ల కూడలిలో ఆగిపోయింది.

**'తానెటువైపు కెళ్ళాలి? యింతకూ తానెందుకు బయల్దేరింది? యెవరిని కలవాలి?**

"ఆటో కావాలా మేడమ్?"

మానస ఆటో డ్రయివరుకేసి చూడనయినా చూడలేదు. వెనకసీట్లోకెక్కి కూర్చుంది.

"యెక్కడికి కెళ్ళాలి మేడమ్?"

"వుమెన్స్ కాలేజ్-'

"యే వుమెన్సు కాలేజీ-"

"శారదా వుమెన్స్ డిగ్రీ కాలేజీ-"

ఆటో డ్రయివరు గేరును గుయ్యిమనిపించాడు.

హార్డిల్స్ చాంపియన్‌లా ఆటో పరిగెత్తసాగింది.

యే రోజుకారోజు కొత్తగా కనిపించే నగరం-యెప్పటికప్పుడు నిత్యనూతనంగా కనిపించే వీధులు - ప్రతిరోజూ పండుగేనంటున్న అంగళ్ళు - పోరాటమే సహజ ప్రవృత్తని చాటుతూ పరుగులు తీసే జనసమూహాలు-

పసుపురంగు భవనమొకటి వెనక్కెళ్ళిపోయింది.

'యిదేమిటి? తన హైస్కూలు బిల్డింగు సైతం కొత్త అవతారాన్నెత్తినట్టు కనిపిస్తోంది...ఆనాటి జింక్‌షీట్ల షెడ్లేమయ్యాయి? ప్రతి యేడాదీ తరగతిలో ఫస్టు మార్కులు తెచ్చుకున్నందుకు ప్రయిజులందుకున్న వోపెనేర్ ఆడిటోరియమ్ సైతం కనిపించడం లేదు. బహుశా దాన్ని యిండోర్ ఆడిటోరియమ్‌గా మార్చి పారేశారేమో! తనకు ఫస్టు మార్కులొచ్చినప్పుడల్లా క్లాసుటీచర్లు పొగుడుతూ వుండేవాళ్ళు. తన ఆస్తినంతా యెవరో దోచుకెళ్ళిపోయినట్టుగా రమేష్ యేడ్చేవాడు...రమేష్!...రమేష్‌ను తలచుకున్నప్పుడల్లా అతడి చెంపల్ని వాయించిన సందర్భమే గుర్తుకొస్తుంది తనకు...తరగతిలో ప్రశ్నలకు సమాధానాలు చెప్పకపోతే చెంపదెబ్బలు వేయించడం మేడమ్ అలవాటు. ఒకనాడు రమేష్ చెంపల్ని వాయించాల్సిన పని తనకప్పగించింది ఆమె. తటపటాయిస్తూ నిల్చున్నందుకు తనకు సైతం అక్షింతలు పడ్డాయి. జవాబు చెప్పలేక పోవడంకంటే, తనచేత లెంపకాయలు తినడమే అతడి కవమానకరంగా తోచినట్టుంది. రమేష్ ఆ రోజు సాయంకాలం వరకూ యేడుస్తూనే తిరిగాడు-ఆడపిల్లలచేత లెంపకాయలు తింటేగానీ బుద్ధి రాదు మీకు—అంటూ మేడమ్ కేకలేస్తూనే వుండేది. అతనేమయిపోయాడు? ఇంజనీరింగ్ చేస్తున్నట్టు యెవరో చెప్పారు. తనకంటే తక్కువ మార్కులు తెచ్చుకున్న వ్యక్తి...ఇంజనీరయిపోయి వుంటాడు. తానేమో, చదువు కెగనామం పెట్టేసింది. పంటింటి కంకితమై పోయింది' మానస మరోసారి నిట్టూర్చింది. 'ఎసెస్సీ ముగిసిన వెంటనే తనకూ ఇంజనీరింగ్ చదవాలని అనిపించింది. ఆడపిల్లలేమిటి? ఇంజనీరింగ్ చదవడమేమిటి?-అన్నాడు అన్నయ్య. లేకపోతే తాను సైతం యెంచక్కా ఇంజనీరయిపోయి వుండేది...'

ఆటో వుమెన్స్ కాలేజీ దగ్గరికొచ్చి ఆగిన సంగతి ఆమె గుర్తించనే లేదు.

"ఫోర్ సెవన్టీఫైవ్ మాడమ్" అంటున్నాడు డ్రయివరు.

హేండ్‌బాగ్‌లోంచీ అయిదు రూపాయలనోటు తీసి అతడికిచ్చింది,

ఆటో దిగి, కాలేజీలోకి నడచింది.



మెయిన్ బిల్డింగ్ ముందున్న లాన్‌నిండా అమ్మాయిలు గుంపులు గుంపులుగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

వరండాలనిండా వొకటే సందడి.

తరగతి గదుల్లో లెక్చరర్లు గొంతు చించుకుంటున్నారు.

లాబ్స్‌లో పరీక్షనాళికల్ని చేతబట్టుకున్న విద్యార్థినులు బయటి ప్రపంచాన్ని మరచిపోయినట్టుగా కనిపిస్తున్నారు.

కాలేజీ భవనాన్నంతా వొకసారి ప్రదక్షిణం చేసేశాక మానస క్యాంటీన్లో కెళ్ళి కూచుంది.

టీ కెటిల్ ముందు కూర్చున్న ముసలావిడ కప్పుల్ని అమర్చుకుంటోంది.

కాష్ బాక్సు దగ్గర నిల్చున్న అమ్మాయి యేదో లెక్క వేసుకుంటోంది.

అవతలివైపు టేబులు చుట్టూ కుర్చీలు వేసుకుని కూర్చున్న అమ్మాయిల గుంపు ఇల్లెగిరిపోయేలా కేరింతలు కొడుతోంది.

'యెందుకొచ్చానిక్కడికి నేను? యెవరిని కలవడం కోసం? యే అనుభవాల్ని వెతుక్కోవడం కోసం? యే అనుభూతుల్ని నెమరువేసుకోవడం కోసం? ఇల్లు పంజరంలా కనిపించడంతో, బయటకెళ్ళాలని తోచినట్టుంది... ఇల్లు చిన్న పంజరం... ప్రపంచం పెద్ద పంజరం... తేడా అంతే కదా! భవిష్యత్తును గురించి ఆలోచించడానికి భయపడుతున్నప్పుడు, గతంలోకి తొంగిచూడాలన్న కోరిక పుడుతుందేమో! యెక్కడికీ పలాయనం? జీవితమే భూతంలా తయారైనప్పుడు ఎక్కడ తలదాచుకోవాలి?'

కాలేజీ గంట మ్రోగింది.

క్యాంటీనులోని అమ్మాయిలు బిలబిల మంటూ వెళ్ళిపోయారు.

మరో గుంపు లోపలి కడుగు పెట్టింది.

"హలో మానసా?"

'తనను పలకరించే వారెవ్వరున్నారిక్కడ?'

"వాట్ యే సర్‌ప్రయిజ్! యెప్పుడొచ్చావు? మళ్ళీ కాలేజీలో చేరదలచుకున్నావా యేమిటి కొంపదీసి!"

మానస చిరునవ్వు నవ్వడానికి ప్రయత్నించింది.

"కబుర్లు తరువాత... ముందు టీ తాగాలి... ఇంగ్లీషుమాడమ్ షేక్స్‌పియర్ ఏడుపునంతా నెత్తిపైన దిమ్మరించిందింతవరకూ... డామ్ బోర్..."

తానే వెళ్ళి రెండు కప్పుల టీ పట్టుకొచ్చింది.

"ఇప్పుడు చెప్పు... యేమిటీ విశేషాలు?..."

"నువ్వింకా డిగ్రీ పూర్తి చేయలేదా జలజా?"

"చేస్తానన్న నమ్మకం గూడా లేదు." జలజ నవ్వేసింది - నీకు తెలుసు గదా!—నాకీ చదువు మొదటినుంచీ వొంటబట్టలేదు. ఇంట్లో కూచుంటానంటే అమ్మా నాన్నా ఒప్పుకోరు. ఇంటర్మీడియట్ పూర్తి చేయడానికే నాలుగేళ్ళు పట్టింది నాకు. ఇక్కడ యియర్లీ డీటెన్షన్ సిస్టమ్ లేదుకాబట్టి ఫైనల్లోకొచ్చి పడ్డాను. రెండు సంవత్సరాలకూ కలిసి ఇంకా ఎనిమిది పేపర్లు మిగిలిపోయి వున్నాయి-"

"........."

ఖాళీ టీ కప్పును టేబులుపైన వుంచుతూ "చెప్పవోయ్ యేమిటీ విశేషాలు? పెళ్ళి తరువాత మాకు డిన్నరిస్తానని యెగ్గొట్టేశావు. పోనీలే యీ సంగతి చెప్పు- వొంటరిగా వచ్చావా, మీ ఆయన్ని వెంటబెట్టుకొచ్చావా?—" అంటూ అడిగింది జలజ.

"మావారు—ఆయన—"

"రాలేదా? పోనీలే! యేమయినా విశేషముందా? డిన్నరు లాంటిదిచ్చే అవకాశం..."

"మన కాలేజీ విశేషాలేమిటో చెప్పు—" మానస విసుగ్గా అడ్డు తగిలింది.

"కాలేజీలో విశేషాలా? యేముంటాయి? వొకటే విశేషం - డామ్ రొటీన్—"

"మేడమ్స్ అందరూ బాగున్నారా?"

"వాళ్ళకేం దివ్యంగా వున్నారు. స్టూడెంట్ల ప్రాణాలే పోతున్నాయి—"

"మన మీనాక్షి మేడమ్ ఎలా వున్నారు?"

"యెవరూ, ఆ తెలుగు లెక్చరరా? ఆమెకొకటే బాధ—పెళ్ళి కాలేదు. పాఠం చెబుతూ చెబుతూ, సమయం దొరికినప్పుడల్లా మగవాళ్ళని తిట్టడం మొదలుపెడుతుంది. తన బాధే ప్రపంచం బాధని ఆమె ఉద్దేశ్యం. వయసులో వున్నప్పుడే పెళ్ళి చేసుకోవాలి గానీ, ఇప్పుడు మగవాళ్ళని తిడితే లాభమేముంటుంది? చూస్తూ చూస్తూ ముసలావిడని యెవరు చేసుకుంటారు చెప్పు-"

"పాపం. ముప్ఫయి అయిదేళ్ళయినా నిండివుండదు. ఆమెను ముసలావిడంటున్నావేమిటి నువ్వు-"

"కాకపోతే పదహారేళ్ళ బాలాకుమారని అనమంటావా చెప్పు—" జలజ జోక్ వేసినట్టుగా నవ్వేసింది.

"మరి సుశీల మేడమ్ సంగతి-" మానస టాపిక్ మార్చడానికి ప్రయత్నించింది.

"ఆమెదింకోరకం బాధ - ఆమెగారేమో యీ వూళ్ళో ఉద్యోగం చేయాలి. వాళ్ళాయనగారేమో ఆ వూళ్ళో ఉద్యోగం చేయాలి. యీమధ్య ఆయనగారక్కడ వొకమ్మాయిని రెండో పెళ్ళి చేసుకున్నారట! ఈమె గారిక్కడ యేడుస్తూ కూర్చున్నారు"

"మొదటి భార్య బ్రతికుండగానే ఇంకో పెళ్ళా? అయితే యీమెను వదిలిపెట్టేశాడా?-"

"అదేమీ లేదు. మహారాజుగారికి ఇద్దరు భార్యలు - యీమెగారేమో పట్టపురాణి. అక్కడ ముద్దులభార్య-"

"మేడమ్‌గారు కోర్టుకెళ్తే?-"

"ఈమెకంత ధైర్యమే వుంటే ఆయనెందుకిలా చేస్తాడు? పూర్తిగా తనని మరచిపోకుండా వారానికొకరోజయినా యీ వూరికొస్తే చాలునని ఆమె మొరబెట్టుకుంటూ వుంటుందట! - అన్నట్టు సుకుమారి మేడమ్ సంగతి తెలిసిందా నీకు?-"

"యేం జరిగింది?"

"గడచిన ఆగష్టు నెలలో ఆమె పెళ్ళి చేసుకుంది—"

"నిజంగా?!" మానస ఆశ్చర్య పడిపోయింది.

"పచ్చి నిజం - యెవర్ని మారేజ్ చేసుకుందో తెలుసా? అయనగారు రిటయిర్డు ఇంజనీరు - పొద్దున్నే వాకింగ్‌స్టిక్ చేతబట్టుకుని, భార్యని వెంటబెట్టుకుని, కాలేజీ గేటుదాకా వస్తాడాయన. ఆయనగారి మొదటి భార్య చనిపోయి నాలుగేళ్ళయిందట! - అన్నట్టు ఆయన పెద్దమ్మాయి మెడిసన్ చేస్తోందట!-"

"ఘోరం-" బాణం దెబ్బతిన్న పక్షిలా విలవిలలాడిపోయింది మానస.

"యేమిటి, ఆ అమ్మాయి మెడిసన్ చదవడమా?" జలజ బిగ్గరగా నవ్వసాగింది.

(64 వ పేజీచూడండి.)

శ్రీ సోమ సుందర్

# తిలక్ కవిత్వంలో విశ్వసనీయత- విశ్వజనీనత

బాలగంగాధరతిలక్ కవిగా కీర్తిశేషుడై, మొన్న జూలై ఒకటో తేదీకి పందొమ్మిదేళ్ళయింది. అతని కవితలలో విశ్వాసనీయత, విశ్వజనీనతలు ఓత ప్రోతంగా పాఠకుల నలరిస్తూనే ఉన్నాయి.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మన దేశాన్ని కృతక క్షామంలో ముంచెత్తారు. దానికి తొలి బలిపశువులుగా బెంగాలు ప్రజలు గురి కాబడ్డారు. మూడేళ్ళకాలంలో పదిలక్షల మంది ఆహుతి కాబడ్డారు. ఆ మహా క్షామం యావద్భారత దేశాన్నీ అతలాకుతలం చేసింది. సహృదయ రచయిత లెందరినో కదిలించింది. భారతీయ భాషలన్నిటిలోను పందలాది గొప్పరచనలు వెలువడ్డాయి.

ఆ దుస్సహ పరిస్థితిని చిత్రిస్తూ తిలక్-భూలోకం అనే కవిత అప్పుడే రచించి నవ్యసాహిత్య పరిషత్పత్రిక ప్రతిభలో ప్రచురించాడు.

"అస్థిమూల పంజరాలు
ఆర్తరావ మందిరాలు...
దారిపొడుగు జనశవాలు
జారిపడే చేయికాలు
ఏ లోకం తల్లీ యిది?
వంగదేశ క్షామం యిది..."

అంటూ దయనీయ హృదయాక్రోశాన్ని అక్షరబద్ధం చేశాడు. ఆ దారుణ పరిస్థితుల యథార్థం-కనుమరుగై పోయినా, ఆ కవిత పాఠక హృదయాన్ని ద్రవింప చేస్తుంది.

1956లో తిలక్ రచించిన గీతాలలో రెండిటిని ప్రస్తావించదలిస్తే మొదట దర్శనమిచ్చేది 'ప్రకటన'. ప్రథమ ప్రపంచయుద్ధం గడిచీ గడవకముందే సామ్రాజ్యవాదులు ద్వితీయ ప్రపంచ యుద్ధానికి ప్రయత్నాలు పథకాలూ ప్రారంభించారు. ఇరవై రెండేళ్ళలాగో గడిచాయి. స్పెయిన్‌లో ప్రజాస్వామికంగా ఎన్నుకోబడిన ప్రభుత్వాన్ని కూలదోయడానికి ఫ్రాంకో, ఫాసిస్టు ముస్సోలినీ శరణు జొచ్చాడు. అంతర్యుద్ధం ప్రారంభమైంది. ప్రపంచ ప్రఖ్యాత కవులూ, రచయితలు స్పెయిన్‌లో ప్రజాస్వామ్యాన్ని కాపాడటానికి స్వయంగా సమర రంగంలోని కురికారు. చివరికదే ద్వితీయ ప్రపంచయుద్ధానికి తెరఎత్తింది. కోట్లాది ప్రజలు నిహతులయ్యారు. 1945 మేలో బెర్లిన్ పతనంతోపాటు, జపాను నగరాలపై అమెరికా ఒంటెత్తుగా ప్రయోగించిన అటంబాంబుల ప్రళయం తోడురాగా ఆ మహాసంగ్రామం ముగిసింది.

తదాదిగా సామ్రాజ్యవాదులు తగాదాలు పెడుతూనే ఉన్నారు. పిల్లసమేరీలు జరుపుతూనే వున్నారు. అటం హైడ్రోజన్ నేపాం బాంబులను పెంచి ఆయుధగారాలు నెలకొల్పుతున్నారు. అవకాశం దొరికిన ప్రతిచోటా తలదూర్చి మారణ యుద్ధాలు జరుపుతూనే ఉన్నారు. కొరియాలో, వియత్నాంలో, మలయాలో, లెబనాన్‌లో యుద్ధవ్యూహాలు పన్ని భూమిని రక్తపంకిలం చేస్తున్నారు. ఆ సందర్భంలో రచించబడినదీ 'ప్రకటన'. మూడవ ప్రపంచ యుద్ధం కనక వస్తే-"ఇక చరిత్రలు రాయనక్కరలేదు. ఇంక రాజ్యాలు పాలించనక్కరలేదు. అణుబాంబు యుగాంతాన్ని సమీపిస్తుంది. ఆ ముహూర్తం త్వరలోనే వస్తున్నది!" అంటూ తిలక్ రాగల మహా విపత్తును గురించి ఆ కవితలో హెచ్చరిస్తాడు.

ఇంత భయంకరస్థితి ఆసన్నమవుతూండగా, తామే కారకులైన ఈ ప్రళయంకర మహాయుద్ధాలు విజృంభిస్తూండగా విజ్ఞాన శాస్త్రవేత్తలు తమకేమీ పట్టనట్లు నిర్లిప్తులవుతున్నారు. "నాగరికత పైపైలు పలుకుతున్నారు. మనుష్యభక్షకులు నేడు చంకలు కొట్టుకుంటున్నారు." అంటూ ఆ అమానుషస్థితిని వర్ణిస్తాడు. "మన జాతిని మనం కాపాడుకోవాలంటే-ఒకటే మార్గం...వెదికి తీసుకురండి పరాశక్తి అయిన వ్యక్తిని-పేరు దొరికేదు. కదలండి [illegible] అని!" అంటూ తిలక్ ప్రకటన సాగుతుంది.

ఆ పరార్రైన వ్యక్తి-అపారకృపా తరంగిణులైన నయనాంచలాలతో, ఆనందం జాలువారే స్నిగ్ధదరహాస వదనాలతో" భాసించే శాంతిదేవి! "ఆమె తెల్లని పావురాలను సరదాగా ఎగరేస్తుంది. ప్రేమతల్లి, దయగలచెల్లి, ఆమె పేరు శాంతి!" అంటూ కావ్యాంతంలో తప్ప సరైన వ్యక్తిపేరు వెల్లడిచేయడు.

అదే సంవత్సరం రచించిన రెండో గీతం ఆర్తగీతి! విషాద స్మృతులతో దినాలు దీనంగా సాగుతున్న విషమసంధ్య! విధి తమస్సులు ముసిరిన దీనాంధ రతి!" [illegible] అట్టి విషాద సమయంలో కవి ఏం పాడగలడు? విపంచికను ఎలా శ్రుతి చేయగలడు? దేశాన్ని ఏమని కీర్తించగలడు?...అలా ప్రారంభమవుతుంది ఆర్తగీతి!

శిల్ప సంబంధ పరిశీలనలో ఒక చమత్కారం గోచరిస్తుంది. మొదటి పద్యంలో కవి తనదేశాన్ని గురించి పాడలేనని తానున్న దైన్యస్థితిని స్థాపిస్తాడు. తద్వారా జాతి విషాదాన్ని ధ్వనింపచేస్తాడు.

రెండో పద్యంలో తాను నిరసించే-ఉదాత్త సురభిళాత్త శయ్యా సజ్జితాలు, రసప్లావితాలు, చిత్ర శిల్ప కవితా ప్రసక్తులు, తత్వసూత్రనాదోక్తులు, సుందర వధూకదుష్ణ పరిరంభాలు, గత చారిత్రక యశః కలాపాలూ, బహుళ వీరావేశ గాథా సహస్రాలూ వంటి రమణీయోదాత్త విషయాలెన్ని ఎదురైనా తన హృదయాన్ని అవన్నీ ఆకర్షించలేక పోతున్నాయి. తన విషణ్ణ హృదయాన్ని సమాశ్వాసింప చేయలేకున్నాయి. ఐనా అవన్నీ మహత్వపూర్ణ పదార్థాలే! ఆ సంగతి చెప్పక చెప్పడానికే సమాస సౌందర్యాన్ని ప్రదర్శిస్తాడు కవి. స్వరూప స్వభావాలలో వాటికిగల సౌందర్యాన్ని ఏకదేశంగా ధ్వనింపచేస్తాడు.

వాటి ఆకర్షణశక్తి గొప్పదే కాని-విషాద స్మృతిగా మిగిలిన తన హృది రసించలేక పోతోంది. దానికి కారణం ముందు పద్యంలో వివరిస్తాడు...నేడు కవి కన్నీరుగా మిగిలిన గీతిక; సిగ్గుతో రెండుగా చీలిన వెదురుబొంగు. అంతరాంతరాల వరకూ దగ్ధమై మిగిలిన బూడిద, ఐనా తనకు బాధ్యతలున్నాయి. పైన దైవమునకు, క్రింద మానవునకు జవాబుదారీగా నిలవవలసినవాడు. తన శిరస్సు రసాతలమనే అధోలోకానికి ఒంగిపోయింది!

కవిని అవమానంతో దుఃఖంతో ఘూర్ణిల్ల చేసిన సన్నివేశాలా బోలెడు! అవి తన రసహృదయాన్ని గాయపరిచాయి! వాటిని నాల్గవ పద్యంలో వివరిస్తాడు. తాను చూసిన దృశ్యాల ద్వారా విధి తనపై ఎన్నో కత్తులు దూసింది. కత్తి వాదరల నుంచి నెత్తురు కారుతోంది. దైన్యమూ, భీతి గుండెల్లో మిగిలింది.

"నేను చూశాను నిజంగా ఆకలితో అల్లాడి
మర్రిచెట్టు క్రింద మరణించిన ముసలివాణ్ణి......
నేను చూశాను నిజంగా సీరంధ్ర పర్షాన వంతెన క్రింద
నిండు చూలాలు ప్రసవించి మూర్ఛిల్లిన దృశ్యాన్ని......

# ఇంద్ర గోపము

## శ్రీ పెన్మెత్స రాజం రాజు

ఆత్మ బలమున బాహ్యేంద్రియార్థములకు
లొంగి పోవక మానవ లోకమందు
సంచరించిన ఆ బోధిసత్త్వు పగిది
వరలు ఓ యింద్ర గోపమా! అరిగె దెటకు.

సంజ కెంజాయ నింగిలో జారువేళ
వెల్లి విరిసెడు చెంగల్వ విరుల కాంతి
మిసిమి కన్నుల మృదులమౌ మేనియందు
పొంది యున్నావు నీ పూర్వ పుణ్యమేమొ.

స్నిగ్ధ సుకుమార భావనాశేష విభవ
పూర్ణుడై యుండి వాఙ్మయ భూములందు
సహజ సాహిత్యరస పిపాసను చరించు
సుకవి పాలిటి కావ్య వస్తువవు నీవు.

మృగశిరార్ద్ర కాల సమ్మేళనమున
చదల నరిగెడు మేఘ గర్జనల కులికి
లలిత గతి నెల్ల దిక్కులు పులకరించ
బయటపడినావె? ధరణి గర్భమున నుండి

గడచిపోయిన నైదాఘ కాలమందు
తరణి కిరణాగ్ని చేత సంతప్తమైన
పుడమి కడుపున కటకటా! ఉడికి యుడికి
గడపినావమ్మ గత కష్టకాల మెల్ల?

ఇంత సుకుమారి వెట్టు లత్యంత కష్ట
కుధరమును దాటి శాద్వలాంకూర భూమి
గుద్దలిని త్రవ్వినట్లుగా గుల్లచేయ
పాటు పడెదవు సతము నిస్స్వార్థ పరత.

నీ వినూతన సుకుమార నిరుపమాన
సుందరా దర్మమయ భవ్య జీవితమును
ధారవోయుచు నీశ్వరోద్యానముకు
దోహదము చేయుదువె? నిరుత్సాహ పడక.

సృష్టియందున్న కోట్లాది జీవులందు
ఘనుడనని విఱ్ఱవీగితిన్ గాని; నేడు
నీవు సలిపెడు నిస్స్వార్థ సేవ కలరి
పలుకు చుంటిని విగత గర్వమున వినుము.

భూతదయ మానవ ప్రేమ బూది గలపి
మారణాస్త్రాల తోడ ఒగ్మండలమున
పలుకుబడి నిల్పుకొన మేము ప్రాకులాడు
తీరు వినినంత నీ యెద నీరు కాదె?



నేను చూశాను నిజంగా తల్లిలేక తండ్రిలేక తిండిలేక
ఏడుస్తూ ముంజేతుల కన్నులు తుడుచుకుంటూ,
మురికికాల్వ ప్రక్కనే నిద్రించిన మూడేళ్ళ పసిబాలుణ్ణి......
నేను చూశాను నిజంగా పిల్లలకు గంజికాచి పోసి
తాను నిరాహారుడై రుద్ధ బాష్పాకులిత నయనుడై
ఆఫీసుకు వచ్చిన వృద్ధుని, ప్యూను వీరన్నని......
నేను చూశాను నిజంగా-క్షయగ్రస్త భార్య ఇక బతకదని
డాక్టర్ చెప్పినపుడు ప్రచండ వాతూలనీ పత్రాఖవలె
గజగజ వణకిపోయిన అరక్త అశక్త గుమాస్తాని
అయిదారుగురు పిల్లలు గలవాణ్ణి......"

పైన కవి చెప్పిన అయిదూ సామాజిక వాస్తవికతగల పంచముఖాలు జీవన విషాదాలను ప్రదర్శించే పదచిత్రాలు. ఆ పద్యచిత్రాలు పాఠకుని హృదయంలో చెరగని నిలుస్తాయి. సదా స్వీయ ఆలోచనలకు అవరోధం కలిగిస్తాయి. ఈ జీవన దైన్యాలకు పరిష్కారమేమిటని నిలదీసి ప్రశ్నిస్తాయి. మానవ హృదయ రసభావాలను మేలుకొల్పుతూ కర్తవ్యాల నన్వేషింప చేస్తాయి.

భావం ఎంత గొప్పదైనా దానంతట అదే ఉత్తమ కవిత కానేరదు. సామాజికులామోదించిన స్వరూపంలో దానిని అభివ్యక్తం చేసినపుడే అది కవిత్వమవుతుంది. స్వరూపంలోగల అంతస్సాయువులే భావచిత్రాలను పట్టి ఉంచేవే పదచిత్రాలు. ఉత్తమాభివ్యక్తి ఉత్తమ కవిత్వంగా దీపిస్తుంది. భావం ప్రాణమం, సందేహం లేదు. కాని అది సుందర శరీరంలో అంతర్లీనమైనపుడే దాని విలువా, శక్తిని; వెలుగూ, చలనమూను; ఉత్త గాలిలోనలిచే ప్రాణం దయ్యం వంటిదే; భావాభివ్యక్తికి ఉత్తనే ప్రోగే శబ్దస్వరూపం శవసదృశమై విసర్జనీయమవుతుంది.

ఆధునిక కవిత్వం ఐచ్ఛికంగా తానంగీకరించినా, అంగీకరించకపోయినా బాహ్య వాస్తవికతను గర్భస్థం చేసుకోక తప్పదు. కవి దర్శించిన సామాజిక బాహ్య వాస్తవికత నుంచే భావచిత్రాలు పదచిత్రాలు ఎన్నుకుంటాడు. మధ్య యుగాలలోని సర్వభావజాలమూ మతానికీ దైవ చింతనకీ నిబద్ధితమైంది. సర్వ కళాస్వరూపాలూ వాటికే అంకితమయ్యాయి. ఆధునిక యుగంలో మతానికుండే సర్వశక్తి మంతమైన ప్రభావాన్ని రాజకీయాలు స్వీకరించాయి. కనుకనే ఆధునిక కళలకు రాజకీయ స్పర్శ జీవలక్షణమై పోయింది.

సమస్త వస్తు సంకీర్ణంగా ఉన్నలోక వృత్తం నుంచి తన అభివ్యక్తికి దీప్తి నిచ్చే పదచిత్రాలను కవి దర్శనం ఎన్నుకుంటుంది. తన హృదయాన్ని ఆకర్షించి పదేపదే ఆపి ఆలోచింపచేసే సంవేదనలనే కవి చిత్తశుద్ధితో వ్యక్తపరుస్తాడు. అట్టివే సహృదయాలకు విశ్వసనీయంగా భాసిస్తాయి. ఆసక్తి ప్రదంగా రూపొందుతాయి.

లోక వృత్తానుశీలనం నుంచీ, సామాజిక దృష్టినుంచీ తన్ను తాను కేటాయించుకొన్న కవి విశ్వజనీనతను విశ్వసనీయంగా పలుకలేడు. కేవలం పారలౌకిక చింతనతో కాలక్షేపం చేస్తాడు. అవాస్తవిక భావుకుడై మిగిలిపోతాడు. అలాకాక తిలక్ ఆర్తగీతి వంటి అసంఖ్యాక రచనలద్వారా సహృదయ హృదయావాసం చేస్తాడు. సామాజిక వాస్తవిక దర్శనం "ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి? ఏ విజ్ఞాన ప్రకర్షకు ప్రకృతి? ఏ బుద్ధదేవుడి జన్మభూమికి గర్వస్మృతి?" అంటూ క్లేశార్ణవమై ఘోషిస్తాడు!

వర్తమాన లోకసంక్షోభం బుద్ధదేవుడు జన్మించిన భూమికే కాక, జీసస్ జన్మించిన భూమికీ అవమానకరమే! అందుకే కవి ధర్మానుసారం తిలక్ చిత్తశుద్ధితో హెచ్చరిస్తాడు. నిర్నిరోధకంగా సాగుతున్న దుర్వ్యవస్థను ఆపి తీరాలని ధ్వనిస్తాడు.

□

# పూలమనసులు

జొనస్వామి కోదండరామశాస్త్రి.
సూర్యదేవర రవికుమార్






సాయంసంధ్యా సమయం. పగలంతా సగం ప్రపంచాన్ని పర్యవేక్షించిన సూర్యుడు అసంతృప్తితో అసహనంతో వడివడిగా ఈ భూభాగాన్ని దాటుకొంటూ రెండవ సగం ప్రపంచంవైపు పరుగులుతీస్తున్నాడు. అసలు తనకంటూ ఒక రంగే లేని ఆకాశం రకరకాల రంగులను పులుముకొంటోంది. వాటన్నిటిని తుడిపేస్తూ నల్లని చీకటి క్రమంగా వ్యాపిస్తోంది. పేదవానిజీవితంలో మైలురాళ్ళులా ఆకాశంలో ఒకటి రెండు చుక్కలు కనబడీ కనబడనట్లున్నాయి.

అప్పుడే తూర్పు పొలం నుంచి ఇంటికి చేరిన కోటయ్యగారు కాళ్ళు కడుక్కొని అలవాటు ప్రకారం బయటి అరుగు మీదకు చేరేసరికి వీధిచివరకు అల్లంత దూరంలో పడమరగా ఉన్న వంతెన దగ్గర ఏదో అలజడి జరుగుతున్నట్లు పసికట్టారు. ఈ వేళప్పుడు వంతెన దగ్గర గొడవేమిటో అని ఆలోచిస్తూ వెంకన్న కోసం చావిడివైపు చూచారు. చావిట్లో ఎవరూ ఉన్నట్లు అనిపించలేదు. 'వెంకన్నా' అని పిలిచారు పెద్దగా. జవాబు లేదు. చావిడి దొడ్డి తలుపులు బార్లా తీసే ఉన్నాయి. లోపలికి వెళ్ళి చూచారు. వెంకన్నగాని ఇంకో పాలేరుగాని లేరు. కొన్ని గొడ్లదగ్గర మేత సర్దనేలేదు. కోటయ్యగారికి ఎటూ తోచక చికాకేసి మళ్ళీ వచ్చి అరుగు మిదనె కుర్చోబోతుండగా ఇంటి పనిమనిషి లచ్చి దొడ్డి వాకిలివైపు వెళ్తూ కనిపించింది.

'ఏంటే లచ్చి! వంతెన దగ్గరనుంచి ఏవో కేకలు వినిపిస్తున్నాయి. ఏమిటా హడావుడి' అడిగారు.

లచ్చి ఒక క్షణం తటపటాయించింది. 'అదాండీ...' అంటూ నాన్చింది.

'అదేనే! ఏమిటా గోల?' గద్దించారు కోటయ్యగారు.

అదేనండి... మన ఎంకన్నండి...'

**'ఓసి నీ దుంపతెగ! ఏమైందే వెంకన్నకి?** చికాకు. ఆదుర్దా కలిసిపోయాయి కోటయ్యగారి మాటల్లో.

**'మరేంలేదండి. ఆ ఎంకన్నండి... మనింటోనే దొంగతనం చేశాడండి'**

**'ఏంటే నువు మాట్లాడేది? వెంకన్న మనింట్లో దొంగతనం చేశాడా? ఎవడే నీకు చెప్పింది? సంజవేళ అబద్ధపు కూతలు కూస్తావా?'**

**'అబద్ధం కాదండి దొరగారూ నిజవేనండి. ఎంకన్న దొంగతనం చేస్తే పెదబాబుగారు పట్టుకున్నారండి. ఆడికి బాగానే బుద్ధి సెపుతున్నారండి'.**

కోటయ్యగారు నుదురు చిట్లించి 'వెంకన్న దొంగతనం చేశాడా? పెదబాబు పట్టుకున్నాడా?' అని ఆశ్చర్యపడి పైపంచె వల్లేవాటుగా వేసుకొని చావిడిలోకి వెళ్ళి చేతికర్ర తీసుకొని మీసం సవరించుకొంటూ వంతెన దగ్గరకు బయలుదేరారు.

కోటయ్యగారు వంతెన దగ్గరకు చేరుకోగానే 'దొరగాకొస్తున్నారు, దొరగా కొస్తున్నారు.' అంటూ అక్కడ మూగిన జనం పక్కకు తప్పుకున్నారు. వాళ్ళు తప్పుకోగానే ఆ వంతెన పక్కనున్న వేపచెట్టుకు పెదరెక్కలు విరిచి కట్టివేయబడ్డ

వెంకన్న, ఆయాసపడుతూ మాటలు తూలుతూ చేతిలో తాటఊడిన వేపబెత్తంతో పెదబాబు కన్పించారు కోటయ్యగారికి. ఆయన ఇంకా దగ్గరగా వెళ్ళి వెంకన్న ముఖంలోకి చూడగానే అప్పటిదాకా ఐశ్వర్య అహంకారాలు చేసిన అమానుష హింసను సహనతా భావంతో తట్టుకొన్న వెంకన్న తలవంచుకొని 'నేను దుర్మార్గుణ్ణి దొరగారూ మీ యింటోనే దొంగతనం చేశాను' అంటూ ఏడ్చాడు. అది పశ్చాత్తాపంతో వచ్చే ఏడుపు కాదని, తరతరాల బడుగువర్గాల వేదనార్ణవ ఘోష అని కోటయ్యగారు గ్రహించారు.

పెదబాబు ఏదో మాట్లాడబోయి తండ్రి కళ్ళ కెంపుల్ని చూచి ఆగిపోయాడు.

'ముందా కట్లూడదీయండి' కోటయ్యగారి మాట సింహగర్జనే అయింది.

వెంకన్న కట్లు విప్పబడ్డాయి. 'నాతోరా వెంకన్నా' అంటూ ఇంటివైపు దారితీశారు కోటయ్యగారు. వెంకన్న ఆయన ననుసరించాడు. వాళ్ళిద్దరినీ పెదబాబునూ చూస్తూ ఆ గుంపులో ఎవరో పళ్ళు పటపట కొరికారు.

మేడమీద గదిలో పందిరి మంచంమీద బాసింపట్టు వేసుకొని కూర్చున్నారు కోటయ్యగారు. ఆ గదిలోనే వాకిలి కానుకొని లోపలి పక్కన కూర్చున్నాడు వెంకన్న. కోటయ్యగారికి, వెంకన్నకు ఒకే ఈడు వుంటుంది. దాదాపు నలభై సంవత్సరాలనుంచి ఇద్దరూ కలిసి మెలిసి అన్నదమ్ములకన్న ఆత్మీయులై ఉంటున్నారు. అయితే వాళ్ళ అంతస్థులు వేరు. కాని అంతఃకరణలు ఒకటే.

వెంకన్న తన ఇంట్లో దొంగతనం చేయలేదని, చేయలేడని కోటయ్యగారికి తెలుసు. అయితే ఆ మాట వెంకన్న నోటవినాలని కోటయ్యగారెంతో ఓపికపట్టి ఎంతో వాత్సల్యంతో ఎన్నోవిధాల అడిగి చూచాడు. ఎన్నిసార్లడిగినా "దొరగారూ! నా బుద్ధి గడ్డి తింది. నేనే దొంగతనం చేశాను" అన్నమాట తప్ప వేరే మాట రావటంలేదు వెంకన్న నోటినుంచి. తను ఇన్నాళ్ళు చూచిన వెంకన్న వేరు ఈనాటి వెంకన్న వేరు అని అర్థమైపోయింది కోటయ్యగారికి. అతనిచేత నిజం చెప్పించేందుకు ఒకే ఒక మార్గం కన్పించింది వారికి.

"అయితే నీ మాట నీవిగాని నిజం చెప్పవన్నమాట. నలభై సంవత్సరాలుగా నువ్వూ నేను ఎట్లా బ్రతికామో మనిద్దరికే తెలుసు. మనిద్దరి మధ్య వున్న ప్రేమ, అభిమానం, వాత్సల్యం యీనాటితో తెగతెంపులు చేసుకున్నావన్నమాట. అందుకే తెగించి నా యింట్లో దొంగతనం చేశానని అంటున్నావు. నా మీద గౌరవం అభిమానం చంపుకొని నా యింట్లోనే దొంగతనం చేయటానికి నీకు ప్రాణం ఒప్పిందేమో కాని వెంకన్నా! ఆ దొంగతనం నిజంగా నువ్వే చేశావంటే నేనింక ప్రాణాలతో ఉండలేనురా. చూడు! నా గుండె బద్దలైపోతోంది. నా మెదడులో నరాలు తెగిపోతున్నాయి. నేనీ అవమానాన్ని భరించలేను. పోతున్నాను వెంకన్నా! పోతున్నాను. నిన్నేకాదు యీ లోకాన్నే విడిచిపెట్టి పోతున్నాను" ఆవేశంగా మంచంమీద కూర్చొని ఊగుతూ అంటున్నారు కోటయ్యగారు. ఆయన ముఖం నెత్తురు గడ్డలా మారింది. శరీరం ఆయన స్వాధీనాన్ని తప్పిపోతున్నట్లనిపించింది వెంకన్నకు. ఆయన కళ్ళు మూతలు పడుతున్నాయి మనిషి ఊగిపోతున్నాడు. పెదాలు నిశ్శబ్దంగా కదులుతున్నాయి.

ఆయన పరిస్థితిని చూచిన వెంకన్నకు కాళ్లు చల్లబడ్డాయి. ఇంకేముంది. దొరగారు చనిపోతున్నాడనుకొన్నాడు. ఒక్క ఉదుటున లేచివెళ్ళి కోటయ్యగారి భుజాలు పట్టుకొని "దొరగారూ! దొరగారూ! నిజం చెపుతున్నానండి. నేను దొంగతనం చేయలేదండి. నేను దొంగను కానండి బాబూ! మిమ్మల్ని చూస్తే నాకు బయం పుడతందండి. మాట్టాడండి బాబూ! మాట్టాడండి." అంటూ మనిషిని ఊపుతున్నాడు. కన్నీళ్లు కారుస్తున్నాడు. 'నేను దొంగను కాదండి. మాట్టాడండి బాబూ!" దుఃఖాన్ని, ఎక్కిళ్ళను ఆపుకొంటూ పదే పదే అంటున్నాడు వెంకన్న.

80 సెకండ్ల కాలం గడిచిపోయింది.

'ఏమంటున్నావు వెంకన్నా! నువు దొంగతనం చేయలేదా?' మెల్లగా మాట్లాడారు కోటయ్యగారు.

'నిజం దొరగారూ! నేను దొంగతనం చేయలేదు'

'చాలు వెంకన్నా! నాకా మాట చాలు' కళ్ళు తెరచి లేచి వెంకన్న భుజం మీద చేయివేసి అతన్ని కూర్చోబెట్టి తనూ కుర్చీలో కూర్చున్నారు కోటయ్యగారు.

కాలం భారంగా నడుస్తోంది.

'నాకు తెలుసు వెంకన్నా! ఇది నీ పనికాదని. ఏదో దారిన వెళ్ళవలసింది నీ నెత్తిన పడిందని...అయితే నిజాన్ని ఇంతగా నా దగ్గర కూడ దాచాల్సిన అవసరం ఏమొచ్చింది?

'వచ్చింది బాబూ. నా ప్రాణం మీదకు వచ్చింది. అందుకే అబద్ధమాడాను. మిమ్మల్ని బాధపెట్టాను'

'చెయ్యని దొంగతనం నీ ప్రాణం మీదకొచ్చిందా?'

'అవును బాబూ! దొంగతనం నే చెయ్యకపోయినా చేశానని ఒప్పుకోపోతే నా శవాన్ని కూడ దొరకనీయనన్నాడు పెదబాబు. ఈ వయసొచ్చాక ప్రాణానికి భయపడే పనిలేదు. కాని...' దుఃఖం ఆపుకోలేకపోయాడు వెంకన్న మాట పెగిలిరాలేదు.

కొంచెం తెప్పరిల్లిన తర్వాత 'కాని...నా కొడుకే బతికుంటే యీ అబద్ధం ఆడేవాణ్ణే కాదు. ఇవాళ నే లేకపోతే ఆడపిల్లలు, పెళ్ళాం దిక్కులేనోళ్లౌతారు. అందుకే ఆ నేరం నెత్తినేసుకున్నాను బాబూ!' అన్నాడు వెంకన్న.

కొన్ని క్షణాలు మౌనం రాజ్యం చేసింది. తర్వాత కోటయ్యగారే అన్నారు.

'జరిగిందేదో జరిగిపోయింది. నిన్నంటుకొనే వాడుండడు. నేను హామీ ఇస్తున్నాను. ఒకవేళ నిన్ను శవాన్ని చేయాలని ఇంకా ఎవడైనా ప్రయత్నం చేస్తే వాడే నీకన్నా ముందుగా శవమయ్యేలా నేను చూస్తాను. నువ్వేం భయపడవద్దు. నిబ్బరంగా ఉండు. అసలు ఇదంతా జరిగిన తీరు చెప్పు'

వెంకన్న మాట్లాడలేదు. తలవంచుకొని మౌనంగా ఉండిపోయాడు.

'చెప్పు వెంకన్నా! అసలేం జరిగిందో చెప్పు' ఎంతో అనునయంగా అడిగారు కోటయ్యగారు.

'ఏం చెప్పమంటారు!' అని నిట్టూర్చి 'మన పెదబాబుగారి నడత కొన్నాళ్ళనుంచి బాగుంటంలేదండి' ఉపోద్ఘాతంగా అన్నాడు వెంకన్న.

'అవును. వాడు ఒక ఉంపుడుగత్తెతో కులుకుతున్నాడు'

'దాని పేరండీ...'

'సరస్వతి. దానికి ఉత్తరపు వీధిలో ఉన్న ఇల్లు వీడు బాగుచేయించి పెట్టాడు. ఆ సంగతులన్ని నాకు తెలుసుకాని అసలు విషయం చెప్పు'

'బాబూ! యీ సంగతులన్నీ మీకు తెలిశాక నేనేమీ దాయగూడదు. జరిగింది జరిగినట్టు చెపుతాను.

సాయంత్రం చావిట్లో గొడ్లకి మేత సర్దుతున్నాను. అప్పుడే పెదబాబుగారొచ్చి 'ఎంకన్నా! నీ పనయ్యాక యీ పైకం సరస్వతి కిచ్చిరా!' అని నా చేతిలో రెండు వంద కాయితాలు పెట్టారు. బాబుగారు చెప్పినట్టే నా పనయ్యాక ఆ అమ్మ ఇంటికెళ్ళాను. నేనెళ్లేసరికి ఆమె బంగారవు గాజులు తొడుక్కొని చూసుకుంటోంది. నేనెళ్లి డబ్బిచ్చానండి. అప్పుడంది గదా! 'ఎంకన్నా గాజులు బావున్నాయా! సంపాయించాను చూడు' అని చూడమని తీసి నా చేతికిచ్చిందండి. నేను చూచి 'బాగున్నయ్యండి. ఎక్కడ సంపాయించారేంటి?' అన్నాను. 'మీ దొరగారి కోడలి దగ్గర్నుంచి తెప్పించానురా' అని ధీమాగా అందండి. 'ఎట్టా

తెప్పిచ్చారేమిటి' అనడిగాను. దానికామె నవ్వి నేనిచ్చిన డబ్బు చూపించి 'యీ డబ్బెట్టా తెప్పించానో అవీ అట్టాగే తెప్పించారు. యీ డబ్బిచ్చి పంపినాయనే అవీ ఇచ్చి పంపాడు' అందండి.

ఆ మాట యినేసరికి నాకు ఒళ్లు మండిపోయి 'ఎంతకి తెగించావు. వారి ఆడోళ్లు ఇవి పోయాయనుకొని గోలెడుతున్నారు. నేను ఇవి తీసుకెళ్ళి వాళ్ళకి అప్పచెప్తాను' అని చెప్పి ఆమె ఎన్ని కేకలు పెట్టినా యినిపించుకోకుండా మనింటికొచ్చేశానండి. నాకన్నా ముందే ఆవిడ ఎవరితో కబురు చేసిందోమరి నేనింటిగడప తొక్కుతుంటే పెదబాబు నాకెదురొచ్చి నన్ను చావిట్లోకి రమ్మనమని చెప్పి తీసుకెళ్ళి కొట్టారు. నా దగ్గర్నుంచి ఆ గాజులు లాక్కుని బొడ్లోనుంచి కత్తి తీసి చూపించి 'యీ గాజులు మనింటోనుంచి నువు దొంగతనం చేసి తీసుకొచ్చావని ఒప్పుకోకపోతే ఇదిగో యీ కత్తితో నీ ఊపిరి తీస్తా' నన్నారండి. సరస్వతి పేరుగాని, తన పేరుగాని యీ దొంగతనంలో ముడిపెడితే చంపుతానని కత్తి పైకెత్తారండి. అప్పుడు పెదబాబును చూస్తే నిజంగా చంపుతాడేమోనని బయమేసి నా కోడలు పిల్లలు గుర్తొచ్చి 'అట్టాగే బాబూ! ఆ దొంగతనం నేనే చేశానని ఒప్పుకుంటాను' అన్నానండి. అంతే. పెదబాబుగారు పెద్దగా కేకలేసి నన్ను చేయి పట్టుకొని బయటకు లాక్కెళ్ళి పంతెన దగ్గర చెట్టుకు కట్టేసి అందర్లోను నన్ను దొంగను చేశారండి. ఆ అవమానంతో చావాల్సిందే గాని, అదుగో ఆ మగదిక్కులేని పిల్లల్ని చూచి బతికున్నానండి.' బావురుమన్నాడు వెంకన్న ముఖానికి పై గుడ్డను అడ్డం పెట్టుకొని.

భూతదయ అత్యున్నతమైంది, పవిత్రమైంది. దానికి తరతమ భేదాలు కాని కలిమిలేముల వ్యత్యాసాలుగాని ఉండవు. మానవతా అస్తిత్వానికి అదే ఆధార భూతం. అదిలేని మానవత పాశవతే. చంద్రోదయానికి చంద్రకాంతశిలలు ద్రవించినట్లు అసాధారణ దయనీయ సంఘటనలకు మానవత కొందరి హృదయాలలో పొంగి పొరలుతుంటుంది. ఆ దయాహృదయాలే ధర్మసంస్థాపన కాధార భూతాలౌతాయి.

వెంకన్న రోదన కోటయ్యగారి హృదయంలో దయాసముద్రాలను పొంగించింది. అవి ఆయన కళ్ళగుండా బయటకు ప్రవహించాయి. కొంచెం తేరుకున్నాక వెంకన్న చేతులు పట్టుకొంటూ అన్నారు కోటయ్యగారు.

'నీకు జరిగిన అన్యాయం నాకు తెలియకుండా జరిగింది. ఇప్పుడు అంతా తెలిసింది. ఇక నీకు భయంలేదు. అకారణ దౌర్జన్యాలు అపరాధ మూల్యాలను తప్పకుండా చెల్లిస్తాయి. పెదబాబుతో నేను మాట్లాడుతాను. నువు ఇంటికి వెళ్ళు.'

వెంకన్నను సాగనంపి పెదబాబుకు కబురు చేశాడు కోటయ్యగారు.

* * *

మేడమీద గది గుమ్మం చేరగానే తన ఉనికిని తెలియజేస్తూ చిన్నగా గొంతు సవరించుకున్నాడు పెదబాబు. పట్టెమంచం మీద నడుం వాల్చిన కోటయ్యగారు ఆ అలికిడికి లేచి పెదబాబు నుద్దేశించి 'కూర్చో' అని చెప్పాడు. పెదబాబు కుర్చీలో కూర్చున్నాక 'గాజుల దొంగతనం ఎవరు చేశారురా?' అంటూ సౌమ్యంగానే అడిగారు కోటయ్యగారు.

'వెంకన్నే'

'అతడు చేయలేదని ఋజువైతే'

పెదబాబు మాట్లాడలేదు.

'చూడు పెదబాబూ! గదిలో అరమరలో పెట్టిన నీ భార్య గాజులు వెంకన్న దొంగతనం చేశాడని నువు ఆరోపిస్తే అది నిలబడదురా! మనలో ఒకడుగా ఏనాటినుంచో మనింట్లో తిరుగుతున్న వెంకన్న బుర్రలో దొంగబుద్ధే వుంటే మనం యీనాడు యీ స్థితిలో ఉండేవాళ్ళం కాదు. నీకు తెలియదు. వెంకన్న దేవుడులాంటివాడు. అతడ్ని మందిరంలో కూర్చోబెట్టి పూజచేసినా అతని ఋణం మనం తీర్చుకోలేము. ఈనాటి మన యీ భాగ్యసౌధానికి అతడు పునాదిరాయి. అతడి అమాయకత్వం, విశ్వాసం వలన మన మీనాడీ ఐశ్వర్య జీవితాలను వెళ్ళబుచ్చగలుగుతున్నాం. యీ ఐశ్వర్యం దాని బాపతు అహంభావం, దౌర్జన్యం మనకి రక్షా కవచాలని అనుకొంటే అది కేవలం భ్రమే అవుతుంది, అవి మన వినాశానికి హేతువులు...నిజానికి నువ్వు ఇవాళ అవమానించింది వెంకన్నను కాదురా...నన్ను...నన్నేరా...'

'నాన్నగారూ' దిగ్భ్రాంతిగా అన్నాడు పెదబాబు.

'అవున్రా! ఆ అవమానం నాకే. అయినా అసలు విషయం నీకు తెలియదు. తెలిస్తే వెంకన్ననిలా అవమానించి ఉండవు. నలభై సంవత్సరాలనాడు మన ఆస్తి కేవలం రెండెకరాలే. దాంతోపాటు మరొక నాలుగెకరాల పొలం కౌలుకు తీసుకొని సంసారాన్ని నెట్టుకు వస్తున్నాం. అప్పటికి నాకింకా పెళ్ళి కాలేదు. అప్పుడు కూడ యీ వెంకన్న మనింట్లోనే పని పాటలు చేస్తుండేవాడు. వెంకన్నకు తల్లి, తండ్రి చిన్నప్పుడే చనిపోయారు. అతడి బాబాయి వెంకన్నను పోషించలేక మనింట్లో పనికి పెట్టాడు. మనింట్లోనే తిని, మనింటిదగ్గరే పడుకొంటూ మనలో ఒకడుగా ఉండేవాడు. ఒక వేసవికాలం పొలాన మట్టిదిబ్బ తవ్వుతున్నాం నేను, వెంకన్న. ఆ రోజు సాయంత్రం మొత్తం పనంతా వెంకన్నమీదే పెట్టి నేను ముందే ఇంటికి వచ్చేశాను ఒంట్లో బాగుండక. ఆ రోజు రాత్రి బండిని ఇంటికి తీసుకువచ్చి అందులోనుంచి రెండు ఇత్తడి పెట్టెలు దించి ఇంటిలో పెట్టాడు వెంకన్న. ఇవెక్కడివని అడిగితే మట్టిదిబ్బలో దొరికాయని చెప్పాడు. అంతే. అంతకుమించి ఆ రోజునుంచి ఈ రోజు వరకు ఆ పెట్టెల విషయం ప్రస్తావించనేలేదు వెంకన్న. ఆ రాత్రి మేము పెట్టెలు తెరిచి చూచాము. వాటిలోనుంచి అదృష్టదేవత లేచివచ్చి మాతో కరచాలనం చేసినట్లయింది. అందులోని బంగారు నగలు, ముత్యాలు, పగడాలు చూచాక, ఆ విషయం చాల జాగ్రత్తగా దాచి, ఏమాత్రం బయట పడనీయకుండా జాగ్రత్తపడి ఆ ఏడే ఆ ఊరి పొలం అమ్మేసి ఇదిగో ఈ ఊరు వచ్చి పడ్డాం. అమాయకుడు, విశ్వాసపాత్రుడు అయిన వెంకన్నను కూడ మాతో తీసుకొచ్చాం. ఇక్కడికి వచ్చాకే మా ఇద్దరికీ కూడ పెళ్ళిళ్ళయ్యాయి. వెంకన్న చేసిన ఆ సహాయానికి కృతజ్ఞతగా ఎన్నోసార్లు నేనతనికి సహాయం చేస్తానని చెప్పినా అతడు అంగీకరించలేదు. 'ఈ జన్మకి యీపాటి బతుకు చాలు బాబూ! నాకంటూ ఆస్తిపాస్తులేర్పాటు చేస్తే మీకూ నాకూ ఎడమౌతుంది, అది నాకిట్టం లేదు.' అంటుండేవాడు. నేనింకా అతడిని ఆ బ్రతుకులోనే ఉంచినందుకు విచారిస్తూ ఉంటే ఇవాళ నువు చేసిన పనికి నేనేం చేయాలో చెప్పు. మనలో మానవత్వం ఉందా? మానవులమని చెప్పుకొనేదానికి మనకి హక్కుందా? చెప్పురా! చెప్పు నీ స్వార్థం కోసం, నీ ప్రయోజనం కోసం, నీ పరువు కోసం, అమాయకుడైన వెంకన్ననే శవంగా చేస్తావో... తర్వాత నన్నే శవంగా చూస్తావో...నీ యిష్టం' కోటయ్యగారి గొంతు గద్గదికమైంది.

పెదబాబు ముఖంలో కత్తివేటుకు నెత్తురుచుక్క లేదు. మౌనంగా ఆ గది నుండి బయటకు వెళ్ళిపోయాడు.

* * *

ఇంకా తూరుపు తెలవారలేదు. సొట్టపడిన ముఖంతో నట్టనడి ఆకాశాన బహుళాష్టమి చంద్రుడు వెలవెలబోతూ తరపి వెన్నెలను ప్రసరిస్తున్నాడు. ప్రత్యూష పవనాలు మందగమనంతో సంచరిస్తున్నాయి. ఆ పిల్లగాలుల తాకిడికి నిద్రలేచిన కోటయ్యగారు అలవాటు ప్రకారం కాలకృత్యాలు తీర్చుకొని నోటిలో ముఖంపుల్లతో చేతిలో ఇత్తడి నీటిచెంబుతో ఇంటి బయటి అరుగు మీదకు వచ్చి చెంబు దానిమీద పెట్టి చావిడివైపు చూచారు. రోజు అలవాటు చొప్పున చావిడి

లోని గొడ్లను బయట కట్టేస్తున్నాడు వెంకన్న. కోటయ్యగారు దావిట్లోకి వెళ్తున్న వెంకన్నను పిలిచారు. చేసే పని ఆపేసి దగ్గరగా వచ్చాడు వెంకన్న.

'చూడు వెంకన్నా! నువు యీ రోజునుంచి నౌకరుగా నా దగ్గర చాకిరీ చేయనక్కరలేదు. యీరోజే నీ పేరుమీద నాలుగెకరాల మాగాణి భూమి దస్తావేజు వ్రాయించి రిజిష్టరు చేయించదలచుకొన్నాను. దాంతోపాటు పదివేల రూపాయలు బ్యాంకులో నీ పేర జమ కడతాను. ఆ రెంటిమీద వచ్చే రాబడితో నువు రోజులు వెళ్ళబుచ్చుకో. యీసారి మాత్రం నా మాటకు అడ్డు చెప్పవద్దు... మధ్యాహ్నం నాకొకసారి కన్పించు.' తన నిర్ణయాన్ని చెప్పి తేలికపడ్డ మనసుతో అరుగుమీదకు చేరారు కోటయ్యగారు.

వెంకన్న స్థాణువులా నిలబడిపోయాడు కాసేపు.

భోజనం పూర్తి చేసుకొని గొడుగు తీసుకొని వెంకన్న కోసం ఎదురు చూస్తూ ఇంటి వసారాలోని వాలు కుర్చీలో కూర్చున్నారు కోటయ్యగారు. కొద్దిసేపటికే వెంకన్న, అతడి భార్య వచ్చి ఎదురుగా నిల్చున్నారు.

'ఇద్దరూ వస్తున్నారా! మంచిపని చేశారు. బయల్దేరదామా'

వెంకన్న ఏమి మాట్లాడలేదు. అతడి భార్య మాత్రం' మా గురించి మీకింత శ్రమ ఎందుకు దొరగారూ! మేమే ఊరొదిలి వెళ్తున్నాం' అంది.

అదిరిపడ్డారు కోటయ్యగారు.

'ఊరొదిలి వెళ్తున్నారా? ఏం? ఏమయింది? మళ్ళీ ఎవరైనా...'

'అదేంలేదు బాబూ! మీకు మా చాకిరీతో పనిలేదని మీరన్నాక ఈ ఊళ్ళో మాకింకెవరితో పనుంది? మీకు చాకిరీ చేసిన ఈ చేతుల్తో ఈ ఊళ్ళోనే ఇంకోరికి చేయలేం. అందుకే ఊరొదిలేసి...' వెంకన్న భార్య ఇంకేదో చెప్పబోయింది.

కోటయ్యగారి గుండెల్లో బాంబు పేలినట్లయింది. మనిషి ఉక్కిరిబిక్కిరై పోయారు. 'చాల్లే ఆపు' అని బిగ్గరగా అరిచారు.

తర్వాత మెల్లగా 'మీకు ఊళ్లో పొలమిస్తానంటే ఊరొదిలి వెళ్తానంటారేం' అన్నారు.

'ఇన్నాళ్ళు మీ అండన బతికాం. ఆ అండ మాకు లేకపోయాక పొలాలు పుట్టిలు ఏం చేసుకోను దొరగారూ!' వినయంగా అంది వెంకన్న భార్య.

'ఏం వెంకన్నా! నువ్వేమంటావ్'

'నా మాటా అదేనండి. ఈ బతుకుల్ని మీ దగ్గరే తెల్లారనీండి'

కోటయ్యగారు సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు. ఇంతటి ఆత్మీయత, ప్రేమ, విశ్వాసం, నిస్వార్థం నిండిన వీళ్ళ హృదయాలు హరిమందిరాలు. హరిజనులని గాంధీగారు వీళ్ళకి పెట్టిన పేరు ఎంతో సార్థకమైనది. శ్రమైకజీవన సౌందర్యానికి సాక్షాత్ప్రతిరూపాలు వీళ్ళు. నిష్కలంక హృదయాలకు నిలువెత్తు ప్రతిబింబాలు వీళ్లు. వాగర్థాల్లా విడదీయలేని పార్వతీ పరమేశ్వరులకు ప్రత్యక్ష స్వరూపాలు వీళ్ళు. కోటయ్యగారి హృదయం వాళ్ళ వ్యక్తిత్వానికి సాష్టాంగ ప్రమాణం చేసింది. ఆయన తనకు తెలియకుండానే చేతులెత్తి వాళ్ళకు నమస్కారం చేశాడు.

'ఎం సెలవిచ్చారు బాబూ!' వెంకన్న మెల్లగా గొణిగాడు.

కోటయ్యగారు తేరుకొని ఇలా అన్నారు 'ఏమంటాను వెంకన్నా! శివపార్వతులు నా ఇంటిలో ఉంటానంటే కాదంటానా!'

'మీరుండమన్నారు. అంతే చాలు బాబూ' వెంకన్న. అతడి భార్య కళ్ళల్లో కోటిదీపాలు వెలిగాయి.

ఆ ఊర్లో కోటయ్యగారిని ద్వేషించేవాళ్ళు లేరుగాని పెదబాబుకు మాత్రం చెప్పుకోదగినంత వైరివర్గం వుంది. ఒక హరిజనుడిని అగ్రవర్ణాలవారు చెట్టుకు కట్టి కొట్టారనే ఫిర్యాదు రావటంతో విచారణకై తగిన అధికార యంత్రాంగం ఆ ఊరు చేరుకొంది. నిజానికి తనను కొట్టినట్లు ప్రభుత్వానికి ఫిర్యాదు చేసినట్టు వెంకన్నకు తెలియనే తెలియదు. ఫిర్యాదు చేసిన తరువాత చేసినవాళ్ళు వెంకన్న ఇంటికి వచ్చి ఎంతో హితబోధ చేశారు. అతనికి అన్యాయం జరిగిందంటూ మొసలి కన్నీరు కార్చారు. పెత్తందారీ వర్గంమీద కారాలు మిరియాలు నూరారు. ఎన్నో రాజకీయసిద్ధాంతాలు వల్లెవేశారు. ఇవేవీ వెంకన్నను ప్రభావితం చేయలేకపోయాయి.

విచారణకు వచ్చిన ప్రభుత్వోద్యోగులు వెంకన్నను పిలిపించి జరిగిన విషయం చెప్పమన్నారు.

'ఏం జరిగింది బాబూ! ఇక్కడ ఏ దుర్మార్గం జరగలేదు. ఎవరి ప్రాణాలు పోలేదు. జరిగిందేంటంటే రైతుకి పాలేరుకి మధ్య చిన్న కీచులాట అంతే! అంతకన్న ఏం లేదు. అది మేము మేము సర్దుకొనేదే. దానికి మీ అవసరం లేదు.'

ఎన్నివిధాల అడిగినా అదే సమాధానం చెప్పాడు వెంకన్న ఫిర్యాదు చేసినవాళ్లు నిరాశచెంది వెంకన్ననే తూలిమాట్లాడారు. విచారణకు వచ్చినవాళ్లు తిరిగి వెళ్లారు చేసేదేమీలేక.

ఆ సాయంత్రం వెంకన్నను మేడమీదకు పిలిపించారు కోటయ్యగారు.

'ఏం వెంకన్నా! తప్పు చేసినవాడికి శిక్ష పడకుండ చేశావేమిటి? తప్పుడు వాఙ్మూలం ఇచ్చావేంటి?' ఆశ్చర్యంగా అడిగారు కోటయ్యగారు.

'నేను నిజం చెపితే ఏమవుద్దో, నాచేత నిజం చెప్పించి మీ కుటుంబాన్ని ఏం చేయించాలనుకుంటున్నారో నాకు తెలిసింది బాబూ! అన్నం పెట్టిన చేతిని నరికేవాడు కాదు బాబూ వెంకన్న. పెదబాబుని నా చేత్తో పెంచాను. నా రెండో బిడ్డలాగా చూచుకున్నాను. ఆరిదీ, నా కొడుకుదీ ఒకే ఈడు బాబూ! నాకున్న కొడుకు ఎలాగూ పోయాడు. ఇక ఈ బాబును కూడ దూరం చేసుకోనా? నా మూలంగా నా బిడ్డనే జైలుకి పంపించనా? నేనట్టా చేస్తానని మీరెట్టా అనుకున్నారు బాబూ! అయినా ఆ ముండ మాటలు యిని నన్నిట్టా చేశారు గాని పెదబాబుకి మాత్రం నేనంచే ఎంతిదో మీకు తెలియదా?'

పై పంచెతో కళ్లొత్తుకున్నాడు వెంకన్న.

వెంకన్న మాటలు కోటయ్యగారి హృదయాన్ని ఏం చేశాయోగాని **'పెద బాబూ'** అని పెద్దగా కేకేశారు కోటయ్యగారు.

ఆ కేకకి వెంకన్న అదిరిపోయాడు.

పెదబాబు పరుగున మేడమీదికొచ్చాడు.

'కేసేమయిందిరా' కోటయ్యగారి మాటలు కదం తొక్కాయి.

'వెంకన్న దయవల్ల ఒడ్డున పడ్డాను నాన్నగారూ!'

'అయితే వెంకన్న...'

'నిజంగా నా పాలిటి దేవుడు. నేనే బుద్ధి గడ్డితిని...'

'నిజంగానా! నువు నీ తప్పు ఒప్పుకొంటున్నావా! సంతోషంరా! చాల సంతోషం. అయితే ఒక పని చెయ్యి' కొడుకు ముఖంలోకి చూస్తూ అన్నారు కోటయ్యగారు.

ఆయనలో ఇందాకటి ఉద్వేగం కొంత తగ్గింది. ఎమిటన్నట్లు తన ముఖంలోకి చూస్తున్న పెదబాబుకు వెంకన్నను చూపిస్తూ 'నీకు క్షమాభిక్ష పెట్టినందుకు ఈ దేవుడి కాళ్ళమీద పడి కృతజ్ఞత తెల్పుకో' అన్నారు.

పెదబాబు వంగి వెంకన్న కాళ్ళందుకోబోయాడు. వెంకన్న దూరంగా జరిగి పెదబాబును పట్టుకొని మనిద్దరికీ నిజంగా యీ దొరగారే దేవుడు. ఆరి కాళ్ళకే దణ్ణం పెడదాం' అన్నాడు.

ఆ మాటకు కోటయ్యగారు తనను తాను సంబాళించుకో లేకపోయాడు గబగబ వచ్చి వెంకన్నను కౌగలించుకున్నాడు.

వాళ్ళిద్దరినీ ఆ విధంగా చూచిన మేడమీది కుండీలలోని చేమంతులు గులాబీలు ఒక్కసారిగా కమ్మతావితో ఆ ప్రదేశాన్నంతా గుబాళింపజేశాయి. □

శ్రీ జి. వలసయ్య

# సారంగధర నాటకం - దీక్షితుల దృక్పథం

కవి ఆత్మీయత కావ్యంలో ప్రతిబింబిస్తుందనేది ప్రాక్పశ్చిమ పండిత సమ్మతం. ఉత్కృష్ట కళాస్వరూపమైన కావ్యముఖంగా కవి, లోకానికి రసానందంతో పాటు సందేశాన్నో, ఉపదేశాన్నో లేక సమస్యా పరిష్కారాదులతో నవ్య మార్గాన్ని చూపించడమో, ప్రబోధించడమో సామాన్యంగా జరుగుతుంది. వీటి వల్ల కావ్యంలో కవి తానెంత అలౌకిక జగత్తు సృష్టిస్తున్నప్పటికీ అందు తన ఆత్మీయత ద్యోతితం కాక తప్పదు. పై లక్షణాలు చింతా దీక్షితులుగారి రచనల్లో పుష్కలంగా ఉన్నా వాటిల్లో అగ్రశ్రేణికి చెందింది సారంగధర నాటకం.

"సారంగధర" చరిత్ర కల్పితమని చెప్పడానికి సందేహించక్కర్లేదు. ఈ కథకు కావ్యరంగం అటు రాజమహేంద్రవరం నుంచి ఇటు రాయదుర్గం వరకూ వ్యాపించింది. ఈ సారంగధర చరిత్ర పుట్టిననుంచి అటు గ్రంథస్థమైన శ్రవ్య దృశ్య కావ్యాల్లోనేగాక, లక్షణ గ్రంథాల్లోనూ, శతకాల్లోనూ, ఇటు సజీవ(ప్రజా) వాఙ్మయమైన ప్రజల పాటల్లోనూ, పదాల్లోనూ, ముచ్చట్లలోనూ మిక్కిలి చోటు చేసుకుంది, అంతేగాక సినిమాల్లోకి కూడా ఎక్కిన సన్నివేశాలు లేకపోలేదు. మన సంప్రదాయ విరుద్ధమైన సన్నివేశం ఈ విధంగా కూడా లోకంలో జరిగిందా? అనే ఆశ్చర్యం వల్ల, కథలో ఉండే పటుత్వంవల్ల ఇది మిక్కిలిగా ప్రజలను ఆకర్షించి ఉండవచ్చు. ఇది పుట్టిననుంచి సామాన్య జనులచే ఆకర్షించబడటమే కాదు, కవులను కూడా కవ్వించింది. ఈ(ఒకే) విషయంపై కవులనేకులు శ్రవ్య, (ద్విపద పద్య) దృశ్య (యక్షగానాలు, నాటకాలు, నాటికలు) కావ్యాలు నేటికీ రాస్తూ ఉండడం విశేషం. అసలు తెలుగు సాహిత్యంలో ఒకే ఇతివృత్తాన్ని తీసుకొని (చిన్న చిన్న మార్పులు చేసినా) కావ్యాలు రాయడానికి ఆలంబనగా నిలిచిన దాంట్లో బహుశ ఇదే అగ్రస్థానం వహించిందని చెప్పవచ్చు. దీనిమూలంగా తెలుగు సాహిత్యానికి అలంకారమైన సాహిత్య సృష్టి కూడా జరిగిందని చెప్పవచ్చు.

ఇంతగా కవులను, పండిత పామర జనులను ఆకర్షించిన ఈ 'సారంగధర చరిత్ర' పుట్టుపూర్వోత్తరాల గురించి సంక్షిప్తంగా మనకు ఆధారాలు దొరికినంత వరకు తెలుసుకోవడం అవసరం.

ఈ సారంగధర చరిత్ర ఎలా పుట్టిన, ఎక్కడ పుట్టిన ఇది మిక్కిలి పరాకాష్ట పొంది రుచించింది. 'చేమకూర పాకంలోనే' అని చెప్పవచ్చు. ఈ చేమకూర వెంకటకవిగారి 'సారంగధర చరిత్ర'కు ఆధారం గౌరన నవనాథ చరిత్రం (15 వ శతాబ్ది పూర్వభాగం). ఈ చరిత్రలో 'సారంగధరుని కథ' మీననాథుని దేశాటనం అనే ఘట్టంలో ఉంది. నవనాథ చరిత్ర ద్విపద కావ్యం. గౌరన తన నవనాథ చరిత్రకు మూలం శ్రీగిరి కవి కృతపద్యకావ్యమని స్పష్టంగా చెప్పాడు. ఇది నేడు మన కలభ్యం. గౌరన శ్రీగిరి పద్యకావ్యాన్ని ద్విపదలో రాయగా ఆ ద్విపదను వేంకటకవి పద్యాల్లో రాశాడు! వేంకటకవి పద్యాలను బాణాల శంభుదాసు, కూచిమంచి తిమ్మకవి మరల ద్విపదలో రాశారు. పద్యాలను ద్విపదల్లోనికి, ద్విపదలను పద్యాల్లోనికి మార్చి రాయడం ఆనాడు ప్రబలంగా ఉంది.

గౌరన కృతిలో ఈ కథ జరిగిన స్థలం మాళవదేశంలోని మాంధాతపురమనీ, ఆ పురానికి అధిపతి రాజమహేంద్రుడని ఉంది. క్రీ.శ.1560 ప్రాంతంలో దోనేరు కోనేరు కవి రచించిన 'బాలభాగవతమ'నే ద్విపద కావ్యంలో విమలాదిత్యునకు భానుమతికి రాజరాజనరేంద్రుడు జన్మించాడని, ఆ రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరమనే పేరుతో రాజధానిని కట్టించి, వేంగిదేశాన్ని పాలించాడని చెప్పబడింది. అంతేగాక అతని పెద్ద కొడుకైన సారంగధరుడు శాంతమూర్తని ఇతడు పినతల్లివల్ల కలిగిన ఆపదనుంచి గట్టెక్కి చౌరంగి అనే సిద్ధుడైనాడని చిత్రాంగి సారంగధరులను ప్రస్తావించడం జరిగింది.

'ఆ రాజమణికార్యుడగు పెద్ద కొడుకు
సారంగధరు డతిశాంతుడై యుండి
ఆసక్తిఁ బినతల్లియైన చిత్రాంగి
చేసిన యాపదఁ జెచ్చెరఁ గడచి

* * *

కాబట్టి సారంగధరుని కథ అతని నాటికే రాజమహేంద్రవరానికే వచ్చిందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

వెంకటకవి మాళవదేశాన్ని అలాగే ఉంచి మాంధాతపురాన్ని రాజమహేంద్రంగానూ. రాజమహేంద్రుని రాజరాజనరేంద్రునిగాను మార్చాడు. ఆ రాజనరేంద్రునకు రాజరాజనరేంద్రుడు, రాజరాజు అనే పేర్లు కూడా ఉన్నాయని చెప్పాడు (1–5). అంతేగాక వేటకు వెళ్ళిన రాజరాజనరేంద్రుడు చిత్రాంగిమీద విరహంతో నగరానికి తిరిగి పోవాలనుకుంటాడు.

'అక్కట యేమి సేయుదు? రయంబున నిప్పుడె పోదునంటినా
మిక్కిలి దూరదేశము! సమీపమె? మాళవ భూమి మండలం
బెక్కడ! దండకావన మిదెక్కడ! .........

అని అనుకున్నట్టు రాశాడు. వెంకటకవి భావంలోనూ, రాజనరేంద్రుడు మాళవదేశపు రాజే, ఆ రాజమహేంద్రమూ మాళవదేశంలోనిదే. ఆంధ్రదేశంలోది కాదు. రాజనరేంద్రుని మీద, రాజమహేంద్రం మీద తనకు ఉండే అభిమానం వల్ల ఆ విధంగా చేర్చి ఉండవచ్చు.

వెంకటకవి తరువాత వచ్చిన సారంగధర చరిత్రలలో మాంధాత నగరంతో మాళవదేశం కూడా మాయమైపోయింది. బాణాల శంభుదాసు, కూచిమంచి తిమ్మకవి కూడా రాజనరేంద్రునిపై మరింత అభిమానంతోనేమో సారంగధరుని కథ రాజమహేంద్రవరంలోనే జరిగినట్లు స్పష్టంగా రాశారు.

"ఎట్లయిననేమి సారంగధరుని కథ మాళవదేశమున మాంధాతపురమున పుట్టి, అంచెలమీద ఆంధ్రదేశమునకు దిగి రాజమహేంద్రమున ఇరవుకొన్నది. అంతతో ఆగినదా! దేశములో పలుతావులకు ప్రాకినది. రాజమహేంద్రవరములో వలెనే, చిత్రాంగి మేడలు సారంగధరుని మెట్టలు కూడా వెలసినవి'... ఎవరెన్ని మార్పులు చేసి వ్రాసినను సారంగధరుని కథ రాజమహేంద్రవరములో జరిగినదనుట మాత్రము సత్యము కాదు."[1]

ఈ సారంగధర చరిత్రను తీసుకొని ఆధునికంగా నాటకాలు రాసిన వారున్నారు. దీనినే తీసుకొని క్రీ.శ. 1885 ప్రాంతంలో కీ. శే. ధర్మవరంవారు 'విషాద సారంగధర నాటకము'ను రచించారు. ఇందులో చిత్రాంగిని ఆంధ్ర సాహిత్యంలో ఏకైక ప్రేమమూర్తిగా చిత్రించి, ఆమె ప్రయత్నం విఫలం కావడంతో మిక్కిలి పతనమూర్తిగా కూడా చిత్రించారు. (ఇది తెలుగు సాహిత్యంలో తొలి విషాదాంత నాటక మవడం విశేషం') ఈ నాటకం దృశ్యకావ్యంగా జనులను

మిక్కిలి ఆకర్షించిందని కాని "యిప్పుడు దోషజ్ఞుల హస్తముల కెక్కనుంకించు చున్నదని" ధర్మవరంవారు పీఠికాముఖంగా తమ శంకను వ్యక్తం చేయడంవల్ల వప్పటికే సారంగధర చరిత్రపై చిన్న చిన్న అనుమానాలు, విమర్శలు బయలు దేరుతున్నట్లు మనకు స్పష్టమవుతుంది.

తరువాత ఆంధ్రాభిమాని అయిన శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'రాజరాజు' (పు-78) అనే నాటకంలో 'రాజరాజు చిత్రాంగిని వివాహ మాడడం వల్ల భారతం నన్నయ రాయడం మానేశాడని' నన్నయ గొప్పతనాన్ని విశద పర్చి రాజరాజును గోదావరిలో కలిపేశారు.

గౌరన నవనాథ చరిత్రలోను, చేమకూర సారంగధర చరిత్రలోనూ చిత్రాంగిని భోగకాంతగనూ, శంభుదాసు, తిమ్మకవి ఆమెను రాజరాజనరేంద్రుని రెండవ భార్యగానూ పేర్కొన్నారు. ఇంతవరకు 'సారంగధర చరిత్ర' కావ్యాల పేరుతో చారిత్రక పురుషుడైన రాజరాజనరేంద్రునిపై, అతని కుటుంబ సభ్యుల పైన ఎటువంటి సంబంధం లేకుండా ముడిపెట్టి చెప్పబడిన విషయాలు.

చారిత్రక పురుషుడు కదా రాజరాజు! అతనికి రాజమహేంద్రవరమే రాజధాని. అతని భార్య పేరు అమ్మంగదేవి. అతని కుమారుని పేరు రాజేంద్ర చోళదేవుడు. ఈ విధంగా చరిత్ర చెప్పుతుండగా పై కథను తీసుకొచ్చి భారత రచనకు ఎంతో ప్రేరణనిచ్చి తెలుగు సాహిత్యానికి శ్రీకారం చుట్టింప జేసిన రాజరాజ నరేంద్రునకు అతని కుటుంబ సభ్యులకు ముడిపెట్టి కావ్యాలు రాయడం చాల దురదృష్టకర విషయం. ఇవి మన రచయితల చారిత్రక జ్ఞానలేశమో! రాజరాజ నరేంద్రునిపై అమితాభిమానమో! కథలో ఉండే ఆశ్చర్యకర సన్ని వేశమో! కాని దీని నాధారంగా ఎన్నో రచనలు పుట్టాయి. ఇవి ఆంధ్ర భారత కృతి భర్తకు చేసిన మర్యాద ఏమీ లేదు సరికదా. మిక్కిలి అన్యాయం చేస్తున్నా యని చెప్పక తప్పదు.

"కాళ్ళకూరి నారాయణరావుగారు చిత్రాభ్యుదయమనే తమ నాటిక అవతా రికలో ఇవన్నీ చర్చిస్తూ ఈ సారంగధర నాటిక ఇతివృత్తం రాజరాజునకు చెందింది కాదని తేల్చి, సారంగధరునకు, రాజరాజును, చిత్రాంగికి కళంకంలేని రీతిగా లెస్సగా రచించారు."[2] సారంగధర నాటకాలన్నిటిలోనూ ఇది మనోజ్ఞంగా ఉందని చెప్పవచ్చు. చిత్రాంగ సారంగధరులకు వివాహం చేసినవారు నారాయణ రావుగారొక్కరే. ఇది ఆ రోజుల్లో-(1909) చాల సాహసమైన పని.

చలంగారు గూడా ఇంచుమించుగా అదే విధానము ననుసరించి చిత్రాంగీ- సారంగధరులు తొలుతనే ప్రేయసీ ప్రియులనియు, వారిని కాదని అధికార మదమున రాజరాజు చిత్రాంగిని వివాహ మాడెనని, నిరూపించి అట్టి బలవంతపు వివాహములు దేశములో జరుగుచున్నవనియు, వాని పర్యవసానము, చిత్రాంగీ సారంగధరుల గాథవలెనే. విషాదాంతమనియు చలంగారు చిత్రాంగిలో నిరూ పించారు."[3]

ఇలా అదివరకుండే సారంగధర ఇతివృత్తాన్ని నవ్యదృక్పథంతో-కళంకం లేని విధంగా మార్పులు చేయడం జరిగింది. పీటిని పండితులు, విమర్శకులనేకులు దుయ్యబట్టారు.

దీక్షితులుగారు పై విషయాలన్నింటినీ దృష్టిలో పెట్టుకొని పై కావ్యాల మూలంగా తెలుగు సాహిత్య సృష్టి, రసానందం అటుంచి తెలుగు రాజైన రాజ రాజనరేంద్రునకు, అతని కుటుంబానికి జరుగుతున్న అన్యాయాన్ని, కవులు చేస్తున్న అపచారాన్ని చమత్కారంగా 'సారంగధర నాటకం'(భారతి, 1934) అనే పేరుతో భంగ్యంతరంగా తెలియజేశారు.

అసలీ నాటకం ఎత్తుగడే వేరు. ఈ నాటక రూపకల్పనకాస్పదమైన ఆయన భావనకు మనం శ్లాఘించవలసి ఉంది. కవి తానై నాటికలో పాత్ర కావడం బహుశ చారిత్రక నాటికల్లోనూ ఇదే మొదటిసారేమో! కవి తానై పాత్ర కావడం వల్ల కవుల తరపున వ్యంగ్య 'వకల్తా' పుచ్చుకొని రాజరాజ నరేంద్రునితో వారి కుటుంబ సభ్యులతో కూడా ముఖాముఖీ సంభాషించడానికి వీలుపడిందనవచ్చు. అందువల్ల కవి ప్రపంచాన్ని ప్రత్యక్షంగా నిందించకుండా వ్యంగ్యంగా మందలించడం ఈ నాటికవల్ల జరిగిందనవచ్చు. ఎలాంటి నాటక మైనా, నాటిక అయినా ప్రతి సంభాషణ, ప్రతి మాట ఆసక్తిదాయకంగా వుండి పాఠకుని చదివించేవి చాలా అరుదు. ఈ నాటిక చదవడం ప్రారంభించిన నుంచి చివరిదాకా పాఠకుని ఉత్కంఠతతో చదివిస్తుంది. నాటికా నిర్మాణానికి ఇంతకంటే మించిన సమస్యగాని, అద్భుత సన్నివేశంగాని, సంభాషణా చాతుర్యంగాని, వాతావరణ కల్పనగాని లేదనే విధంగా నాటికా నిర్మాణం చేసి, నాటికాకర్త తాను చెప్పదలచిన విషయానికి అధిక ప్రాధాన్యతనిస్తూ. తన భావనను నవ్య దృక్ప థంపై సారించడంతోపాటు రానున్న నాటక కర్తలకు నవ్యమార్గాన్ని(సందేశం) చూపారు.

ఈ నాటికకు రంగప్రదేశం చరిత్ర ప్రసిద్ధమైన గోదావరి ఒడ్డున ఉండే రాజమహేంద్రవరం. రాజరాజ నరేంద్రుని భవనాలు, నివాసగృహాలు చెప్ప బడ్డాయి. ఇలా మొదటి రంగంలో కథ నడుపుతూ, రెండవరంగంనుంచి నాటిక పరిసమాప్తమయ్యే వరకు రంగప్రదేశం నాటికాకర్త గృహమవడం విశేషం. ఇదే ఇందులో వుండే అద్భుతం.

నాటిక మొదటి రంగం తన గృహంలో చిత్రపటాలను పరికిస్తున్న రాజ రాజు పాత్రతో ప్రారంభమవుతుంది.

రాజరాజు చిత్రాంగిపై తనకుండే మోహం సరియైనదో కాదో నిర్ణయించు కోవడానికి డోలాందోళిత మనస్కుడవుతాడు. తుదకు ఆ కోరిక సమంజసమైందని తనలో తాను నిర్ణయించుకొని, తన అభిప్రాయాన్ని కుమారుడైన సారంగధరుని పిలిపించి తెలియజేస్తాడు. సారంగధరుడు తండ్రి ఆజ్ఞను శిరసావహించి ఒప్పు కుంటాడు. ఆ తరువాత పెద్ద భార్య రత్నాంగి అభిప్రాయం కూడా ఈ విష యంలో కనుగొని రమ్మని కుమారుని పంపుతాడు.

ఈలోగా రాజుగారు దక్షిణ భవనంలో ఉండే చిత్రాంగి అభిప్రాయాన్ని కనుగొనడానికి వెళ్తాడు. చిత్రాంగి రాజరాజు రాక చూచి, పువ్వుల పళ్ళెం చేత్తో పట్టి, సిగ్గూ, బిడియం, అయిష్టత ముప్పిరిగొనగా అదో విధంగా నిలబడింది. కాబోవు చిన్నరాణీగారికి క్షేమమా? అని రాజు ఆమెను క్షేమ సమాచారాలతో సంబోధిస్తూ, మా కుమారరత్నం మా అభిప్రాయంతో ఏకీభవించాడు, దేవేరిగారి అభిప్రాయాన్ని తెలుసుకోవడానికి వచ్చానంటాడు. అంతేగాక తన సర్వస్వం నీ వశం చేశాననీ, నీ సమ్మతి నా వశం చెయ్యమని అంటాడు. 'సిరిరామోకాలొడ్డే ముగ్ధను మాత్రం కాను నేను' అంటూ రాజరాజుకు పళ్లెంలోని పువ్వులు సమర్పించి స్వాగతం పలికింది చిత్రాంగి. దాంతో "మంగళసూత్రధారణమునకు గళము సవరించుకో. వెళ్ళి వస్తా చిన్నరాణీగారూ!" అంటూ రాజు మిక్కిలి ఉత్సాహంతో వెళ్ళిపోతాడు. ఆ తరువాత 'రాజుకు మంగళసూత్రము కట్టుటకు గళము ఇస్తా. యువరాజుకు దేహమూ, హృదయమూ' అనే చిత్రాంగి మాటలు సారంగధరునిపై ఆమెకుండే ప్రేమను స్పష్టం చేస్తుంది. ఎలాగైతేనే. నయాన్నో భయాన్నో రాజరాజు చిత్రాంగి సమ్మతిని పొందాడు.

ఆ తరువాత ఉత్తర భవన ఉద్యానవనంలో ఉన్న రత్నాంగి అభి ప్రాయాన్ని తెలుసుకోవడానికి రాజరాజు వెళతాడు. ఆమె మిక్కిలి ఉసులుగా వుండి రాజుగారికి హితవు బోధించడానికై కొన్ని నీతివాక్యాలు, అనునయ వాక్యాలు చెప్పడానికి ప్రయత్నించింది. అది అంతా విన్న రాజు విసిగి 'నా సంకల్పమునకు యువరాజుగారు—మన కుమారరత్నము సమ్మతి ఉన్నది.

1. దీపాల పిచ్చయ్యశాస్త్రి(పరిష్కర్త)-సారంగధర చరిత్ర (చేమకూర) పు.లు 31-2.

2. గొట్టిఫాటి వెంకట సుబ్బయ్య - చలం, పు, 520

3. పి.యస్.ఆర్. అప్పారావు - తెలుగు నాటక వికాసము, పు. 370

చిత్రాంగి ఇష్టమున్నది. దేవిగారి సమ్మతి కూడా ఆశిస్తున్నాము. కాబట్టి దేవిగారు ఎట్టి అభ్యంతరమూ చెప్పకూడదు.' అని పెద్ద రాణి ముందరి కాళ్ళకు బంధం వేశాడు. అపుడు రత్నాంగి మరల అతని బుద్ధిని, ధర్మాన్ని, నీతిని గుర్తుకు తెచ్చి శ్లాఘిస్తూ; అలాంటి మీకెందుకీ దుర్బుద్ధి కలిగిందని అంటుంది. దీనివల్ల మన వంశం పేరు ప్రతిష్ఠలకు తీరని కళంకమేర్పడుతుందని ఎలాగైనా ఈ సంకల్పం విడవండి మహారాజా! అని వేడుకొంటుంటి రత్నాంగి. పై విధంగా రత్నాంగి మాట్లాడుతుండగా రాజరాజు ఏమి సమాధానం చెబుతాడా అని ఆతురతతో ఎదురు చూస్తూంటాం. కాని దీనితో మొదటి రంగం పూర్తి అవుతుంది.

ఇక రెండో రంగంలో ఏమి చెబుతాడో నాటికాకర్త అని ఆసక్తితో ఉంటాం. మొదటి రంగం నడుస్తున్నంతవరకు ఇతను కూడా ఒక బ్రహ్మాండమైన 'సారంగధర నాటకం' రాస్తాడేమో అని ఉత్సాహం కలుగుతుంది. కాని మనకే కాదు కవి కూడా. ఊహించని విధంగా రెండోరంగం నుంచి పూర్వ కథాగతే పూర్తిగా మారిపోతుంది. అలా మొదటిరంగం ముగించబోతూండగా గుర్తు తెలియవి ఒక ముసలి వ్యక్తి ప్రాచీన రాజుల వేషభూషణాదులతో హఠాత్తుగా వచ్చి మన నాటకకర్త (రాస్తున్న) కలాన్ని పట్టుకొన్నాడు. అతడు ఎలా వచ్చాడో అని గది నాలుగు వైపులు చూశాడు. దిక్కు తోచలేదు. అంతకుతోడు అప్పుడు అర్ధరాత్రి సమయం కావడంవల్ల నాటకకర్త మరింత ఆశ్చర్యంతోనూ భయంతోనూ ఆతన్ని చూచి, అతడు రాజరాజునని చెప్పగా తెలుసుకొన్నాడు. అయితే మీరు నా కలంలోనుంచి దిగారా, ఈ కాగితంలోనుంచి లేచారా? ఎట్లా వచ్చారిక్కడికి? నేను సృష్టించిన నాటకపాత్రలకి దేహమూ, ప్రాణమూ వచ్చినవా?" అంటూ రాజును ఆశ్చర్యంతో అడుగుతాడు. ఇక ఇక్కడ (రెండవ రంగం) నుంచి నాటిక అంతా నాటికాకర్త గృహంలోనే జరుగుతుంది. కవితో రాజరాజు అతని కుటుంబసభ్యులు ప్రత్యక్షంగా సంభాషించడంవల్ల పాఠకులను మరింత ఉత్సాహంతోపాటు ఆశ్చర్యచకితుల్ని కూడా చేస్తుంది. మొదటి రంగం ఆరంభం నుంచి చివరిదాకా మనం ఆసక్తితో చదువుతాం. రెండవ రంగంనుండి నాటిక చివరివరకు సన్నివేశాలు, పాత్రల సంభాషణలు ఆతురతతో, ఆసక్తితో, ఉత్సాహంతో మనల్ని చదివిస్తాయి. ఈ రెండు మూడు రంగాలలో ఆనాటివరకు వెలువడిన సారంగధర చరిత్రల (శ్రవ్య, దృశ్య, కావ్యా)ల్లో ఆయా పాత్రలపై ఉండే అభిప్రాయాల్ని, లోకంలో ఉండే అభిరుచుల్ని, కావ్యకర్తలు చేస్తున్న అన్యాయాల్ని రాజరాజుగారి కుటుంబ సభ్యులు ఒక్కొక్కరితో ముఖాముఖిగా చర్చిస్తాడు మన నాటకకర్త. ఈ చర్చ అత్యంత మనోజ్ఞం. చమత్కార సహితం. సారంగధర చరిత్రలు రాసిన, రాస్తున్న, రాయబోవు కవిపుంగవులకు వ్యంగ్య సందేశభరితం. వాటిని పరిశీలిద్దాం.

రెండోరంగంలో మొట్టమొదటే రాజరాజుతో కవి సంభాషణ చమత్కారంగా ప్రారంభమవుతుంది. రాజరాజు అక్కడకు రావడమే చాల ఆశ్చర్యంగా ఉందని కవి అనగా 'వెయ్యి సంవత్సరాల క్రితం వున్న రాజులను లాక్కువచ్చి నీ యిష్టం వచ్చినట్లు ఆడించడంలో ఆశ్చర్యం లేదూ?...దేశకాలాలని జయించినట్లు ఊహించుకొంటున్నారు కాబోలు మీ కాలపువాళ్ళు?" అంటాడు రాజు. రాజు అడిగిన ప్రశ్నలన్నింటికీ, కవుల స్వరూప స్వభావాల గురించి, వారి సహజ లక్షణాల గురించి, కృతుల నిర్మాణం చేయడంలో వారి స్వేచ్ఛ గురించి, కావ్యాల ఔన్నత్యాల గురించి, కవుల తరఫున చక్కగా చమత్కారంగా సమాధానం చెబుతాడు నాటకకర్త. అసలు ఇలాంటి కావ్యాలు రాయిడంలో ప్రయోజనమేమిటని రాజరాజు మన కవిపై మరల ప్రశ్నల వర్షం కురిపించగా 'మహారాజా మీ ప్రశ్నలకు నేను సమాధానం చెప్పలేను. ఈ కాలపు నాగరికముకూ, ఆచారములకూ నేనొక్కడనే జవాబుదారీ అనుకున్నారా? నాకూ, మీకూ కాలంలో వెయ్యి సంవత్సరములు అంతరమున్నది...మీ చరిత్ర నాటకంగా ఎందరెందరు కవులు వ్రాశారు. యక్షగానాలు వ్రాయలేదా! పాటలు వ్రాయలేదా! కావ్యాలు వ్రాయలేదా! పదములు కట్టలేదా! నేటికి మీకు నేను దొరికానా దండించి అడగడానికి!' అంటూ సమాధానం చెబుతాడు.

ఆ తరువాత రాజరాజు సమాధాన మిచ్చిన మాటలు సారంగధర చరిత్ర కల్పించి రాసిన కవులకు గుండెల్లో సూదిపోట్లు లాంటివి. 'అయితే నీవు వ్రాసే కథ చరిత్రే - నిజముగా జరిగిన చరిత్రే అంటావా? రాజమహేంద్రవరంలోనే జరిగిందంటావా? ఆంధ్ర సామ్రాజ్యమేలిన రాజు వట్టి దౌర్భాగ్యుడని నమ్మతావా? అతనికి ఒక రాణీ నంటకట్టి, ఆ రాణికి వ్యభిచార మంటకట్టుతావా? నీ పూర్వీకులను, నీ వంశస్థులను......తెలుగురాజు అనేనా అభిమానం లేదా?" అని రాజు అనగా ఇది ఎప్పుడో వృద్ధ సంప్రదాయంలోని కథ కాబట్టి నన్ను దండించవద్దు బాబు అని వేడుకుంటాడు మన కవి, దీనితో రెండవ రంగం పూర్తవుతుంది,

ఇక మూడవ రంగంలో రాజరాజు అదృశ్యం కాకుండా ఒక ప్రక్క కుర్చీలో కూర్చుంటాడు. నాటకకర్త తలయెత్తి చూసేసరికి సారంగధరుడూ, చిత్రాంగీ, రత్నాంగీ, సేవకులూ, చేటికలు అందరూ నవ్వుకొంటూ నిలబడ్డారు. మన నాటకకర్త చుట్టూ. ఇంకా ఏమి బాధపెడతారో అని భయం పట్టుకొన్నదట ఈయనకు.

కవిగారికి నమస్కారం చేస్తూ సారంగధరుడు ముందుకు వస్తాడు. 'నా నాటకం విషాదాంతం చెయ్యాలనుకొంటే; కాళ్ళూ చేతులు మళ్ళీ మొలిచినట్లున్నవే నీకు"—అని ఆశ్చర్యపోతూ అంటాడు నాటికాకర్త. విషాదాంతం అంటే ఏమిటని, ఇది దశవిధ రూపకాల్లో ఉందా? అని గద్దించి సారంగధరుడు అడిగితే ఆ గొడవంతా నాకు తెలియదు ఇది 'డ్రామా' అన్నాడు కవి. అనగా ఇది భారతీయాలంకారికులు చెప్పిన రూపక లక్షణం కాదని. ఇది ఇంగ్లీషు సాహిత్య ప్రభావంవల్ల వచ్చిందని 'డ్రామా' అనే పదంవల్ల తెలుస్తుంది. ఈ విషయమై సారంగధరుడు, కవి, అలంకార శాస్త్రం గురించి, దాన్ని కవులు అనుసరిస్తున్న తీరుతెన్నులు గురించి విమర్శనాత్మకంగా చర్చించుకుంటారు. చివరిగా మన కవిగారు(విసిగి) తాను అలంకార శాస్త్రాలన్నీ చదవవలసిన అగత్యం లేదని ఖండితంగా చెప్తాడు. అయితే నాటకం వ్రాయవలసిన ఆగత్యం కన్పిస్తోందా నీకు?...... దివంగతులైన అట్టివాళ్ళను నీ చేతి కీలుబొమ్మలుగా త్రిప్పవలసిన అగత్యం కన్పిస్తోందా నీకు? దేశ మర్యాదలూ, కాలమర్యాదలూ, భాషామర్యాదలూ, కావ్య మర్యాదలూ - ఏమి పాటించకుండా కాళిదాసు పదవికి అశించవలసిన ఆగత్యం కన్పిస్తోందా నీకు...రాజులూ, రాణీలూ లోకువయ్యారా నీకు?...నీ మనోదౌర్బల్యము నీ నాటకపాత్రలైన రాజులకీ. దేవుళ్ళకీ ఎందుకారోపిస్తావు?' అంటూ సారంగధరుడు కావ్యనిర్మాణంలో కనీస మర్యాదలు పాటించని కవులు తమ కుటుంబానికి చేస్తున్న అన్యాయాన్ని ప్రత్యక్షంగా తర్కించాడు. అసలు ఈ నాటకాని కంతటికీ నీవే కారణమని చిత్రాంగి మాటను కిక్కురుమనకుండా చెల్లిస్తే కథ ఇంతవరకూ వచ్చేది కాదని సారంగధరుని చమత్కరిస్తాడు కవి. ఉచితానుచితాలు తెలియనివారితో ఇక నే వాదించను, కాలం ఎంత మారిందీ. అని





ఆశ్చర్యపోతుం సారంగధరుడు ప్రక్కకు తప్పుకుంటాడు.

ఆ తరువాత రత్నాంగి ప్రవేశించి కవిగారిని వేడుకున్న తీరు చక్కగా ఉంది. "అసూర్యంపశ్యలైన రాణివాసాన్ని సభలకు - ఎక్కించకు నాయనా! సారంగధరుడికోసం ఎప్పుడో ఒక్కమాటు విచారించాను. దుఃఖించాను-వాస్తవమే. మీ కవుల ధర్మమా అంటూ నాకు ఈ దుఃఖానికి అంతం లేకుండా వుంది. ప్రతీ ఊళ్లోనూ, ప్రతివాళ్ళ ఎదుటా...ఏడ్పించడం న్యాయమేనా మీకు-నిజం ఏడ్పుకాదమ్మా ఇదంతా నాటకం అంటాడు కవి. ఆ దుఃఖాల్నీ నాకు తీరిపోయాయని, ఇప్పుడు మేమంతా క్షేమంగా ఉన్నాం. మమ్మల్ని విడిచిపెట్టి ఇంకేదైనా వ్రాసుకోండి నాయనా......" అంటూ రత్నాంగి తనయుణ్ణి మంద లించినట్లుగా వేడుకొంటుంది.

ఆ తరువాత చిత్రాంగి కవిగారితో మాట్లాడడానికి ముందుకు వచ్చింది. చిత్రాంగి మిక్కిలి ఆప్యాయతతో కవిగారిని సంబోధిస్తూ తాను కూడా నీ తల్లి భార్యలాంటి మనుష్యజాతికి చెందినదాననే సుమా! అని హెచ్చరిస్తుంది, నాటకంలో పాత్రలు చిత్రించేటప్పుడు బంధుత్వాబంధుత్వాలు తెలిసి చిత్రించడం చాల కష్టమని అంటాడు. అయితే ఇంతకీ నీ అభిప్రాయంలో నేను వారస్త్రీనా? రాణీనా? అని అడుగుతుంది. కావ్యాల్లో వారస్త్రీవి, నాటకాల్లో రాణీవి అంటాడు కవి. అదెట్లా అని చిత్రాంగి అడుగగా అది కవి ఇష్టమని ప్రకటించి చెబుతాడు నాటకకర్త. "అయితే కవి యిష్టాన్నిబట్టి పురుషులు స్త్రీలుగాను, స్త్రీలు పురుషులుగాను, కులస్త్రీలు కులటలుగాను, కులటలు, కులస్త్రీలు గాను ఎలాగ బడితే అలాగ మారవచ్చు నన్నమాట!" అనే చిత్రాంగి మాటలు 'నిరంకుశాః కవయః' అనేదానికి గొడ్డలిపెట్టువంటివి. అయితే ఇది చారిత్రక నాటకమెలా అయిందని చిత్రాంగి అడుగగా 'కవి ఉపజ్ఞను బట్టి దాని వెన్నంటి రావలసిన ప్రతిభను బట్టి కథ మారుతుంది.' అంటాడు కవి. అర్థంలేని మాటలు అట్టే ఉపయోగించకు నాయనా! అంటూ సున్నితంగా కవిలోకానికి నొక్కి చెప్పుతుంది చిత్రాంగి. ఎవరేమనుకున్నా నాకేమి అభ్యంతరం లేదు అంటాడు కవి. నాటకం రాయవద్దంటే అభ్యంతరమా అంటుంది చిత్రాంగి. అయితే అప్పుడు కవి 'బాబోయ్, నేను నాటకం వ్రాయను, మీ నాటకం అసలే వ్రాయను రాసిందానికి ఇదిగో లెంపలు వాయించుకొంటున్నాను. వెళ్ళండి మీరంతా వెళ్లండి...

ఇక్కడ నాటకకర్త తాను ఈ కథను రాయనని - లెంపలేసుకోవడం కాదు, అంతవరకు కావ్యాలుగా రాసిన కవులకు కళ్లు తెరిపించి సున్నితంగా లెంపలు వారి చేతితో వారికే వేయించారనవచ్చు.

పైన వచ్చిన నాలుగు పాత్రల్లో రాజరాజు తన పరువు ప్రతిష్టను రసాత్మక కావ్యాల పేరిట మంటగలుపుతున్న దానిని గురించి, సంభాషించగా, సారంగధరుడు తన్ను విషాదాంత నాయకుడిగా నాటకకర్తలు చిత్రించే తీరు తెన్నులను సంభాషించాడు. రత్నాంగి తన కుటుంబ గౌరవ మర్యాదలని దెబ్బ తీసే ఈ కథను ఇకముందు రాయవద్దని వేడుకొంటుంది. ఇక చిత్రాంగి తనను రాణిగా, వేశ్యగా చిత్రించడం బాగులేదని, నీతి నియమాలబట్టి, ధర్మాలబట్టి, అర్థవంతంగా చిత్రించమని హెచ్చరిస్తుంది. ఇలా ఈ పాత్రలు వ్యక్తిగతంగా ఈ నాటికలో తాము పొందుతున్న శాశ్వతాపకీర్తుల గురించి వక్కాణించి చెప్పి ఇక ముందు ఇలాంటి నాటకాలు రాయవద్దని వేడుకుంటాయి.

రాజరాజు అతని కుటుంబ సభ్యులు అదృశ్యులు కాగా, అక్కడ ఉండే సేవకుడు, చేటికా నవ్వుతూ కవిగారికి దండాలు పెడుతూ అంతసేపు వద్దన్న వారి కథను మానేసి, తమ కథను తమ పేర్ల మీదుగా 'లీలాసుందరీయ'మనే పేరుతో చక్కని నాటకంగాని, తోలుబొమ్మలనాటకంగాని వీధినాటకంగాని రాయమని వేడుకుంటారు. అలా వేడుకొంటూ సేవకుడూ, చేటికా గాలిలో కరిగిపోగా మన కవి గారు తన కుర్చీలో నిద్దరోతూ కలవరింతలతో మిగిలిపోయి, మనకు ఆశ్చర్యం మిగుల్చుతారు. చివరిగా సారంగధర నాటకం అసలు రాయనని, లీలాసుందరీయం రాస్తే రాస్తానని నిశ్చయించుకుంటాడు కవి. ఇంతటితో నాటిక పూర్తవుతుంది. ఈ లీలాసుందరీయమనేది రాజుల ప్రణయానికి భిన్నమైన సామాన్య ప్రేమికుల ప్రేమకు అసలు సిసలైన ప్రతిరూపం. ఇది నవ్య దృక్పథంలో సాగింది.

ఈ నాటిక ఎత్తుగడ ఎంత రమ్యంగా ఉంటుందో, మధ్యలో రెండవ రంగం కథ మలుపు అంత అద్భుతంగా ఉండి, చివరివరకు మనల్ని చదివిస్తూ, చివరి ముగింపు కూడా ఎంతో చక్కగా చేశారు నాటికాకర్త. నాటిక కుండవలసిన లక్షణాలన్నీ పుష్కలంగా ఇందులో ఉన్నాయి. కాని 'సారంగధర చరిత్ర' రచనల నేపథ్యం తెలిస్తే తప్ప దీనిని వినిగాని, చదివిగాని ఇందులో చమత్కారాలు ఛలోక్తులు మొదలయిన స్వారస్యాలు కొంతవరకయినా అర్థం చేసుకుని ఆనందించడం కష్టం,

అయితే ఈ నాటిక ఆద్యంతం చదివిన తరువాత 'సారంగధర చరిత్ర' నాటకంగా చూడడం, చదవడం మాట దేవుడెరుగు, కాని నాటకంగా గాని, కావ్యంగాగాని రచించడానికి ఏ కవిపుంగవుడు పూనుకోడనటం నిర్వివాదం.

సామాన్యంగా చారిత్రక కావ్యాలవల్ల దేశభక్తి ప్రేరేపితమవుతుండగా ఈ 'సారంగధర చరిత్ర'వల్ల రాజరాజుపై చిన్నచూపు, హేయభావం కలుగుతుంది. ఇలాంటి రాజులు ఏలిన దేశమా ఇది అనిపిస్తుంది. రాజరాజుపై ఇలాంటి ఆచ్ఛాదనని తొలగించడానికి ఈ నాటికద్వారా దీక్షితులుగారు ప్రయత్నించి కృతకృత్యులయ్యారు, క్రాంతదర్శులుగా, లోకానికి మేలు చేకూర్చుతున్న కవులు, కావ్య కళామార్గంలో ఒక చారిత్రక పురుషునిపై, చారిత్రక సత్యాన్ని విస్మరించి వేస్తున్న తప్పటడుగుల తీరుతెన్నులను, సున్నితమైన వ్యంగ్యధోరణితో విమర్శ చేసే విధానంలో ఇతనికితనే సాటిఏమో! ఈ నాటికలో ఏ కవినీ నిందించలేదు. వ్యంగ్య మందలింపు తప్ప. ఇదే ఇతని వ్యక్తిత్వానికి మచ్చుతునక.

## ఉపజీవికా గ్రంథాలు


| | |
|---|---|
| చలం. | వెంకటసుబ్బయ్య గొట్టిపాటి |
| చిత్రాంగి. | చలం, జి.వి. విజయవాడ; దేశీ ప్రచురణ ప్రెస్; 1957. |
| చిత్రాభ్యుదయము. | నారాయణరావు, కాళ్ళకూరి |
| తెలుగు నాటక వికాసము. | అప్పారావు పి.యస్.ఆర్. యు.జి.సి అండ్ ఆంధ్ర గవర్నమెంటు ప్రచురణ |
| విషాద సారంగధర నాటకము. | కృష్ణమాచార్యులు, ధర్మపరం. బళ్ళారి: డి.కె.కె. ఆచార్యులు బ్రదర్స్; 1926. |
| సారంగధర చరిత్ర. | వెంకటకవి, చేమకూరి; పిచ్చయ్యశాస్త్రి దేపాల(పరిష్కర్త) హైదరాబాదు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి; 1967. |

# గోరోజనం చిలక!

రంధి సోమరాజు

అవును నాకు తెలుసు. చిలకతల్లి వీధిలోకి వెళ్ళాలంటే చాలు ఎంతగానో ముస్తాబౌతుంది. ఆడాళ్ళంటే చాలు వీధిలోని వాళ్ళంతా ఆత్రంగా చూస్తారుగా... ఈ వేళప్పుడు జిడ్డు మొగమేసుకొని వీధిలో ఎలా తిరుగుతుంది? మొగాన్ని మార్చాలి. చీర మార్చాలి. నప్పని బ్లౌజు ఒలిచి నప్పేది ధరించాలి. తగ్గా జోడు కాలికి చెవికి తొడగాలి. బంగారమూ, వజ్రాల నగలతో వాళ్ళు మెర్సిపోవాలి. సూదిముక్కుతో సౌందర్యాన్ని పీల్చి హమ్మయ్య అనుకోవాలి.

చిలకతల్లి సింగారించుకొని ఎదురింటి కూనలమ్మతో చీరలు కొనేందుకు చకచకా బయలుదేరింది.

ఈ కొట్టు కాదు ఆ కొట్టు కాదు అనుకుంటూ కాళ్ళు పీకేదాక తిరిగి తిరిగి ఓ కొట్టులో పంకాగాలి క్రింద ఇద్దరూ చతికిలబడ్డారు. హ్యాండ్ కర్చిఫ్‌తో మొగమూ కంఠమూ అద్దుకుంటూ ఆ సుఖానికి కొట్టు స్వంతమైనట్లు చుట్టూ చూసి హమ్మయ్య అనుకున్నారు.

కొనేది చిలకతల్లి కాబట్టి, 'ఇంతకన్నా మంచివి లేవూ...మంచివి లేవూ...' అంటూ విసుగెత్తి పోతూన్న సేల్సుబాయ్‌ని గమనిస్తూనే గమనించనట్టు సోగ్గా నవ్వుతూ అతని విసుగును తుడిచేస్తున్నట్టు తమాషాగా చూసింది.

అలా ఆ యువకుణ్ణి ఆహ్లాద పరుస్తూనే 'మరోటి చూపండి...మరోటి" అంటూ 'ఇంతకన్న ఖరీదైనవి లేవూ...లేవూ..." అంటూనే వుంది చిలక.

కూనలమ్మ, 'య్యింక రండి. ఇక్కడ మనకు నచ్చేవి ఉండవ్..." అంది. విసుగు ఆమెనో మొట్టికాయ మొట్టి వుంటుంది.

'ఉండండక్కయ్యగారూ...చాలా మంచివి ఖరీదైనవి ఈ షాపులో వుంటాయి..." అంది చిలక తల్లి.

చిలకతల్లి అసలు పేరు రామచిలక. రామ ఎగిరిపోయి చిలక మిగిలి పోగా తండ్రి; మా చిలకతల్లి ఏదీ...ఏదీ...' అని నిత్యం, క్షణ క్షణం ఆ పిల్లను వెదుక్కోవడంతో అది చూసిన పిల్లలంతా 'చిలకతల్లి...చిలకతల్లి..." అని



గొల్లున గోల చేస్తూ అరిచేవారు. పిలిచేవారు. 'వీధి పిల్లలు పెట్టిన పేరు...ఇదే బాగుంది ఇదే బాగుంది అనుకున్నారు ఆ తల్లీ తండ్రీ. అంచాత చిలకతల్లి పేరు మంచిదే...అలాగని ఏదైనా ఓ చిలకకు ఈమెగారే తల్లి అనిగాని ఈమె ఉత్తి ముసలి చిలక అని కాని అనుకోకండి. చిలక తల్లి ఎప్పుడూ బంగారు చిలకే. ఆమెకు ముసలితనం రాదు.

విసుగెత్తిపోయిన ఆ కొట్టు కుర్రాడు, 'ఉండండి...నిన్ననే వచ్చాయి ఇంకా పార్శిలు విప్పలేదు. వస్తానంటూ..." లోనికి వెళ్ళిపోయాడు. చిలకవైపు చూస్తూ ఆ పౌంకం మా గొప్పగా ఉంది..." అనుకుంటూ.

"లోనికి మేమూ రావొచ్చా..." అంది చిలక. అతను విననట్లే వెళ్ళి పోయాడు. ఓ అరగంటలో సందెడు చీరలతో వచ్చాడు. షిఫాన్లు, జార్జెట్లు, టెర్లిన్లు, టెరీకాట్‌లు కళ్ళు జిగేల్‌మనిపోయేవి తెచ్చాడు. ఖరీదులు మా గొప్పగా వున్నాయి. గొప్ప చిలకతల్లికి గొప్ప చీరలు!

"ఇంత ఆలస్యంగా వచ్చావేమిటి? అయినింటి ఆడపడుచుల్ని య్యింతసేపు కూర్చోబెట్టొచ్చా? అంటూనే జవాబు కెదురు చూడకుండ, ఇవి బాగున్నాయి కదండీ...ఖరీదు కొంచెం ఎక్కువేమోనండి..." అంది కూనలమ్మతో...'ఈ చీర చూడండి.'.అనగానే—కూనలమ్మ 'చాల బాగుందండీ...మీ చాయకు ఈడుజోడుగా—వుంది—' కూనలమ్మ తమాషాగా నవ్వింది.

మరి తప్పదు కదా—చిలక కొనేసింది. ఈలోగా కూల్‌డ్రింకులు దయ చేశాయి.

'గొప్ప ఖరీదు—గొప్ప చీర—తను గొప్పమనిషి. అదే తను గొప్ప చిలక! అన్నీ గొప్ప గొప్ప—కాని యింటికి వచ్చాక, 'పప్పులో కాలేశావ్ చిలకా—' అంది. పక్కింటి మనోహరి. ఉన్నమాటే అంది.

'ఈ సేల్సు కుర్రాళ్ళు తక్కువ ధరల చీరలకి ఎక్కువ ధరల చీటీలు తగిలించి విసుగెత్తిపోయి ఉన్నవారి మొహాన కొడ్తారు. అదే వాళ్ళ టెక్నిక్.' అంది. చిలకను మిన్నులు పడ్డచోటికి విసిరేసింది.

'ఘోరం—ఘోరం' అనుకుంది చిలక. పాపం కూనలమ్మను తిట్టుకుంది. మళ్ళీ ఆ షాపువాడి దగ్గరకు వెళ్ళి దీన్ని నువ్వే కట్టుకో' అని విసరలేక పోయింది. నామర్దా!

అప్పుడు మరీ చిన్నది. కాని ఇప్పుడు బాగ ఎదిగింది. ఎలాంటెలాంటి వారినైన బోల్తా కొట్టించగలదు. మంత్రులు కాగానే అఖండమైన తెలివితేటలు తన్నుకొచ్చేసినట్లు, డబ్బూ, దర్జా విరగబడిపోతె యిట్టే అన్నీ అవగాహనై పోతాయి. ఇది చిలక థీరీ.

ఒడుదుడుకులు లేకుండ ఆమె భర్త ఆకాశం అంచులుకి అంచెలం చెలుగా ఎదిగి పోయాడు. ఓ పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలో పెద్ద ఆఫీసరై పోయాడు. నెలకు ఐదు వేల రూపాయలు. కారు, ఇల్లు, వి.సి.ఆర్ టి.వి. ఫ్రిజ్ సరేసరి. ఎ.సి గదులు మనోహరమైన పడక మంచాలు, ఫోమ్ బెడ్‌లు— గొప్ప సంచలనం సృష్టించే అధునాతన చిత్రాలతో ఆ యిల్లు ఆర్ట్‌పీస్‌లా వుంది. మనోహరమైన గార్డెనూ కాలు వెయ్యబుద్ధి పుట్టని పచ్చనిలానూ, ఆహ్లాదం అమృతం తాగినట్లుంది. ఇద్దరే ఇద్దరు పిల్లలు. అబ్బాయి. అమ్మాయి, ఆరు— ఏడేళ్ళు. అందం చిగురేసినట్లుంటారు.

చిలకతల్లిలో ఎగోయిజం రోజురోజుకూ జాస్తీ అయిపోతుంది. తన ముందు అందర్నీ తక్కువ చేసేస్తే తప్ప ఆమెకు ఊపిరాడదు. అప్పుడే ఆమెకు సుఖప్రాప్తి! నిజానికి సంసార సుఖమొక్కటే మనుషులకు ప్రశాంతత నివ్వదు. అంతకన్న స్వర్గం చాలవాటిల్లో ఉంది. వాటిని స్వంతం చేసుకొని, సుఖాన్ని సుఖంలో తేల్చి సుఖంగా, సుఖం కోసం సుఖమై పోవాలి! ఎంచక్కని ఆశ! ఇదే—ఇదే—ఆమె జీవితేచ్ఛ! వెంపర్లాటు!

"అమ్మా—మా అమ్మాయి — పెద్దమడ్సయిందండి—ఏటో నాకేటి తోసడం నేదు. సేతిలో సిల్లిగవ్వనేదు' అంటూ నిలిచింది దాసీ అప్పలకొండ.

'అలాగటే—శుభకార్యం గొప్పగా జరిపించు. ఇంద...' అంటూ మెరిసే రోజ్‌వుడ్ బీరువా తీసి వేయి రూపాయలు, తళ తళ మెరిసిపోయే సరికొత్త వంద రూపాయల నోట్లు పది అప్పలకొండ చేతిలో పెట్టింది. అప్పలకొండకు కళ్ళు బైర్లు కమ్మాయి. ఇంత ఆనందాన్ని సామాన్యులు భరించడం కష్టం కదా...!

'మాతల్లె—మాతల్లె—మా సిలకమ్మగోరు గొప్ప మడ్సి—తమరినాటో లుంటే నోకంలో కట్టాలే ఉండేవి కావు, రెండువందలు సాలుతల్లీ అంత డబ్బు నానేటి సేసుకోను. మా తాగుబోతోడు యిల్లు కల్లం సేసేత్తాడు. ఆడితో పడ లేను. న్ను రక్షింగు తల్లీ—' అంది.

చిలక కుతకుత వుడికి పోయింది. ఒక దాసీది తనలోని దాతృత్వపు లక్షణాన్ని యింతగా కాలరాచి వేయడం తను సహించలేదు. 'అల్పులను అందలం ఎక్కించగూడదు. ఛీ—నీ ముఖం చూపించకు—ఫో—యిక్కడ నుంచి. ఇంకెప్పుడూ యిటు రాకు' అంది చిలక. ఆవేశంతో పెదవి చలిస్తూ వుండగా ఎరుపెక్కిన కళ్ళతో మరో గదిలోకి వెళ్ళిపోయింది.

అసలు అప్పలకొండ ఆ రెండొందలూ అప్పుగా ఆడగాలనుకొంది. ఈ మాట ఆమె నోటజారి ఉన్నట్లయితే, అక్కడి కక్కడే చిలకతల్లి, అప్పలకొండ ప్రాణాలు తోడేసి వుండేది.

"ఆదరాన్ని చవిచూడలేని అలగాజనం!" చిలక గుండెలనిండా ఇదే మాట రెండు రోజులు త్రాచుపాములా బుసలు కొట్టింది. వారం రోజుల వరకు ఆమె తేరుకోలేదు.

ఓసారి రీడర్స్ డైజెస్ట్‌కు చందాకట్టి ఓ స్నేహితురాలికి 'ఈ సంవత్సర మంతా నీకు ఫ్రీగా వస్తుంది. స్వీకరించు' అంటూ ఆమె రాసిన ఉత్తరానికి జవాబుగా ఆ స్నేహితురాలు, "నేను ఆ మేగజైను ఫేన్‌ను. నీ తీయని మనసుకు నా చిరునవ్వులు." అంది.

"రాలుగాయి..." అనుకుంది చిలక!

ఆ పిల్ల చిరునవ్వులు చిలకకు ముళ్ళపొదలు!

పాపం!

కో ఆప్ టెక్స్ ఎ.సి. షోరూమ్‌లోంచి వస్తూ భర్త డబ్బు చెల్లించేందుకు క్యూ వున్న కౌంటర్ ముందు ఆగవలసి వచ్చింది. అక్కడే షో పీస్‌లా నేల చూపులు చూస్తూ నిలిచి ఉండలేక తమ ఎ.సి కారువద్ద డీక్కీకి చిత్రంలా ఆను కొని బట్టల పేకెట్లతో వచ్చే భర్త ఆగమనం కోసం కౌంటెసీలా నిలిచి ఎదురు చూస్తూ వుంది.

అప్పుడే ప్రముఖ రచయితగారి భార్య గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారి అంతటి సౌజన్యంతో నిండైన కుంకుమరేఖతో సాదాచీర, సాదాజాకెట్లు, ఉత్త గాజు గాజులు, హవాయి చెప్పలు, ఆమె పేరూ దుర్గాబాయమ్మే అటు వస్తూంది.

చిలకకు ఆమె తెలుసు. కదలీ కదలని కదలికతో చేతులెత్తకుండానే, 'నమస్కారం పిన్నిగారూ ... చాన్నాళ్ళకు...' అంది. తనకూ మర్యాద తెలుసన్నట్టు!

దుర్గాబాయమ్మగారిని మునుపు చిలక అక్కయ్యగారూ అనేది. ఇప్పు డావిడ మొగంలో ముసలితనం ఏదో కనిపించి ఉంటుంది. అంచాత పిన్నిగారూ- అంది. అక్కయ్యను పిన్నిగా మార్చగల శక్తి చిలకకు ఉంది. ఆమె మనసు అంతటిది.

పెరుగుతున్న వయసుతో మనసు పెరగక పోవడం అంటే ఇదే...

"ఓ... చిలకతల్లీ...బాగున్నావా" అంది దుర్గాబాయమ్మ. ఆ తల్లీ పదం చెవిని పడగానె చిలక తల్లడిల్లిపోయింది. ఆ పదం అంటే ఆమెకు చికాకం.

'ఏటోనండి. ఏం బాగు. మీ అల్లుడుగారు నెలకు అయిదువేలు తెస్తు న్నారా—ఏమిటో ఎందుకూ చాలటం లేదు. వేలకి వేలు గుడ్డలకీ, చెప్పులకీ గుటకాయస్వాహా అయిపోతున్నాయి' అంది. 'అంత నచ్చు చెప్పులు తొడిగావేం

ముసలీ—" అనుకుంది మనసులో. నిండుగా ఉల్లాసమయింది.

దుర్గాబాయమ్మగారు చిలకను పైకి కిందికి చూసింది. తాపీగా ఆ కారునూ చూసింది. సంచులు మోసుకొస్తున్న ఆమె భర్తనూ చూసింది. మెల్లగా 'అవును తల్లీ—ఎంత వచ్చినా అలాగే వుంది మాకూ—ఆరువేలు పైగానే వస్తున్నాయి. నెలకేలే—ఈ మాత్రం దానికే అంత గర్వమెందుకో—చిన్న సంచి కూడ ఆయన ముట్టడు. కూరగాయలు తేవడం ఎప్పుడో మరచిపోయారు. ఇహ డబ్బు సంగతి. ఎంత వచ్చినా ఏ సొత్తు జో సొత్తే. అజా పజా ఉండడం లేదు అంది.

'ఏమిటీ ఆరువేలా? ఇప్పుడేం చేస్తున్నారు మీ వారు?' చిలక తలకిందులై పోయింది. ఆమె చెవులు వినగూడని మాటలు విన్నాయి. డిక్కీకి చేరిన దర్జా కదలిపోయింది. బీటలు వారింది.

'అబ్బే—ఏమీ లేదు. ఎప్పటిలాగే ఆయనకు రెండువేలే. మా అబ్బాయికి కోడలకు మూడు వేలొస్తున్నాయి. మా చిన్నాడికి ఈ మధ్యే వెయ్యి దాటిస్తున్నారు.' అంది. దుర్గాబాయమ్మ.

చిలకతల్లి కనుగుడ్లు పేలిపోయాయి. అప్పుడే ఎందుకో డెబ్బైవేల రూపాయల వజ్రాల గాజులేపు చూసుకుంది. మీ మొహం మెట్టుకుని ఎన్నేళ్ళకైన కొనగలరా అనాలనుకుంది. గట్టిగా అరవాలనీ అనుకుంది. కాని ఆ డబ్బు సరియైన డబ్బు కాదే—దుర్గాబాయమ్మ తిన్నదైంది కాదు. మళ్ళీ మరోటి. అంటిస్తుంది. పూర్వం రాణీలను చూచిన వారు లేరు. వాళ్ళను కొట్టి వీళ్ళను కొట్టి వారి రాజా భర్తలు వారి కాళ్ళముందు వజ్ర వైఢూర్యాలు రాసులు పోసేవారు. వాళ్ళకే శిక్షలూ లేవు. ప్రతి కవికీ, డ్యాన్సాడే పిల్లకి లక్షలు లక్షలు కుమ్మరించేవారు. వాళ్ళను గొప్ప ధర్మాత్ములని ప్రజలు మరీ మరీ పొగిడేవారు.

ఇవాళ ఆ రాణీలను మించిన జీవితాన్నే అనుభవిస్తున్నా పైకి అలా కనిపించగూడదు. ఎక్సైజువాళ్ళు, ఇన్‌కమ్‌టాక్సు వాళ్ళు పీడకలల్లా ఎదురౌతారు. ఛీ—వెధవ బతుకు—వెధవ దేశం—

చిలక చికాకు పడిపోయింది. ఆమె మనసు పూర్తిగా కుళ్ళిపోయింది. మగడు ఏ కమీషనరాఫ్ పోలీసో అయితే దుర్గాబాయమ్మను చితగ్గొట్టించేసేది. అప్పటికి కాని ఆమె కసి తీరేది కాదు. అసలు ఈ పని చేయడానికి మగడు ఓ పోలీసైనా చాలు కదా!

దుర్గాబాయమ్మగారివైపు చూసి, పొరపాటునో పాత అలవాటుచొప్పునో, 'అక్కయ్యగారూ త్వరగా కొనుక్కొచ్చెయ్యండి. మా ఇల్లు చూద్దురుగాని. రావుగారు మిమ్మల్ని ఇంటి దగ్గర దింపుతారు' అంది.

దుర్గాబాయమ్మ, 'నాకు కొంచెం పని వుంది' అంది.

'అది కాదు—మళ్ళీ ఎప్పుడు కలుస్తామో—ఏమో—నా రిక్వెస్ట్ తోసెయ్యకండి. ప్లీజ్—' అంది.

దుర్గాబాయమ్మ బెట్టు చేసే రకం కాదు. సరే అంటూ కొట్లోకి వెళ్ళి పేకెట్‌తో తిరిగి వచ్చింది.

కారు క్షణాలమీద యింటికి చేరింది. ముందుసీట్లో భర్త పక్క కూర్చున్న చిలక, దారిలో పిన్నిగారూ—ఈ కాసిన్ని పేకెట్లూ తెచ్చుకోలేమా—అని కుర్రాణ్ణి తీసుకరాలేదు. వైపెచ్చు వెనకాల కూచొని మా కబుర్లు వాడు వినడం నాకు కిట్టదు' అంది.

దుర్గాబాయమ్మ ఆ పేకెట్ల ప్రక్క ఆ కుర్రాడు కూర్చున్న స్థానంలోనే కూర్చుంది. ఈ చిలకతో రావడం నాదే బుద్ధి తక్కువ' అనుకుంది.

అప్పటికే వారి యింటిముందు గేటు తెరచుకొని లోపల ఇన్‌కమ్‌టాక్సు ఇనస్పెక్టర్లు, ఐ.టి.ఓలు హడావిడిగా రావు కోసం ఎదురు చూస్తున్నట్లు కూర్చున్నారు. రావు గుండెలాగి పోయాయి.

'సారీ రావుగారూ—ఒక్కసారి మీరు యింట్లోకి రావాలి. ఇదిగో ఇదిగో సెర్చ్ వారెంట్.' అన్నాడు

చిలక 'ఎవరు వీళ్ళంతా—' అంది. గుండెల్లో ఏవో ప్రేలుళ్ళు. 'యములాళ్ళు—' అన్నాడు భర్త మెల్లగా.

'నేనీ రిక్షాలో వెళ్ళిపోతాను.' రిక్షాను పిలిచింది దుర్గాబాయమ్మ. ఈ పరిస్థితిలో, నేను వుండడం అంత మంచిది కాదు' అంది.

'ఈ గాజులు ప్రస్తుతానికి మీ యింట్లో వుంచండి. మమ్మల్ని కాపాడండి. పాపం చిలక ప్రాధేయపడింది.

'రేపు ఈ బాధ నాకైనా తప్పదుగా—నీ చెంగున ముడేసీసి బొడ్డులో దోపెయ్ ' అంటూ వెళ్ళిపోయింది దుర్గాబాయమ్మ.

గదిలో ఆఫీసరు, 'ఎప్పుడు కొన్నారు ఈ గాజులు?' అన్నాడు.

చిలక నిబ్బరంగా, తెలివిగా 'కొనడమేమిటండి. నాకు చాలమంది ఫ్రెండ్స్ ఉన్నారు. వాళ్ళకు నేనంటే ఎంతో యిష్టం. వాళ్ళలో ఒకరు నిన్ననే వీటిని ప్రెజెంట్ చేశారు అంది.

కష్టాల్లోంచి తప్పించుకోడానికి నైతికమయిన విలువలు డబ్బునోళ్ళకెప్పుడూ అడ్డు రావు!

ఆమె భర్త చాల తెలివైనవాడు కదా—చిన్న కాగితం ముక్క కూడ అదే—రహస్యాలు బయటపెట్టేవి—వాటి ఆచూకీ దొరకనివ్వలేదు. ఆఫీసర్లు అంతా గాలించి మొగమొగాలు చూసుకున్నారు.

విసుగ్గా సారీ చెప్తూ వెళ్ళిపోయారు.

"మిమ్మల్ని నేనే రక్షించాను. చూశారా—అలా ఫ్రెండ్స్ వాటిని యిచ్చారని అనక తప్పలేదు. క్షమించండీ—అన్నట్టు గోరోజనం చిలక గాజుల భర్తవైపు చూసింది. కాని అప్పుడామె మనసులో మొగమూ, ఆ మొగంలో మనసూ లేవు! 'దుర్గాబాయమ్మను మాత్రం చావుదెబ్బలు కొట్టాలి ఉం—' అనుకుంది. □

డా॥ కొండూరు వీరరాఘవాచార్య

# ఋక్కులలో ప్రాణాయామ ప్రక్రియ

వేదమంత్రములకు అధి భౌతికము, అధి దైవికము, అధ్యాత్మికము-అయిన మూడర్థములు చెప్పవలయునని భాష్యకారుల సిద్ధాంతము. ఆ దృష్టితో మంత్రములను పరిశీలించినపుడు, మనకు ఎన్నెన్నో రహస్యములు మంత్రములకు గలవని తోచును. ఋగ్వేద మంత్రములు పెక్కులు పంచభూతముల ప్రాశస్త్యమును వర్ణించుచు వాటివలన మానవులు పొందవలసిన అధి భౌతికాద్యున్నతులను ప్రశంసించుచున్నవి: దిగువ మంత్రమును చూడుడు—

"త న్నో వాతో మయోభు వాతు భేషజం,
త న్మాతా పృథివీ, త త్పితా ద్యౌః..."

—ఋ 1-89-4

"వాయువు మాకు ఔషధమై సుఖము నిచ్చుచు వీచుగాక! అట్లే తల్లియైన భూదేవియు ఔషధమై సుఖకరమగుగాక. తండ్రివంటిదైన ఆకాశముకూడ 'ఔషధమువలె మాకు సుఖమును కూర్చుగాక" అని పైమంత్ర వాక్యముల భావము. ఇందు ప్రకృతిలోని భూతములైన భూమ్యాకాశములు, వాయువు ఔషధమువలె సుఖకరములు అగుగాక అని ప్రార్థింపబడినది.

దీర్ఘముగా ఆలోచించినచో, భూమ్యాకాశములను, గాలిని మానవులు ఎట్లు ఉపయోగించుకోవలెనో ఈ మంత్రమున సూచింపబడినది. వాటిని ఔషధమువలె ఉపయోగించుకొన్నచో అవి రోగములను హరించి మానవుని ఆరోగ్యవంతుని, బలవంతుని చేయునని సూచితమగుచున్నది. ప్రస్తుతము వాయువునుగూర్చి మాత్రమే మనము విచారించి చూతము.

పరిశుద్ధమైన గాలి శరీరమునకు అత్యవసరమని మానవులు తొలినుండి యెరింగియే యున్నారు. నిర్మలమైన గాలిని పీల్చుటవలన ప్రాణులు ఆరోగ్యవంతులగుదురనియు, మురికిగాలిని పీల్చుటవలన రోగగ్రస్తులగుదురనియు సామాన్యులుకూడ ఎరిగియె యున్నారు. దీనినిబట్టి వాతావరణ కాలుష్యము పనికిరాదని తొలినుండియు మనమెరింగియేయున్నామన్నమాట! అయితే పైమంత్రమునకు "పరిశుద్ధమైనగాలి మాకు సుఖమునిచ్చుగాక అనెడి స్థూలమైన అది భౌతికార్థమునేకాక, ఆధ్యాత్మికార్థమునుకూడ భావింపవలసియున్నది. వాయువు వెలుపల సంచరించుటయేకాక? సర్వప్రాణుల శరీరములందును ప్రాణాపాన వ్యానోదాన సమానములనెడి అయిదు విధములుగా సంచరించుచున్నది. ఈ అయిదింటిలోను గుండెలో సంచరించెడి ప్రాణవాయువు ముఖ్యమైనది. శరీరమున ఇట్టి ప్రాణవాయువు ఉన్ననేకాని, మానవుడు జీవించుచున్నట్లు కాదు. ప్రాణములు పోయినచో వాటితోపాటు జీవుడుకూడ లేచిపోవుటచే శరీరమునకు మరణము సంభవించును.

"త న్నో వాతో మయోభు వాతు భేషజం"

అనెడి మంత్రవాక్యము శరీరములోని ప్రాణవాయువునుగూడ భేషజము (ఔషధము) గా చేసికొమ్మని సూచించుచున్నది. అనగా ప్రాణవాయువును యోగాభ్యాసము చేత, దివ్యౌషధముగా చేసికొని దీర్ఘకాలము జీవింపుమని మంత్రకారుని భావమన్నమాట. అయితే ఈ ఆధ్యాత్మికార్థమును వాచ్యము చేయక అతి నిగూఢముగా వ్యంగ్యరీతినే మంత్రము ప్రస్తావించినది.

రేచక, పూరక, కుంభక రూపమైన ప్రాణాయామ ప్రక్రియవలన మనుజుల ఆరోగ్యము చక్కబడి రోగ నివృత్తి అగుటయేకాక, వారికి దీర్ఘాయువు కూడ సిద్ధించుటకు వీలున్నదని ఇటీవల-అనగా ఋగ్వేదానంతరము వెలువడిన ఆర్షవాఙ్మయమునకు చాటుచునే యున్నది. కనుక పై మంత్రము ప్రాణాయామ ప్రక్రియ గంభీర శైలిలో సూచించినదన్నమాట. ఈ విషయమునే దశమ మండలములోని మరికొన్ని మంత్రములు విస్తరించుచున్నవి.

"వాత ఆ వాతు భేషజం,
శం భు, మయోభు, నో హృదే,
ప్ర ణ ఆ యూంషి తారిషత్... 10-187-1

వాతః=వాయువు, నః-మాయొక్క, హృదే=హృదయమునకు, భేషజం-ఔషధమై, వాతు-వీచుగాక! ఇంకను, శంభు=రోగశమనము చేయునదై, మయోభు=సుఖహేతువై ఒప్పుగాక (ఇంకను) నః=మా యొక్క, ఆ యూంషి=ఆయుస్సులను, ప్రతారిషత్=వృద్ధిపొందించుగాక.

వాయుదేవతాకమైన ఈ సూక్తములు మూడు మంత్రములకు ఆధ్యాత్మికార్థమును విచారించినచో వీటిలో ప్రాణాయామ శబ్దమును వాడకుండగనే-దాని ప్రక్రియను సూచించినట్లు తెల్లమగుచున్నది.

ప్రథమ మండలములో "త న్నో వాతో మయోభు వాతు భేషజం" అని అనగా, ఈ మంత్రము "వాత ఆవాతు భేషజం" అనుటయేకాక, మా హృదయమునకు వాయువు భేషజమై రోగనివృత్తిని చేయుచు సుఖవంతమై ఆయుర్వృద్ధిని చేరూర్చుగాక, అన్నది. ఇట్లనుటచేత ఆయుర్వృద్ధిని చేరూర్చు శక్తి ప్రాణాయామమునకు కలదు. కావున, ఇందలి వాయు శబ్దమునకు హృదయమునగల ప్రాణమనియే అర్థము చెప్పుకొనవలసియున్నది. నిఘంటువు కూడ "హృది ప్రాణః" గుండెలోని గాలిని ప్రాణమనియె పేర్కొన్నది. మంత్రమునందలి "శంభు" పదము శుభసౌఖ్యములను సూచించుటతోపాటు, యోగాచార్యుడైన శంకరునిగూడ గంభీరముగా సూచించుచున్నది. ఇక ఈ ప్రాణాయామ ప్రక్రియచేత నిస్సందేహముగా ఆయుర్వృద్ధికాగలదని "ప్ర ణ ఆ యూంషి తారిషత్" అనెడి వాక్యము విశదీకరించుచున్నది. ఇంకను ఎవరైనను శంకింతురేమో అని 2 వ మంత్రము ఏమనుచున్నదో పరికింపుడు:—

"ఉత వాత, పితాసి నః
ఉత భ్రాతో త న స్స ఖా
స నో జీవా తవే కృ ధి" 1-187-2

ఓ వాయుదేవా! నీవు మాకు ఉత్పాదకుడవు (తండ్రివి) సోదరుడవు, కష్టసుఖములను పంచుకొనెడి మిత్రుడవుకూడ. ఇట్టి నీవు మాయొక్క దీర్ఘ జీవితమునకు తోడ్పడుము. అనగా మాకు ప్రాణాయామ సిద్ధిని కలుగజేసి దీర్ఘ కాలము జీవించునట్లు చేయుమని భావము.

ఇంకను ప్రాణశక్తి యెంత గొప్పదో 3వ మంత్రము తెలుపుచున్నది.

"య దదో వాత, తే గృహే
అమృతస్య నిధి ర్హితః
తతో నో దేహి. జీవసే" 10-187-3

# తూరుపు చిరునవ్వుల చిరంజీవి !

**జనజ్వాల**

సూర్యున్ని
మృత్యువుపై వ్రాసిన
గీతం !
రెక్కలొచ్చి, సంచరిస్తూ
రోదిస్తుంది
ఆకాశం నుంచి
రాలిన
నక్షత్రం !
శ్రద్ధాంజలి ఘటిస్తుంది
మౌనం గా —
వసంతాల సంతోషాన్ని
చూచి చూడకముందే
పూచిన పూలు,
బలవంతంగా నలగి
కన్నీటి కథల్లో వాడి
రాలిపోతే,
దిక్కుతోచక, బిక్క మొహంతో
రెక్కలు తెగి
గాలి
ఆగిపోతుంది
రెక్కలు తెగిన
గాలి, ఆగిపోతే
ఆగి పోవచ్చు
కాని,
నేస్తం!
ఇంకి పోయిన పాల నుంచి
ఎగిరి పోయిన అక్షరాల ఆవిరిని....ఈ
మనిషి ఊపిరిని ఎక్కడని
వెతుక్కోమంటావు!

మరో ప్రపంచం లోనా .... ?
కాదు
ఇక్కడే
అదిగో ....
చీకటి గుండె చీల్చి
వెలుగు కెరటం
సముద్రం మీద గానం చేస్తుంది
చిలుకల పావురాల రెక్కల పటు పటుల
సంగీతంతో—
వసంతంలేదని సంతృప్తి
కోకిల పాడలేదని దుఃఖం
ఎందుకురా నీకు ఇంకా —
ఆ మనిషి ఊపిరి వేసిన చురకలు కే
కాదారా,
పడమట 'సంధ్య' పిచ్చిదై
తల విరబూసుకొని
ఏడుస్తూంది !
అంతే కాదు ' రా '
రోజూ
తూరుపున
చిరునవ్వుల కొత్త ఊపిరి కలాల
పూలు, పూస్తున్నవి —
రోజూ
తూరుపు చిరునవ్వుల చిరంజీవే
ఆ మనిషి

ఆ "మహా ప్రస్థావన" మహా ప్రవక్త
(15 జూన్ 84 మహాకవి 'శ్రీ శ్రీ' ప్రథమ
వర్ధంతి సందర్భంగా)

హే వాత=ఓ వాయుదేవా! తే గృహే=నీ యింటిలో-అనగా నీవద్ద అమృతస్య నిధిః=అమృత నిధి అనగా, మరణ రాహిత్యమును ప్రసాదించు నిక్షేపము, హితః=స్థాపింపబడియున్నది, తతః=ఆ అమృత నిధినుండి, నః=మా యొక్క, జీవసే=జీవనార్థమై కొంత భాగమునిమ్మని భావము.

ప్రాణాయామ సేవకులమగు మేము జగత్ప్రాణుడవైన నిన్ను యోగ మార్గమున సంచరించుచున్నాము. అట్టి మాయొక్క దీర్ఘాయుస్సుకోసమై నీ వద్ద నున్న అమృత నిధినుండి కొంత మా కొసంగి మమ్ము దీర్ఘాయుస్సంపన్నులుగా చేయుమని సారాంశము.

వెలుపల సంచరించెడి వాయు మాత్రమునకు దీర్ఘాయుర్భాగ్యము నొసంగెడి శక్తి యుండదు. అది శరీరాంతర్వర్తియైన ప్రాణవాయువునకు మాత్రమే కలదు. ఆ ప్రాణమును యమించి దీర్ఘాయుస్సును పొందుమనుటయే ఇందలి రహస్యము.

ఈ మూడు మంత్రములుకూడ వాయుశబ్దముచేత ప్రాణమును సూచించుచున్నవనియు, ప్రాణాయామములో దీర్ఘాయుస్సును యోగులకొసంగెడి దివ్య శక్తి యున్నదనియు సూచితమగుచున్నదనుటలో ఎట్టి సందేహమును లేదు. ఇట్టి ఆధ్యాత్మికార్థములు అనేకములు వేద మంత్రములను భావన చేసినచో పొడకట్టగలవు. కనుక ప్రాణాయామ ప్రక్రియ ఆరోగ్య ప్రదమేగాక ఆయు ర్వృద్ధి దాయకము కూడను! □

సీరియల్

# సమిధలు

## దిలావర్

(గతసంచిక తరువాయి)

భళ్ళున తెల్లవారింది.

గానుగెద్దు బతుకులు గాడిలో తిరగటం మొదలయింది. జీవన సమస్యల వలయాలను తప్పించుకోలేని బడుగువర్గాల ఆశల ద్వారం - చౌకదుకాణం - క్యూతో నిండిపోతున్నది.

"సస్యశ్యామలాం...మాతరం...వందేమాతరం..." రేడియో గీతం జోక్‌లా వినిపిస్తున్నది ఆ సందర్భంలో.

ఆకలి, ఆవేదన, ఆరాటం నింపుకున్న కళ్ళు ఆశగా ద్వారంవేపు చూస్తున్నాయి. నిస్పృహ-అసహనం-నిట్టూర్పుల రూపంలో బయట పడుతున్నాయి.

ఆ రోజు ఎట్లా గడుస్తుందన్న ఆరాటం-రేపు ఏమవుతుందోనన్న ఆందోళన క్యూలో ఎక్కడ చూసినా కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నది. బియ్యం కోసం - కిర్సనాయిలు కోసం - పంచదార కోసం - పాలడబ్బాల కోసం - ఆసుపత్రి కోసం పుట్టడం కోసం - బతకడం కోసం - చావడం కోసం - అన్నిటికీ క్యూలే. ఎడతెగని కష్టాల్లా దుర్భరమైన బతుకు భారాల్లా - క్యూ క్యూ క్యూ!

ఆకలిముందు - అవసరాలముందు దోషుల్లా తలలు వంచుకొని నిస్సహాయంగా - నిస్పృహతో - అలసిపోయి - చిరిగిపోయిన జీవితాల క్యూ!

ఆకాశమంత ఆకలి!

భూదేవంతా క్యూ!

రేడియోలో కడుపు నిండిన గేయాలు లయబద్ధంగా రాగయుక్తంగా వినిపిస్తూనే వున్నాయి.

ఎర్రటి ఎండ మాడ్చేస్తున్నా క్యూ అంతకంతకూ పెరిగిపోతూనే వున్నది.

ఒక్క నిమిషం ఒక యుగం అనిపించే ఆ ఎండలో గంటలు గంటలు గడచిపోతూనే వున్నాయి.

చౌకదుకాణానికున్న ఆకలి ఆరాటం వేరు.

పెయ్యవాడు పెయ్య కేడుస్తుంటే - చియ్యవాడు చియ్యకేడుస్తాడట.

పట్టుమని పదిమంది సంచుల్లో బియ్యం పడ్డాయో లేదో గబాల్న చౌకదుకాణం తలుపులు మూసుకున్నాయి.

ఆకలికంటే క్రూరంగా - ఎండకంటె దారుణంగా 'నో స్టాక్' బోర్డు దర్శనమిచ్చింది.

క్యూ గుండెల్లో పిడుగులు పడ్డట్టనిపించింది. ఆందోళన రగులుకున్నది, ఆవేశం పుంజుకున్నది. ఉద్రేకం ఒక్కసారే భగ్గుమన్నది.

"అన్యాయం...అన్యాయం..." గొంతులు చీల్చుకొని వచ్చాయి కేకలు

"అక్రమం నశించాలి" గుండెల్లోంచి తన్నుకొని వచ్చింది ఆవేశం.

"దొంగనాయాలు...సరుకులు దాచేసి మొండిచెయ్యి చూపుతున్నాడ్రా!... పగలగొట్టండిరా కొట్టును..." ఆకలి- ఉద్రేకం పంజా విప్పింది.

తొక్కిసలాట ప్రారంభమైంది. వరదలా ప్రారంభమై, సముద్రంలా విరుచుకు పడుతున్నారు జనాలు.

"లాగండి యివతలికి"

"తన్నండి"

"యీడ్చండి నా కొడుకును"

కడుపుమంట ఆపుకోలేని జనాలు కేకలు పెడుతున్నారు.

తాటాకుల చప్పుళ్ళకు కుందేళ్లు బెదిరినట్టు షావుకారు ఏమాత్రం బెదరలేదు. ఈ అరుపులు ఉట్టి మేక అరుపులని ఏనాడో గ్రహించాడు షావుకారు.

'అమ్మ లఖ్మీకొడుకులు...సగం సగం కోటా ఇస్తుంటేనే యిట్ల కొవ్వెక్కి దుకాణం పగల గొట్టాలంటున్నరు...యిగ పూర్తిగ యిస్తే మమ్మల్ని బతకనిస్తరా...' అనుకున్నాడు లోలోపల.

మీ తిక్క కుదిరిస్తానుండండి అనుకుంటూ ఫోన్ రింగ్ చేశాడు షావుకారు.

ప్రజల ఓట్లతో - ప్రజల కోసం ఎన్నికయిన ప్రజాప్రతినిధి ఫోన్ అందుకున్నాడు.

"అంతవరకూ వచ్చిందా వ్యవహారం. నేన్జూసుకుంటాలే ... భయం లేదు..." అని మరోవేపు ఫోన్ కొట్టాడు ప్రజాసేవకుడు.

శాంతి భద్రతలను - చట్టాన్ని కాపాడే రక్షకభటులు యీ దౌర్జన్యాన్ని-దొమ్మిని - గురించిన సమాచారం ప్రజాప్రతినిధి ద్వారా అందుకొని ఆఘమేఘాలమీద చౌకడిపో చేరుకున్నారు.

రావడమే తరువాయి లాఠీలు వీరవిహారం చేశాయి. ప్రజల్లో అలజడి. తొక్కిసలాట మొదలయింది. అందిన చోటునల్లా లాఠీలు ముద్దుపెట్టుకుంటున్నాయి. దెబ్బల తాకిడికి తట్టుకోలేక పరుగు లంకించు కున్నారు, పరుగెత్తబోయి పడిపోతున్నారు కొందరు. పడ్డవారిమీంచి తొక్కుకుంటూ పరుగెత్తుతున్నారు మరి కొందరు. పోలీసుల బూట్ల నాడాలు అందినవారి రక్తం రుచి చూస్తున్నాయి. లాఠీల కింద చిప్లే బుర్రలు చిటపట శబ్దం చేస్తున్నాయి.

తమకు న్యాయంగా అందవలసిన 'రేషన్' యిప్పించకుండా బూట్లతో తొక్కుతూ లాఠీలతో హింసిస్తున్న పోలీసుల జులుంకు ఎదురు తిరిగారు కొందరు. వారిలో కోపం కట్టలు తెంచుకున్నది. రక్తం పొంగెత్తింది. ఆవేశంతో విరుచుకు పడ్డారు - రాళ్ళతో రప్పలతో. మీద నాట్యం చేస్తున్న లాఠీలను గుంజుకొని తాము ప్రయోగిస్తున్నారు.

జనం ఎదురుతిరగగానే పరిస్థితి చేయిదాటుతున్నదన్న విషయం గ్రహించి

ఉగ్రనరసింహ మూర్తులయ్యారు పోలీసులు.

తుపాకులు ప్రళయభీకరంగా గర్జించాయి.

సూటి తప్పని తుపాకి గుండు రిక్షా కోటయ్య గుండెల్లోంచి దూసుకుపోయింది. గుండెల్లోంచి చిమ్మిన రక్తపు మడుగులో పడి గిలగిల తన్నుకుంటూ ఆకలీ ఆరాటం ఆందోళన లేని లోకాల కెళ్ళిపోయాడు రిక్షా కోటయ్య.

పట్టపగ్గా - నడిరోడ్డుమీద చట్టబద్ధమైన హత్య!

అందుకు ఏమాత్రం విచారం లేదు చట్టరక్షకులకు. పైపెచ్చు శాంతిభద్రతలను కాపాడ్డమంటే యిదేనని వారి ప్రగాఢ విశ్వాసం. తమ విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించినందుకు కించిత్ గర్వపడ్డారు కూడా.

జనం పిట్టల్లా చెల్లాచెదరై పోయారు.

ఆబాలగోపాలం ఆ దృశ్యాన్ని కళ్ళప్పగించి నిశ్చేష్టితులై చూశారే తప్ప ఎవరూ పెదవి విప్పే సాహసం చెయ్యలేదు.

కొన్ని ఫోన్లు మాత్రం ఆదుర్దాగా మోగి తమలో తాము ఏవో గుసగుసలాడుకొని గుట్టుచప్పుడు కాకుండా నోరు మూసుకున్నాయి.

పట్టణంలోని ప్రముఖ అధికార అనధికార వాహనాలన్నీ వచ్చాయి. జరిగిందానికి విచారం వెలిబుచ్చాయి. సానుభూతి చూపాయి. మొసలికన్నీరు కార్చాయి, ఇది అన్యాయం అని ఖండించాయి, దౌర్జన్యం అని గొంతు చించుకున్నాయి. న్యాయం జరిగేట్టు చూస్తాం అని హామీ యిచ్చాయి. లోపాయికారంగా ఖాకీ గుడ్డలకూ తమకు ఎన్నెన్ని జన్మల అనుబంధమో వివరించి చెప్పి వాటి కొమ్ము కాశాయి.

పార్టీకోటి చొప్పున అర్జంటుగా సంతాపసభలు జరిపాయి. ఇది అధికార పక్షంవారు కావాలని చేయించిన·దౌర్జన్యం అని దుమ్మెత్తి పోశాయి, చూస్తుండగా సమస్య రంగులు మారి రాజకీయ సమస్యగా రూపాంతరం చెందింది.

అన్ని పక్షాలవారు తీవ్రంగా ఆలోచించారు. పరిస్థితిని కూడికలు హెచ్చవేతలు వేసి లాభదాయకంగా మార్చే విధానం కోసం అన్వేషించారు. అయిందానికీ కానిదానికీ అల్లరిచేసే స్పెషలిస్టులెవరా అని గాలించారు: వాళ్ళ గాలానికి విద్యార్థులు చేపల్లా పడనే పడ్డారు.

చిన్న చిన్న పుడకలతో రగులుకుంటున్న మంట విద్యార్థుల ప్రవేశంతో రావణాసురుని కాష్టమైంది.

అసలు సమస్య మరుగున పడిపోయింది.

రాజకీయ నాయకులు తమను కీలుబొమ్మలను చేసి ఆడిస్తున్నారన్న వాస్తవాన్ని ఆవేశం కప్పివేసింది.

తాము అన్యాయానికి, అక్రమానికి వ్యతిరేకంగా పోరాటం సాగిస్తున్నామన్న స్పృహే వారిలో ఉత్సాహాన్ని నింపుతున్నది.

ఊరేగింపులు - నినాదాలు జోరుగా సాగాయి.

న్యాయ విచారణ జరిపించవలసిందిగా అధికార్లకు వినతిపత్రాలు సమర్పించబడ్డాయి.



పిల్లకాకులకేం తెలుసు ఉండేలు దెబ్బ అనుకున్నారు అధికార్లు. విద్యార్థులను ఎగదోసిన వారిలో పోలీసుల కొమ్ము కాసేవారే ఎక్కువమంది అన్న విషయం ఒక్క అధికార్లకే తెలుసు.

మళ్ళీ లా అండ్ ఆర్డర్ గుర్తుకొచ్చింది పోలీసులకు.

తమకు వ్యతిరేకంగా ఊరేగింపులు తీయడానికి ఎవరికైనా ఎన్ని దమ్ములుండాలని పళ్ళు పటపట కొరికారు.

ఊరేగింపుమీద పడి విశృంఖలంగా లాఠీఛార్జీ చేశారు.

సింహాశోరాలను రెచ్చగొట్టినట్టయింది. త్రాచుపామును తోక తొక్కినట్టయింది. మంటలలో పెట్రోలు పోసినట్టయింది.

పరిస్థితి యింకా దిగజారిపోయింది.

కాలేజి మొత్తం కటాన కదిలింది.

"దౌర్జన్యం నశించాలి...జులుం నశించాలి...జబర్దస్తీ నశించాలి" అనుకుంటూ బ్రహ్మాండమయిన ఊరేగింపు తీశారు విద్యార్థులు.

కనబడ్డ వస్తుపల్లా పరశురామ ప్రీతి గావించారు.

దుకాణాలు, బస్సులు, పోస్టాఫీసులు, రైల్వేస్టేషను, కాలేజి - ఏదీ వారి ఆగ్రహ జ్వాలలనుండి తప్పించుకోలేకపోయింది.

ఆ దారుణ దహనకాండకు పూరంతా గజగజ వణికి పోయింది. పౌర జీవితం స్తంభించిపోయింది. ఎక్కడ చూచినా శిథిలాలే. ఎక్కడ చూచినా విషాద ఛాయలే.

కాలేజి నిరవధికంగా మూతపడ్డది.

ఆందోళన సహేతుకమైనదే కావచ్చు. కాని అనుభవం ఎంత చేదైనది! హోటళ్ళలో ధరలు పెరిగితే ఆందోళన. బస్సు చార్జీలు పెరిగితే ఆందోళన. సినిమా టిక్కెట్ల ధరలు పెరిగితే ఆందోళన. పిడుక్కూ బియ్యానికీ ఆందోళన. ఈ ఆందోళనల వల్ల ఎంత అమూల్యమైన సమయం వృథా అవుతున్నది!

ఏ ఆందోళనా లేకపోయినా క్లాసులు నడిచేది అంతంత మాత్రంగానే. విద్యార్థులు రాక కొన్ని క్లాసులు - వానపడితే కొన్ని క్లాసులు - తుమ్మితే దగ్గితే కొన్ని క్లాసులు నష్టపోతారు. ఇక పులిమీద పుట్రలా యీ ఆందోళనలు. విద్యా సంవత్సరమంతా యిట్లా గడిపి సిలబసు పూర్తికాక - చదువుకుందుకు సమయం లేక పరీక్షలప్పుడు మరో తరహా ఆందోళన...

యువతరమా! నీవు కన్ను తెరవకపోతే జరిగే నష్టాన్ని జీవితంలో పూరించుకోలేవు...అనుకుంటూ నిట్టూర్చాడు ప్రకాశం మాస్టారు.

* * *

రవి బాగా కోలుకోవడంతో ఆసుపత్రినుండి డిశ్చార్జి అయ్యాడు.

ఉల్లాసంగా రొటీన్ జీవితంలో పడ్డాడు.

కాట్‌మీద వెల్లకిలా పడుకొని పుస్తకం తెరిచాడు. నార్మన్ బెతూన్ జీవిత చరిత్ర అది. అందులోని సంఘటనలు రవిని ఆశ్చర్య చకితుణ్ని చేస్తున్నాయి.

మెడిసిన్, లా, టీచింగ్, జర్నలిజం - ప్రతి వృత్తీ వ్యాపారంగా మారుతున్న రోజుల్లో నార్మన్ బెతూన్‌లాంటి నిస్వార్థ డాక్టర్ - పేదల పాలిటి పెన్నిధి - ప్రపంచ పీడిత జనాళి ఆశాజ్యోతి - ఒకరున్నారంటే ఎవరికైనా ఆశ్చర్యం కలగక మానదు కదా!

పడుచు రక్తం-రక్తంతో అణువణువునా అభ్యుదయ భావాలు ప్రవహిస్తున్న రవికి నార్మన్ బెతూన్ సహజంగానే ఆరాధ్యదైవం అయ్యాడు. డా॥ బెతూన్ సేవాగుణం, త్యాగనిరతికి మనసులోనే జోహార్లర్పించాడు రవి.

పక్కనే వున్న మేజాబల్లకు చెరోవేపు కూర్చొని చంద్రం, రాఘవ టెక్స్టు పుస్తకాలతో కుస్తీ పడుతున్నారు. మ్యాటర్‌ను జీర్ణించుకోలేక బుర్ర కిర్రు మంటున్నా గత్యంతరం లేక పుస్తకాలు అట్లాగే చేతిలో ధరించారు.

ఉద్యోగం రావాలంటే అన్నిటికంటే ముందు డిగ్రీ ఉండాలి! డిగ్రీ రావాలంటే మెదడులో చెత్తా చెదారం అంతా నింపేయాలి. చచ్చీ చెడీ నానా అగచాట్లూ పడి డిగ్రీ కొట్టేసినా - ఉద్యోగం గ్యారంటీ లేదు. మరి ఉద్యోగం లేందానికి డిగ్రీ ఎందుకురా అనుకుంటే ఆ డిగ్రీ కూడా రాదు. రాకపోతే ఎలా - చదవాలి చదవాలి - పట్టువిడవని విక్రమార్కుళ్ళలా - ఆలోచనలను కట్టిపెట్టి మళ్ళీ పుస్తకాల్లోకి దూరిపోవడం - ఉష్ట్రపక్షుల్లా.

మిత్రుల అవస్థకు జాలిపడుతూ తన పుస్తకంలో గాఢంగా మునిగిపోయాడు రవి.

బలవంతపు బ్రాహ్మణ్యంలా వున్న ఆ చదువు యిక భరించలేకపోయాడు చంద్రం.

"ఒరేయ్ రాఘవా! ఇది విన్నావా?" అన్నాడు ఏదో విషయానికి నాంది పలుకుతూ.

రాఘవ కూడా ఎప్పుడెప్పుడు పుస్తకం నుండి విముక్తి పొందుదామా అని కాచుక్కూచున్నాడు. చంద్రం పలకరింపు అమృతపు చిలకరింపులా తోచి పుస్తకాన్ని టేబులు మీదికి గిరాటు వేశాడు. సిగరెట్టు వెలిగించి గుండెలనిండా దమ్ము లాగి "ఏంటిరా" అన్నాడు రిలీఫ్‌గా.

"ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న నక్సలైట్ నాయకుడు కాపలా వున్న కానిస్టేబుల్‌ను కాల్చి చంపి పరారయ్యాడట..." అన్నాడు చంద్రం.

"అవునవును.నేను కూడా విన్నాను ఆ వార్త."

"అందుకు డాక్టర్ల సహకారం కూడా వుందని పోలీసులు అనుమానిస్తున్నారట"

ఆ మాటలు విన్న రవి గట్టిగా నిట్టూర్చి పుస్తకం మూశాడు.

"వాళ్ళకు తమ నీడల మీద కూడా అనుమానమే లేరా" అన్నాడు రవి తానూ చర్చలో పాల్గొంటూ.

"రియల్లీ...హౌ డేర్ హి యీజ్! అల్లూరి సీతారామరాజు వీరోచిత చర్యలు వినడమేగాని మనం చూళ్ళేదు. ఇది మన కాలంలోనే జరిగిన గొప్ప సాహస కృత్యం!" ప్రశంసాపూర్వకంగా అన్నాడు చంద్రం.

హీరోవర్షిప్...రివోల్టింగ్ నేచర్...యీ ఏజ్ గ్రూప్‌కు ఎంత సహజమైనదో ఆలోచిస్తున్నాడు రవి. పుస్తకాలు తప్ప మరో ప్రపంచం ఎరగడు చంద్రం. అట్లాంటివాణ్ని కూడా యీ సంఘటన కదిలించిందంటే - ఏ మనిషీ సహజంగా మునీశ్వరుడు కాడు. తగిన శిక్షణ యిస్తే ప్రతి విద్యార్థీ ఒక భగత్ సింగ్ ఒక అల్లూరి సీతారామరాజు అయి తీరుతాడు అనిపించింది రవికి.

రవి ఆలోచనలకు అంతరాయం కలిపిస్తూ ఏదో మోటారువాహనం వచ్చిన శబ్దం వినిపించింది.

హాస్టల్ రెండో అంతస్తులో వున్న రవి గబగబా బాల్కనీలోకి వచ్చి చూశాడు.

పోలీసు వ్యాన్ హాస్టల్ ఆవరణలో ఆగి వుంది.

సాయుధులైన పోలీసులు బుల్లెట్లలా హాస్టల్లోకి దూసుకుపోయారు.

ఒక కారణం లేదు. ఒక విచారణ లేదు. మాటా మంతీ ఏదీ లేకుండానే కనబడ్డ విద్యార్థినల్లా లాఠీలతో బాదడం మొదలెట్టారు. తుపాకి మడిమలతో కొడుతున్నారు. కింద పడ్డవారిని బూటు కాళ్ళతో తన్నుతున్నారు.

హఠాత్తుగా జరుగుతున్న యీ దాడికి దిగ్భ్రాంతి చెందారు విద్యార్థులు. భయంతో కకావికలై పారిపోతున్నారు. దయనీయంగా ఆర్తనాదాలు చేస్తున్నారు. విద్యార్థులు మొత్తుకుంటున్నకొద్దీ పోలీసులు హుషారు పుంజుకుంటున్నారు. బండ బూతులు తిట్టుకుంటూ వీరవిహారం చేస్తున్నారు.

పోలీసులు నిష్కారణంగా - అమానుషంగా జరుపుతున్న ఈ దమన కాండను సహించలేకపోయాడు రవి.

గబగబా కిందికి దిగివచ్చి "ఏంటి సార్ యీ అన్యాయం" అంటూ ఎస్.ఐ ని అడిగాడు కోపంగా.

ఎస్.ఐ ఓసారి రవి వేపు చూశాడు.

మేకను పులి చూసినట్టుందా చూపు.

"అన్యాయం అంటే ఏందిబే?" అంటూ రవి మొహం మీద బలంగా గుద్దాడు ఎస్సై.

రవి మొహంమీద నెత్తురు పేరుకుంది.

"నిష్కారణంగా ఎందుకు సార్ మమ్మల్ని కొడతారు" దెబ్బ తగిలిన భాగాన్ని నిమురుకుంటూ అన్నాడు రవి.

"క్యా బోలా-సాలా...కారణం కావాల్నా?" మళ్ళీ ఓసారి గుద్దాడు ఎస్.ఐ.

రవి యిక నిగ్రహించుకో లేకపోయాడు.

"మిస్టర్ ఎస్సై! పవర్ చేతిలో వుందని మృగంలా ప్రవర్తించకు. చట్టం నీ చేతుల్లో వుందని యిష్టం వచ్చినట్టు కొడితే వూరోకోం తెలుసా" నిప్పులు కక్కుతూ అన్నాడు రవి.

"అచ్చా సాలా! నాకే రూల్సు నేర్పుతవ్ బే! ఎన్ని గుండెలా నీకు. అయితే నువ్వేనన్నమాట ఈ గ్యాంగుకు లీడర్‌వి...పకడకో అందరాలో సాలేకు..." పళ్ళు పటపట కొరుకుతూ అన్నాడు ఎస్సై.

కానిస్టేబుళ్లు రవిని వ్యాన్‌లోకి తోసివేసి తలుపు మూశారు.

"హాస్టళ్లో కూచొని గవర్నమెంటు సొమ్ము తినుకుంటూ విప్లవం గిప్లవం అంటూ బేవఖూఫ్ కూతలు కూస్తరులే బేటా? కానిస్టేబులును చంపి ఆసుపత్రి నుండి తప్పించుకున్న మీ నాయకుడ్ని చూపించకపోతే మీ చర్మాలు వొలిచి ఎండేస్తా సంఝే? ఏం చూస్తున్నరు తమాషా...ఇంకో నలుగురైదుగురు పోర గాండ్లను లోపలెయ్యండి..." ఉరిమాడు ఎస్.ఐ.

అందిన మరో నలుగురైదుగురు విద్యార్థుల్ని వ్యాన్ ఎక్కించారు పోలీసులు.

వ్యాన్ కదిలిపోయింది.

అర్థగంటసేపు హాస్టల్ అంతా భయంతో బిగుసుకుపోయింది. వ్యాన్ వెళ్ళగానే నెమ్మదిగా వూపిరి పీల్చుకున్నారు విద్యార్థులు. కాని వారి మొహాల్లో యింకా భయాల నీడలు తారాడుతూనే వున్నాయి. ఆందోళన అందరినీ కుదిపేస్తూనే వున్నది.

పోలీసులు హాస్టల్ విద్యార్థుల్ని పట్టుకు పోయారన్న వార్త వూరంతా గుప్పుమన్నది.

విద్యార్థుల తలిదండ్రులు లబోదిబోమని మొత్తుకుంటూ స్థానిక రాజకీయ నాయకుల శరణు వేడుకున్నారు.

చిద్విలాసంగా నవ్వి అభయమిచ్చారు రాజకీయ నాయకులు.

వెంటనే ఫోన్లు రింగయ్యాయి.

కాని అది ఫోన్ల శక్తికి మించిన పని అని తెలుసుకునేందుకు ఆట్టేసేపు పట్టలేదు.

నాయకుల మొహాలు వెలవెల బోయాయి.

వాళ్ళ మొహాలను చూచిన తలిదండ్రులకు దిక్కు తోచలేదు.

"ఇంటరాగేషన్ అయ్యేవరకూ ఎవరినీ విడిచిపెట్టొద్దని పైనుండి స్ట్రిక్టయిన సక్షన్స్ వున్నాయి..." పోలీసు వర్గాలనుండి వచ్చిన సమాధానం అది.

'ఇంటరాగేషన్' అనే పదం ఎంత భయంకరమైనదో దాని వెనక ఎంతటి రాక్షసత్వం-ఎంతటి క్రూరత్వం దాగివుందో అనుభవానికి మాత్రమే తెలిసేది!

తల్లిదండ్రులు పోలీసు స్టేషనుకు చేరుకునేలోపలే యింటరాగేషన్ మొదలయింది.

మనిషిని అమిత దారుణంగా హింసించేందుకు యమదూతలకు ఒకవేళ శిక్షణ కావలసి వస్తే - దాన్ని అవలీలగా నిర్వహించగల సమర్థులు మన పోలీసులు.

గోళ్ళమధ్య పిన్నులతో గుచ్చడం-కీళ్ళు కీళ్ళు విరగ్గొట్టడం — అరచేతుల మీద బూట్ల నాడాలతో రక్తం కారేట్టు తొక్కడం - గాయాలు కనిపించకుండా ఒళ్ళు హూనం చెయ్యడంలాంటి విద్యలన్నీ విద్యార్థుల మీద ప్రయోగింపబడ్డాయి.

ఒకవేళ దయతలచి వాళ్ళను వదిలిపెట్టినా ఎందుకూ పనికిరాకుండా చేయడం ఇంటరాగేషన్ ముఖ్యోద్దేశం.

'బాధపెట్టే ఏ చర్యగానీ - చిత్రహింసలు పెట్టడంగాని, రాక్షసత్వంతో వ్యవహరించడం, అనాగరికంగా బాధించడం మానవత్వపు విలువలకే కళంకం. ఏ దేశం కూడా ఇటువంటి దమనకాండ తన పౌరులపై జరగకుండా చర్య తీసుకోవాలి. ప్రభుత్వాలు తమ పరిధిలో మానవ విలువలుకాపాడాలి..." అని ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ చేసిన తీర్మానం గుర్తుకొచ్చిన రవి — జీవన్మరణ పరిస్థితిలో కూడా నవ్వకుండా వుండలేకపోయాడు. పౌరులు-మానవత్వం-విలువలు-ఎంతటి హాస్యాస్పదమైనాయి ఆ మాటలు అనుకున్నాడు.

గుండెలు బాదుకుంటూ విలపించే తల్లిదండ్రులు విలపిస్తూనే వున్నారు. చడీ చప్పుడు కాకుండా విద్యార్థుల్ని అక్కడ్నించి తరలించనే తరలించారు.

అక్కడ మరో 'కోటా' వేసి యింకో పోలీసు స్టేషన్‌కు తీసుకెళ్ళారు... అక్కడ్నించి మరోచోటికి...యింకోచోటికి తరలింపబడుతూనే వున్నారు.

కాళ్ళకు బలపం కట్టుకొని, కళ్ళలో వత్తులు వేసుకొని, పుట్టెడు దుఃఖం దిగమింగుతూ - గుండెల్లో గూడు కట్టిన గుబులుతో తిరిగీ తిరిగీ విసిగి వేసారి పోయిన తల్లిదండ్రులకు యిక తమ పిల్లలు కనిపిస్తారన్న ఆశ ఏ కోశానా మిగ ల్లేదు. తిండీ తిప్పలు మాని ఆల గోడు బాలగోడుగా ఏడుస్తూ వెర్రిగా ఎదురు తెన్నులు చూస్తున్నారు-ఆశను పూర్తిగా చంపుకోవడం యిష్టంలేక.



'ఖమ్మం అడవుల్లో పోలీసులతో జరిపిన ఎదురు కాల్పుల్లో ఐదుగురు ఉగ్రవాదులు మరణించారు. వారివద్ద మారణాయుధాలు - ఉగ్రవాద సాహిత్యం లభించినట్టు పోలీసుల వర్గాల భోగట్టా' అన్న వార్తలో మరణించిన విద్యార్థుల పేర్లు యివ్వబడ్డాయి.

ఆ వార్త తెలుసుకున్న విద్యార్థుల తలిదండ్రులు కుప్పకూలిపోయారు. పచ్చని జీవితాలను కూల్చిన ఆ వార్త - బ్రతుకుటాశలను కాటేసిన ఆ వార్త వాళ్ళకు చిమ్మచీకట్లనే మిగిల్చింది.

అశనిపాతంలాంటి ఆ వార్త వూరంతటిని కుదిపివేసింది.

శవాలను చూడటానికి వూరు వూరంతా కదిలింది.

అంతవరకు తమ కళ్ళముందే హుషారుగా - ఉల్లాసంగా కేరింతలు కొడుతూ ఆడుతూ పాడుతూ తిరిగిన పిల్లలు - ఎర్రటి రక్తపు చారికలతో విక్షతంగా పొడుచుకొచ్చిన కనుగుడ్లతో బుల్లెట్లు చీల్చిన గాయాలతో భయంకరంగా— నిర్జీవంగా మారిపోయినవారిని చూచి కంటతడిబెట్టని వారు లేరు.

ఎంతో గొప్ప ఆదర్శాలతో రూపుకట్టిన చైతన్యమూర్తుల్ని ఆ స్థితిలో చూస్తున్న రేవతి కళ్ళల్లోంచి రక్తాశ్రువులు స్రవిస్తున్నాయి...

తన ఆశలు, ఆశయాలు, ప్రేమ-తన కలయీ-తన సర్వస్వం-నిర్జీవంగా ఎర్రటి నెత్తుటి మడుగులో...

ఇంతేనా-ఒకే బాటలో-ఒకే నమ్మకంతో-ఒకే ప్రాణంగా-నడుస్తాం అని ఎన్ని బాసలు చేసుకున్నారు తాము...అవన్నీ ఎండమావులేనా? రవి యిక లేడు అన్న వాస్తవం తన జీవితంలో ఎంత శూన్యాన్ని నింపుతున్నది. ఎంత వెలుగును కబళిస్తున్నది?

"మిగిలిన యీ చిమ్మచీకట్లలో గమ్యంలేని బాటసారినై ఈ శరీరంలో యింకెవరికోసం ప్రాణాలు నిలుపుకోను రవీ!" అంటూ రెండు చేతుల్తో మొహాన్ని కప్పుకొని కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నది రేవతి.

రెండు చేతులు చల్లగా ఆమె భుజాలమీద పడ్డాయి. తలెత్తి చూసింది రేవతి. కన్నీళ్ళతో తనను ఓదార్చ చూస్తున్న ప్రకాశం మాస్టారు.

"మాస్టారూ...! మీ శిష్యుడు...మీతో నిరంతరం వాదించే శిష్యుడు... ఉద్యమమే వూపిరిగా బతికిన శిష్యుడు-నేను నమ్ముకున్న మీ ప్రియశిష్యుడు... ఇక లేడు మాస్టారు..." భోరుమంది రేవతి.

ఆమెను ఓదార్చేందుకు మాటలు కరువయ్యాయి మాస్టారుకు.

అతని మనసులో తుఫాను-హోరు-సుడిగుండాలు-

ఎన్‌కౌంటర్ల పేర్లతో ఎంతమంది విద్యార్థులు యిట్లా చట్టబద్ధంగా హత్య చేయబడుతున్నారో...! అన్నెం పున్నెం తెలియని ఎందరు అమాయకులు యీ జ్వాలల్లో శలభాల్లా మాడిపోతున్నారో...ఆలోచించేదెవరు? ఈ రక్తపాతాన్ని ఆపేదెవరు? యీ మారణహోమంలో విద్యార్థులు సమిధలుగా ఆహుతి కాకుండా ఆపేదెవరు? విద్యార్థులు బలిపశువులు కాకుండా ఆపవలసిన బాధ్యత ఎవరిది? ఈ ప్రశ్నలు సమాధానాలు లేకుండా యిట్లా మిగిలిపోవలసిందేనా? ఈ ప్రశ్నలకు సమాధానాలను ఉద్రేకంతో కాక - ఉన్మాదంతో కాక - ప్రశాంతంగా నిష్పాక్షికంగా ఆలోచించే సమయం ఎప్పుడయినా వస్తుందా?

ఆలోచించినకొద్దీ గొలుసుల్లా పుట్టుకొస్తున్న యీ ప్రశ్నలు ప్రకాశం మాస్టారి గుండెల్ని తూట్లు పొడుస్తున్నాయి.

(ఇంకా వుంది)

# రాత్రి

## శిఖామణి

ఘని భవించిన
గాఢంపు చీకటి
తపోవనములో
స్తంభించిన
స్వాప్నిక జగత్తులో
ధ్యేయంలేని
సాధనలో
చిగురు జొంపములశయ్య
అంపశయ్యయై
అనంత శయ్యయై
హృదయాంతరాళం
అగ్నిగుండంలా
భగ భగ మండుతూ
పతనం నుండి పతనానికీ
అనలం నుండ అనలానికీ
అనిలం నుండి ఝుంఝూ నిలానికీ
పయనిస్తూ
నిర్వికల్ప నిశ్చల
సమాధిలో నున్న నన్ను
జలతరంగిణీ సంగీతంలా
నీ ప్రేమ
నీ గొంతు వీడని పాట
తుఫాను నాటి కెరటంలా
నన్ను నిలువునా తడిపి
కదిపి కుదిపి పిండీ
తనువు అణువణువునా నింది
చేతన్నుణ్ణీ జీవనోన్ముఖుణ్ణీ చేసాయి
నే దర్శించిన
నీ నేత్రాలలో
మేఘానికి మేఘానికీ మధ్య
సరిహద్దు రేఖను గీస్తూ
మెరసిన శత సహస్ర
విద్యుల్లతల కాంతులు
నిన్ను కలసిన
ఆ మధురక్షణాన
నీ సుందర దరహాసమూ
అక్షరాల్లో పొదగని
నీ అమృతపు పలుకుల సోయగమూ
ఇప్పుడు నాది అనుకోడానికి
నా దగ్గరేంలేకుండా చేశాయి
అదేనేను చూసిన చివరి రాత్రి
అప్పటి నుండి నాకు
చీకటి అంటేనే తెలియదు
( అలెగ్జాండర్ పుష్కిన్ కవితకు స్వేచ్ఛానువాదం ! )

# రిఫ్రిజిరేటర్లన్నీ ఒకే పద్ధతిలో తయారుకాలేదు



## జపాన్ సాంకేతిక పరిజ్ఞానం వల్లనే ఆల్విన్‌కు ప్రత్యేకమైన ప్రత్యేకత ఏర్పడింది.

సాటిలేని నిరంతర సేవ. మేటిలేని పనితనం. నిశ్చలమైన, నిశబ్దమైన సమర్థత.

అవే కొత్త ఆల్విన్ 2000 ఎస్.ఎల్. సిరీస్ రిఫ్రిజిరేటర్లు మీ కోసం. జపాన్ వారి సాంకేతిక పరిజ్ఞానం మరియూ గ్యారంటీతో లభిస్తున్నాయి.

హిటాచీవారి లైసెన్సుతో తయారు చేయబడిన కంప్రెస్సర్ సాఫీగా, నిశబ్దంగా పనిచేస్తుంది.

అత్యుత్తమమైన రోల్‌బాండ్ ఫ్రీజర్ అతి ఎక్కువ చల్లదనాన్ని అతి తక్కువ వ్యవధిలో ఇస్తుంది.

ఆల్విన్ 10 శాతం తక్కువ విద్యుచ్ఛక్తి వినియోగిస్తుంది.

170 నుండి 250 వోల్ట్స్ విద్యుచ్ఛక్తికి తగినట్లు తయారుచేయబడినది కనుక వోల్టేజ్ స్టెబిలైజర్ ఉపయోగించ నక్కరలేదు.

స్వయంగా నీరు తోడివేసుకొనే పద్ధతి ఉన్నందువలన డీఫ్రాస్టింగ్ మరింత సులభం.

ఆల్విన్ రిఫ్రిజిరేటర్లు 85, 165. 300 లీటర్స్ సింగిల్ డోర్ మోడల్స్‌లోను, మరియు 165, 300, 380 లీటర్స్ డబుల్‌డోర్ మోడల్స్‌లోను, లభిస్తున్నాయి.

వివిధ రకాల్లో, సైజుల్లో, మీ ఎంపికకోసం.

మీకు జీవితాంతం అతి త్వరితమైన సేవ, దేశమంతటావున్న ఆల్విన్ డీలర్లద్వారా లభిస్తుంది.

అందుకోసమే..........

*అన్ని సమయాలకు ఆల్విన్*

7 సంవత్సరాలు గ్యారంటీ




# ఆల్విన్

2000 ఎస్ ఎల్ రిఫ్రిజిరేటర్లు




హిటాచి వారి నుండి లైసెన్సు పొందినది

HITACHI

ఆల్విన్ ఏరియా సేల్స్ ఆఫీసులు ఈ దిగున స్థలాలలో వున్నాయి:

అహమ్మదాబాద్, బెంగుళూరు, భోపాల్, భువనేశ్వర్, బొంబాయి, కలకత్తా, చండీఘర్, ఢిల్లీ, ఎర్నాకులం, గౌహతి, ఘజియాబాద్, హైదరాబాద్, జైపూర్, కాన్‌పూర్, మద్రాసు, పాట్నా, విజయవాడ మరియు విశాఖపట్నం.

MAA(S) ALN 13A TEL 85

# శ్మశాన కురుక్షేత్రము

(గద్యపద్యాత్మక నాటకము)

కన్నడమూలం: డా॥ కె.వి. పుట్టప్ప

తెనిగింపు : శంకరగంటి రంగాచార్యులు

పీఠిక

[ఇది ఒక ప్రతీకాత్మకమైన సృష్టి, యుద్ధపు దురంతత అన్యాయము, క్రౌర్యము, వినాశము, అవివేకము, దుర్లంఘ్య విధి, సర్వ విఫలత, సంస్కృతి చావు-దీనికి ప్రతీకలు. ఒక్కొక్క యుద్ధముకూడ ప్రారంభమగునపుడు అది యుద్ధమునే తుదముట్టించు జగత్తుయొక్క చిట్టచివరి అనివార్య సంకటమని చాటుదుము. అన్యాయమంతయు తొలగిపోయి న్యాయస్థాపన మగునని భావింతుము. కలిపోయి కృతయుగము ప్రారంభమగునని. కానీ ? మరల ! విశేషతకై సామాన్యుల ఆహుతి. సంస్కృతి, నాగరకత, ప్రగతి-అన్నియు శ్మశాన రుద్రుని తనువునకు భస్మలేపనమగును. సరి, పునస్సృష్టి యొక్క ప్రారంభము, నాటకారంభము : విశ్వలీల సాగిపోవును.]

పాత్రలు

| | | |
|---|---|---|
| కృష్ణుడు | గీర్వాణుడు | |
| రుద్రుడు | నీలాక్షుడు | కౌరవేంద్రుని సేవకులు |
| ధర్మరాజు | చాణూరుడు | |
| భీముడు | ముసలిది | |
| అర్జునుడు | కలి | |



| | |
|---|---|
| సహదేవుడు | ద్వాపరుడు |
| కుంతి | పిశాచములు |
| ద్రౌపది | బంధువులు, పరివారజనము, సైనికులు, |
| శల్లి | సఖీజనులు |
| పిల్లవాడు | ఇత్యాది జనులు |
| కౌరవుడు (దుర్యోధనుడు) | |
| ధృతరాష్ట్రుడు | |
| విదురుడు | |
| సంజయుడు | |
| అశ్వత్థామ | |
| గాంధారి | |
| భానుమతి | |

## శ్మశాన కురుక్షేత్రము

### దృశ్యము-1

(పదునెనిమిది దినములు రణకోలాహలముతో నిండి నిబిడీకృతమైన మహాభారత సంగ్రామము సంపూర్ణముగా రుదముట్టిన ఒనపు ఘోర విషణ్ణరాత్రి. అదివరకును రణరంగమై ఉండిన కురుక్షేత్రము నాడు భీషణ శ్మశానమైనది. సువిశాలమైన ఆ రణరంగములో కారుచీకట్లు క్రమ్ముకొన్నవి. కోటానుకోట్ల యోధుల శవములును, అసంఖ్యాకములైన గజతురగరథాదులును పప్పులు కుప్పలై, ముద్దలు ముద్దలై అస్తవ్యస్తముగా ఆ విశాలమైన రణరంగమునిండ పడియున్నవి. మృతిచెందుచున్న వారును, క్షతగాత్రులును మూలుగుచున్నారు.



విభావరీ గర్భమునుండి వెడలిన ఆ రోదన ధ్వని కురుక్షేత్రము నంతయు ఆవరించినది. అయినను ఆ రోదన ధ్వనిని తిన్నివేస్తున్నట్లు ఏదియో ఒక మృత్యుమౌనము ఆ రుద్రప్రదేశమున నడయాడుచున్నది. గడ్డకట్టినట్లున్న ఆ చీకటిలో, ఆ విస్తారమైన కురుక్షేత్రములో, వేనవేలు అస్పష్టాకృతులును, అరముసుగు వేసుకొని చలించుచున్న మనుష్యవ్యక్తులును, చేత దివ్వెలు పెట్టుకొని ఏమిటో వెదకుచున్నట్లు అచ్చటచ్చట చరించుచున్నవి. వారందరును భారతయుద్ధమున మడిసినవారి బంధువులు; తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కసెల్లెండ్రు, భార్యలు. బిడ్డలు ముసలివారు. కౌరవపాండవ పక్షములవారు ఆనాడు శ్మశానమున భేదములేక తమతమ బంధువుల, ఇష్టుల దేహములను వెదకుచున్నారు. ఎట కనుగొన్నను దుఃఖమయమైన రౌద్రదృశ్యము. ఆరోజుసాయంకాలము భీమదుర్యోధనుల గదాయుద్ధము ముగిసినది! కౌరవేంద్రుడు తొడలు విరిగి, తలపగిలి ద్వైపాయన సరోవరతీరములో మూలుగుచు ఇంకను బ్రతికియే ఉన్నాడు. అదే రాత్రి ద్వాపరయుగము పూర్తియై కలియుగము ప్రారంభమగును. ఆ నాటికి ద్వాపరయుగపు సర్వోత్కృష్ట సంస్కృతియంతయు నాశమై శ్మశాన కురుక్షేత్రముగా పరిణమించినది. ఆ రంగ మధ్యమున ధీరుడైనను దుఃఖముఖముద్రతో క్రుంగిపోయిన యుగపురుషుడు ద్వాపరుడు చింతాక్రాంతుడై అడుగులో అడుగువేసికొనుచు ప్రవేశించును. ఎత్తైన మనిషి: వీరవ్యక్తి, రాజవైభవ చిహ్నములన్నియు అతనిలో కనబడుచున్నవి. తలమీద ఒక కిరీటమున్నది. ఒరలో చేర్చిన కత్తియొకటి నడుమున వ్రేలాడుచున్నది. అతనిని చూసినంతనే ఏదో ఒక గౌరవభావము కలుగును. ముఖచిహ్నములు విషణ్ణముగా నున్నను అది అల్పాత్ముని అధీరతా ఖిన్నత కాదు; అవిశ్రాంత పరాక్రమ సంపన్నుడైన మహాపురుషుని పరాభవ నిర్భరతయొక్క నమ్రధైర్యభావము. యుగపురుషుడగు ద్వాపరుడు ప్రవేశించి, వేడివేడిగా నిట్టూర్చును; చుట్టును చూచును; కన్నీరు కార్చును. కడపటిసారిగా నిట్టూర్చి, తనకుతానే చెప్పుకొనును.)

ద్వాపరుడు : ఇదేమిదీ భారత కురుక్షేత్ర మీ దినము
మూగవోయిన వల్లకాటి వలె ఉన్నయది?
నిచ్చలును నేను వినుచున్న రణకాహళుల
దశదిశల పొడుచు చప్పుడు లేదు. సరభసపు
వీరాట్టహాసముల కాకువుల భీషణ
ధ్వనిలేదు. కనలి పోరెడు భటుల ఖడ్గముల
సంఘట్టనారవములేదు. అతిరథవరుల
కలకల నినాదములతో కూడి పరతెంచు
చాపపాణుల ఘోరశింజినీ టంకార
నిర్ఘోషమెచట చనె నేడు? నిప్పులు గ్రక్కు
మంత్రాస్త్రశస్త్రముల రూక్షదీధితి ఏడ?
మొగిలు తెరలను చీల్చి, ఎడతెగక నింగిలో
ఎగురు చుండెడి బాణముల సోనవానలెవి?
గదవీచు గాలిలో అరులన్న పండుటా
కుల గుంపులను త్రిప్పు పవనజుని వాణి ఎది?
నిజవాహినీ వీరవరుల పోరాడగా
పురికొల్పు ఆ సర్పకేతనుని హరికంఠ
గర్జనమ్మెచ్చోట అణగినది? గాండీవ
మ్మేమయ్యె? కురుదళపు పొగరుపెదలగలునటు
మ్రోగు ఆ పాంచజన్యమ్మేడ? బింకమున
కుత్తుకలనెత్తి నురుగులు క్రక్కు తురగతతి
హేషారమ్ములను నేడెట్టి నీరవత
మ్రింగినది? తొండముల పైకెత్తి ముందునకు
పరుగెత్తు పెనునల్లమేనుల గజమ్ముల వి
క్రమ్ము ఈ చీకటుల కడలిలోన కరంగి
పోయినవ? (కొంచెము సేపు చుట్టునుచూచి)
నేటివరకును కురుక్షేత్రమ్ము
నృపుల రణరంగమై యుండినది; ఈనాడు
క్రుళ్లుచున్నట్టి పీనుగుపెంట యైనయది!
నిన్న ఇది వీరభటులాడు మైదానమ్ము;
భూతములు నర్తించు వల్లకాడీనాడు!
కదనరంగములన విశాల శ్మశానములు
కదనమో, ఘోరమారణకర్మ! గెలుపన్న
నేమి? విజితుల ఏడ్పు; విజయి జన గర్వమ్ము!
(చింతించును; కనులుమూసి, కనులు తెరచి, వేడిగా నిట్టూర్చి)
నాదు పాలన చిట్టచివరలో వీరాత్ము
లెందరు మడిసినారు? శివశివా, మననమే
నా చరమసోపానమయ్యెనే? రక్తమున
కాల్గడుగునట్లయ్యెనే నేల విడు ముందు!
సమరు భీకరు లెంతమంది మడిసిరి? పుణ్య
పురుషులెందరు దివికి చనిరి? యువకులదెంత
మంది ప్రాణమ్ములను బలిపెట్టిరి రణాన?
ద్వాపరయుగోదాత్త పురుషులు : ఆచార్య
భీష్ముండు, కర్ణుండు, ద్రోణు, డభిమన్యుండు
మహిత వీరులు సర్వులాలంపు టగ్నిలో
కాలి బలియన్నమటు బూడిదగనైనారు
కౌరవ మహామహుడు శత్రువుల మోసమున
చిక్కి తొడవిరిగి తన నేలపై పడినాడు!
ఉక్కివపు పోరిలో మృతికలిగె కర్ణునికి!
బలియయ్యె నా ద్రోణుడా ధర్మజుడు పల్కి
నట్టి ముగ్ధా సత్యమును నమ్మి! (పైనికి చూచి, మనసులో)
దిగిరమ్ము,
దిగిరమ్ము, దిగిరమ్ము, దిగిరమ్ము చీకటి
మిను పొట్టనుండి దిగిరా, కప్పు, మననమును
కురుకులార్కుని చరమ దురవస్థ కాంచి సహి
యించ నేరక పశ్చిమాబ్ధి జారిన సూర్య,
నీవింక పుట్టకుము! నీ పసిడి కిరణాల
ఈ భయంకర దృశ్యమును తిరిగి ముట్టకుము!
ఇది కురుక్షేత్రమ్ము కాదు; పెన్మసనమ్ము!

(తన చుట్టును హద్దులు లేక వ్యాపించిన పెనుమసనమును రెప్పవేయక చూచుచు ద్వాపరుడు అంతర్ముఖుడై నిలబడును. సుందర భద్రాకారుడైన కలి పురుషుడు ప్రవేశించి, చుట్టును చూచి దూరమున నిలుచున్న ద్వాపరదేవుని గుర్తించి మెల్లమెల్లగా అతని పద్దకు పోవును. అతనికి కొంత దగ్గరగా నిలుచుకొని కొంతసేపు నిరీక్షించును. ద్వాపరుడేదియో ఆలోచనలో నిమగ్నుడై బహిః ప్రపంచమునే మరచిపోయి యున్నాడని తెలిసికొని గంభీరముగా అతనిని సంబోధించును)

కలి : ద్వాపరదేవ!

ద్వాపరుడు : (అనన్య చిత్తుడై తనకు తాను)
ఎంత రౌద్ర, మ్మెంత ఘోరమ్ము, క్రూరమ్ము
ఎంతటి విషాదమయమైనదీ దృశ్యమ్ము!
దృష్టి ఆనెడిదాక ఎచట చూచిన అచట
నాశమే నటియించె వికటాట్టహాసమున :
కనుగొన్నకడ శిథిల స్వర్ణరథముల రాశి;

ఎచట చూచిన అచట మృతదంతి సంతతులు;
రుండముల చెండాడు భూతముల బృందములు;
పీపు చర్మము చింపు గుంటనక్కల గుంపు !—
నాయుగపు తుదియందె విలయమై నట్లుండె
(చింతా మగ్నుడై నిలుచును)

కలి : ఏదియో ఎదచీల్చు చింతలో మగ్నుండు
పిలిచినను నామాట వినబడదు, ద్వాపరుం
డిట్లు చింతాక్రాంతుడై మైమరచి యుంట
నేనెప్పుడును కాంచలేదు—ద్వాపరదేవ :

ద్వాపరుడు : (రెండడుగులు ముందుకువేసి తనకు తానే)
ఏమిటీ చప్పుడులు ? ఆర్తనాదము లేమి ?
మౌనమే బాధతో మెలమెల్ల నేడ్చునటు
లనిపించు గాఢాంధరాత్రియే వేడిగా
నిట్టూర్చి మూల్గినట్లుండె. చేతులు విరిగి
పడిపోయినట్టి, కాళులు విరిగి పడినట్టి,
పొట్టపగిలిన శీర్షములు వ్రక్కలైన, నూ
ర్లార్లు సైనికుల అస్వ్వేష్టోర్ధ్వ రోదనము
యముని ఎద బెదరించునట్లు మిన్నంటెడిని—
హా కౌరవేంద్ర ! హా భీష్మ ! హా హా ద్రోణ !
హా దివాకర తనయ ! (ఆలోచించుచు నిలువబడును)

కలి : (గట్టిగా) ద్వాపరదేవ !

ద్వాపరుడు :(తిరిగిచూచి నిలబడిన చోటినుండి కదలక గంభీరముగా)
కలి మహాశయ !

కలి : ఏమిటిది ? ఏమిటిది నీవు ఒక్కడవె
నిలిచి చింతామగ్నుడైనావు ? పిలిచినను
వినబడదు ఏ పరధ్యానమున పలికెదవు ?

ద్వాపరుడు : (ఉప్పొంగి వచ్చుచున్న దుఃఖము నాపుకొని దీర్ఘస్వరముతో)
కలిదేవ ! ద్వాపరుడు కలిని ఈ మసనమున
ఎదురుకొనునట్లయ్యె ! రాబోవు యుగపురుషు
డవుచున్న నీకు ఈ పెను వల్లకాటిలో
పట్టాభిషేకమగునట్లయ్యె ఎన్నెన్నో
ఏండ్లకష్టము గడించిన సంస్కృతీ మహ
త్సుందరత తుట్టతుదికిటు నాశమయ్యెనే !
నీకు నాకాల సామ్రాజ్యమ్ముకి నందిచ్చు
సమయాన ఏ గర్వమున ఏ మహాశ్రేష్ఠ
వస్తువును నాదుకృతి యనినేను చూపింతు ?
ఈ కురుక్షేత్ర శ్మశానమ్ము చూపనా ?
మృతవీరవరుల శవములను నీకిత్తునా ?
శిథిల కనకరథాల మందలను చూపుదున
నీకే శుభంకర శ్రీ శ్రేయవలె ? చెప్పు !

కలి : ద్వాపరదేవ ! నీ విప్లేల ఉమ్మలిక
చెందెదవు ? శాంతింపు. నీ విచ్చుదానినే
మోదమున కొని నేను నాకార్యము నొనర్తు
నీలోన లోపమేది ? వ్యక్త సృష్టిని పూర్తి
తన తనువులో దాల్చి కాపాడు నిత్యతయె
తిరిగి అవ్యక్తమగునట్లు దాని నొనర్చు
యుగపురుషుడగు నీవదెందుకు విషాదమ్ము
చెందెదవు ? రసపూర్ణ శూన్యమ్మునుండి ఈ
విశ్వమ్ము పుట్టినది; అందె లీనమ్మగును
అయిననేమయ్యె ? వేరొక్క ఆకృతిదాల్చి
వేరొక్క కట్టడికి తలవంచి, వేరొక్క
కాలమున పొడసూపు. లీలయన్నదదెల్ల
పుట్టు గిట్టుటలందు కలదు అందులకు
దెందులకు చింతింప ? కలలోన కన్ననిధి
నశియింప లేచి ఏడ్చుట తగున ?

ద్వాపరుడు: (వేడిగా నిట్టూర్చి, కలిదగ్గరకేగి, భుజముమీద చేయివైచి)
కలిదేవ,
నేడు పోయినదెల్ల రేపువచ్చున మరల ?

కలి : ఔనేల సందియము ?

ద్వాపరుడు : (చుట్టును చేయిచాచి త్రిప్పి రణరంగమున పడియున్న వీరులందరిని నిర్దేశించి).........ఈ వీరు లెల్లరును !

కలి : ఈ వీరు లెల్లరును !

ద్వాపరుడు : వినువాక బిడ్డడగు
భీష్మ నంతటి బ్రహ్మచారులును ?

కలి : (ఒక విధమగు మొండిధైర్యముతో)
భీష్ములను
మించువారేతెంత్రు !

ద్వాపరుడు : భీష్మవలె ప్రతినలను
తప్పని నరేంద్రులును ?

కలి : దాని కిబ్బడి వారు
జనియింత్రు.

ద్వాపరుడు : ద్రోణుపోల్ చాపగురు లేతెంత్రె ?

కలి (తిరస్కారముతోను, గర్వముతోను)
విలయములు కలిగించు పిడుగులనె నిర్మింత్రు,
గ్రహచంద్ర తారకల తిరిగెదరు; ఊచెదరు !

ద్వాపరుడు : కర్ణునంతటి దాత లేతెంత్ర ?

కలి : రాకేమి !

ద్వాపరుడు : బింకమున, ఖ్యాత్రావ, కడిది దిట్ట తనాన,
అక్షయ్య వీర్యమున, పరమగాంభీర్యమున,
బలిమిలో, మైత్రిలో, పెంపులో, పెరిమెలో
కౌరవుని పోలిన మహామహులు వత్తురా ?

కలి : అవునందుకేల సందియము ?

ద్వాపరుడు : ఈవు ధన్యుడవు !
వారి పాలించు సుకృతివి నీవె ధన్యుడవు !
అయినప్పటికిని, కలిదేవ, నీ యుగ నరులు
కుబ్జులన్నది శాస్త్ర సిద్ధమైనది కాదె ?

కలి : (బింకముగా) కుబ్జులైనంతనే ఏమయ్యె ? దీర్ఘతను
లగు వారి పూర్వికుల భుజము లెక్కెదరు కద ?
అందుచే పూర్వయుగముల మానవులకన్న
ఉన్నతులు; సువిశాల దృష్టి బడసినవారు !
శీతనగమున కన్న దాని శిఖరానగల
ధవళగిరి శృంగమే మహిమోన్నతముకాదె ?—
చావులో క్రొత్తబ్రదుకడగినది; నాశనమున
నవసృష్టి పవళించె నూరుమాటలనేల ?
చావె నవజీవనమ్మునకు ఆధారమ్ము

నాశమే నవసృష్టి కుత్సాహకారణము

ద్వాపరుడు : యుగములను కలియుగమె శ్రేష్ఠమని యందువా ?

కలి : శ్రేష్ఠమగునోకాదో అది నేనిపుడు చెప్ప
నున్నతోన్నతమంచు ధైర్యముగ నమ్మితిని
పూర్వపు యుగపుటనుభవపు పునాదులపైనె
భావికాలపు భవ్యభవనమ్ము నిర్మింతు

ద్వాపరుడు : (హర్షముతో) నవయుగపు నవచక్రవర్తి, ఓ కలిదేవ,
నీకు మంగళమగుత ! నేడు నా పాలనము
తుదముట్టినది—ఇంక నే వెళ్ళి వచ్చెదను
కౌరవేంద్రుండు తుది ఉసురు పీల్చక మున్నె
నేనతనికని మాటలాడగా వలయునని
చిరవాంఛకలదు : నా యుగమున అతడె నరుడు
తన క్షాత్రమున, తనదు శక్తితో, తన అతుల
దృఢతతో ఎటువంటి మహిత సత్త్వండగునో
అన్న స్వత్త్వము నిలకు చూపించె!—నీకిదే
నా యీ కిరీటమ్ము నిచ్చెదను (కిరీటము పెట్టి)
ఇదె కొమ్ము
రాజకరవాలమ్ము ! (ఇచ్చును)

కలి : (నమ్మకముగా స్వీకరించి) అగ్రజా నీకిదే
మ్రొక్కెదను. నీ అనుభవము నాకు మేల్బంతి ?
(ఇద్దరును ఒకరినొకరు ప్రశంసనీయ దృష్టితో చూచుకొందురు. తరువాత ద్వాపరుడు చుట్టును తిరిగి శ్మశానము చూచి. నిట్టూర్చి రెండడుగులు వెనుకకు వేయును. కలి ద్వాపరునే చూచుచు వెఱగు చెందును)

కలి అన్న, ఎందుకు దుఃఖ ? మేల ఈ నిట్టూర్పు ?

ద్వాపరుడు : (వెనుకకు త్రిప్పిన దృష్టిని ముందుకు త్రిప్పక విషాదముతో)
కనుమచలు, కలిదేవ ?

కలి : ఏమిటీ వెల్తురులు ? చీకటియె వేనవేల్
దివ్వెల హఠాత్తుగా కన్నదో అనునట్లు
కనుచూపు మేరవరకన్ని చోట్లను కదలి
దీపించు చున్నయవి డివిటీల పెనుగుంపు !

ద్వాపరుడు : కనుమయ్య, ఇంకేమి కనియెదవు ? కనుమయ్య

కలి : (విస్మితుడై) ఏమిటీ రూపములు ? కెంపుదివ్వెల మసక
కాంతితో అస్పష్టముగానున్న మానవుల
వేనవేల్ నీడలవి మెల్లగ చరించెడివి

ద్వాపరుడు : (దుఃఖముతో) తెలియదా ? కలిదేవ, తెలియదా ? పాండవుల
కౌరవుల పక్షమున పోరి మడిసిన వారి
ఇష్టబంధువులు తమవారి పీనుంగులను
వెదకుచును, తనువు దాల్చిన ప్రేతముల వోలె
నిట్టూర్చి, కన్నీరుకార్చి, తిరుగాడెదరు !

కలి : జనన మరణపు దుఃఖములు పిండుగట్టి ఈ
మసనమున మెరపడిని వెళ్ళినటు కనపడును !

ద్వాపరుడు : ఇదె పరాక్రమ ఖనుల రణమహోత్సాహంపు
ప్రతిఫలము ! కనుమిదె రణోన్మత్తులైనట్టి
వీరుల పరాక్రమమునుండి పుట్టిన ఒలికి
ఇదె మహాభారతపు ఈ కురుక్షేత్రమున
వీరసంగ్రామమున, లోకప్రసిద్ధమౌ
విజయమున ఉదయమందిన పెద్ద పల్లకాడు !

శవముల కొటారు ! నక్తంచరుల పెనువీడు !
(ఇద్దరును చూచుచు చూచుచు దూరమై కటిక చీకటిలో కరగిపోదురు)

## దృశ్యము-2

(శ్మశాన కురుక్షేత్రపు మరియొక భాగము. దూరమున చీకటి అంతరాళమున డివిటీల కదలికలును, కొంత కొంత స్పష్టములైన మనుష్యాకృతుల చలనములును కనవచ్చును. ఆ వ్యక్తులు రానురాను సమీపింతురు. గీర్వాణుడు, నీలాక్షుడు, చాణూరుడు-అను ముగ్గురు కింకరులు కాగడాల వెలుగులో అటనట తిరుగుచు, వంగి వంగి చూచుచు, వెదకుచు వత్తురు. ఒక్కొక్కసారి తేర్లు విరిగి పడిన స్థలములలో వంగి, పొంచిచూచి, పరీక్షింతురు. ఒక్కొక్కసారి శవముమీద పడిన శవములను త్రోసిత్రోసి చూతురు. ఒక్కొక్కసారి చెడిపోయిన ముఖ మండలములను పరీక్షింతురు. వారు కౌరవేంద్రుని వెదకుచు వచ్చిన చారులు. తమ స్వామికైన పరిభవమును విని అతడుండు తావును కనుగొని సేవచేయుటకై ఆతురతతో వచ్చినారు.)

గీర్వాణుడు : (డివిటీని కొంచెము పైకెత్తి) జాగ్రత్త, జాగ్రత్త, చాణూర. ఇరులలో వేగముగ మునుముందు నడవకుము. రక్తపంకమునందు నిట్ట నిలువుగ నిలిచినట్టి బాణపు కొసలడగియుండ వచ్చును. (చాణూరుడు నిలబడును)

నీలాక్షుడు : గీర్వాణ, డివిటీని ఇటు పట్టు. మణిమకుట మస్తకపు వీరవరుడొక డిచట పడియున్నవాడు. ఆకృతిని మన ప్రభువునే పోలును.

చాణూరుడు : (పరుగిడివచ్చి) ఎక్కడ ? ఎక్కడ ?
ముగ్గురును కాగడాల వెలుగులో వంగి చూతురు.)

గీర్వాణుడు : నీలాక్ష, నీకేమి పిచ్చి పట్టినదా ? కంటబడినట్టి ప్రతిశవము మన ఒడయడని వదరెదవు !

చాణూరుడు : ఎలుగుబంటినిచూచి భయము చెందినవానికి శిలయే యెలుగుబంటి యగునంట. అట్లే నీలాక్షునికి అందరును చక్రవర్తులవోలె తోచెదరు.

నీలాక్షుడు : (దుఃఖముతో నిట్టూర్చి) అయ్యో, కౌరవనృపేంద్రుని కాంచవలెనను ఆశ నాకున్మాదమెత్తించునట్లున్నది. (కన్నుల నీరునించి ఈ పీనుగుల రాసులలో కురుపతి నెట్లు వెదకవలెనో నేనెఱుగను. శవములను త్రొక్కి త్రొక్కి శవఖాదులగుచున్నాము.

చాణూరుడు : బాణపు మొనలను మెట్టిమెట్టినా అడుగులు జర్జరితములైనవి. ఇదేమి రణరంగమో ! పాడు వల్లకాడు !

నీలాక్షుడు : ఇందాక సమరరంగము నింతభయదమని నేనెఱుగను. సమర సమయమునకన్న సమరోపసంహారపుటీ శ్మశానమే భయంకరముగ నున్నదికదా !

గీర్వాణుడు: సమరముతో సాగివచ్చు నాశపు గందరగోళము నేడు నా కవగాహన యగుచున్నది. కట్టకడపటి కిట్టులగునని మొట్టమొదట ఎవరికి తెలి యును ?

చాణూరుడు : సమరకళాకోవిదులని నడినన్న బిరుదుమగలను, వీరభటులను చాపగురువులను, ఇచ్ఛామరణులను, చిరంజీవులను తన దళములో కలిగిన మన జనపతికి పరాజయము కలుగునని ఎవరు తలంచిరి ?

నీలాక్షుడు : ఎవరేమి చేయుదురు, విధి అడ్డుపడినపుడు ?

చాణూరుడు : ముందునడు, గీర్వాణ మన ప్రభువునకు కట్టకడ సేవనైనను చేసి సంతృప్తి పడయుదము.

గీర్వాణుడు : మన జనపతిని మించు మహితాత్ము నింకొకని మహిమీద మనమింక చూడగలమా ? దయాగుణమునందతనికి సాటివచ్చెడు మేటి ఎవ్వరు కలరు ? అతనివలె అచ్చపు నెయ్యము వచరించు చక్రవర్తి

లేవరున్నారు చతుస్సముద్రముద్రిత సర్వం సహామండలమందు ?

నీలాక్షుడు : మనకాతడే తండ్రియై యుండెను. అతడు మరణించిన పిదప మనమందరము తిరిపమెత్తుకొని తిను బిచ్చగాళ్ళము కదా ?

చాణూరుడు : హా తండ్రీ, ఎక్కడ మూలుచు ధూళిలో పవళించి పొరలుచున్నావు ? గీర్వాణా, మన ఒడయని హృదయమును తెలుపు ఒక మంచి కథ మీకు చెప్పెదను; వినండి. ఒకరోజు నడిరేయి నేను రోగముతో బాధపడుచును, మూలుగుచును పానుపుపై పవళించి యుంటిని. నా భార్య నా ప్రక్కన కూర్చొని కన్నీరు కార్చుచుండెను. నాకు తుది ఘడియలు సమీపించి యుండినవి. ఆ సమయాన మా బిడారపు తలుపును ఎవరో త్రోసినట్లయినది. నా భార్య 'ఎవరు వారు ?' అని కూర్చున్న చోటినుండియే అడిగినది. అప్పుడు కరుణామృతముతో నిండి తొణికిసలాడు కంఠమొకటి 'నేను వచ్చితిని, చాణూర, తలుపు దెరువుము' అన్నది. తెరువ, తోడెవ్వరును లేక ఒంటరిగా గూఢవేషమున వచ్చిన కురుకుల సార్వభౌముని కనుగొంటిని. పరమాత్ముని దర్శించిన భక్తునికివలె నాకు సంతసము మిక్కిలియై రోగము మేలయ్యెను ! కురుకుల సార్వభౌముడెక్కడ ? నేనెక్కడ ? అతడు నిక్కముగా మన యిష్ట దైవమే !

నీలాక్షుడు : జయమైననేమి ? పరాజయమైననేమి ? లేచిననేమి ? పడిన నేమి ? నరకమునన్ననేమి ? నాకమున నున్ననేమి ? మన ప్రభువెప్పుడును మన ప్రేమంపు ప్రభువేరదా !

గీర్వాణుడు : అతని మతి; మనకు మతి. అతని గతి రండి. తండ్రిని వెదకుదము

కింకరులు వెదకుచు పోయి ఇరులలో దూరమవుదురు. తల్లి యొకతె తన పిల్లవానిని తోడుగా తీసికొని ఏడ్చుచు వచ్చును. ఆమె భర్త మృతుడైన పాండవపక్షములోని ఒక భటుడు. ఆ రాత్రి పతి దేహమును వెదకుచు శ్మశాన కురుక్షేత్రమునకు వచ్చును)

పిల్లవాడు : అమ్మా, చీకటిలో ఎక్కడికి పోవుచున్నావు ?

తల్లి : బాబూ, భూమికి నిన్ను తెచ్చినవాని రుద్రభూమికి.

పిల్లవాడు : ఎంతదూరము ? అదెక్కడ ఉన్నది ?

తల్లి . దానినే వెదకుచున్నానురా, బాబూ'

పిల్లవాడు : అమ్మా, ఎవరితడు ?

తల్లి : ఎవరో నీవంటి ముద్దులకుమారుని కన్నతండ్రి, బాబూ, ఇతడు.

పిల్లవాడు : ఇక్కడెందుకు ఇట్లు పండుకొన్నాడు ? ఇతనికిల్లు లేదా ? అనాధుడా?

తల్లి : బ్రదుకన నేమిటో తెలియని ఈ పసివానికి మరణపు పరిచయమును నేనెట్లొనర్తును! బాబూ, సమరరంగమునందే వీరులకు స్థలము లేదనుట ఎట్లు ? మృతుల సంఘమునందు, మృతుల స్నేహమునందు బ్రతుకుచున్న ఇతనిని అనాధుడని ఎట్లందువు? సమరవిలయాగ్నికి బ్రదుకు నాహుతి ఇచ్చిన ఇతడు దీర్ఘనిద్ర పోయినాడు. మరలలేవడు!

పిల్లవాడు : మరల పైకిలేవడా ?

తల్లి : పైకి లేవడు.

పిల్లవాడు : మరల మాట్లాడడా ?

తల్లి : లేదు.

పిల్లవాడు : నావలె ఇతనికొక్క బాలకుడు కలడని తెలిపితివికదా ! ఆ బాలుని మరల ఎదకు హత్తుకుని సంతసించడా ?

తల్లి : (శోకమెక్కువై) లేదు, బాబూ, లేదు! ఇక నితడు అందమగు ఈ భూదేవి అంకమున సంచరింపలేడు : కాళ్ళు పోయినవి ! ఇక ఇతని గొంతునుండి మానవులు మాట్లాడు తీయని మాటలు బయటికి ప్రవహింపవు; నాలుక తెగినది! ఇక నితని ఎదదలో సతీప్రేమ, సుత వాత్సల్యము, బంధుమమత, కరుణ, దయ, నయము——మొదలైన మానవీయ దివ్య భావములలో ఒక్కటియైనను ఉదయించజాలదు! (వెక్కి వెక్కి ఏడ్చుచు) ఇతడు నవ్వలేడు! ఇతడేడ్వను లేడు! సుఖపడలేడు ! దూఃఖపడను లేడు !——శివశివా, మరణమౌనముకన్న కరము మేలుకదా బ్రదుకుగోడు?—బాబూ, ఇవుడితడొక అస్థిమాంసముల గూడు ! వచ్చువారు చెప్పలేని, ఉన్నవారు చూడలేని, చన్నవారు తిరిగిరాని, పల్లకాడు ఇతని వీడు! ఇవుడితనికి పితృత్వములేదు; పతిత్వములేదు; బంధుత్వము లేదు; శత్రుత్వము లేదు ! ఇవుడితడు డన్నయును కాడు; తమ్ముడును కాడు—

పిల్లవాడు : ఇంకేమైనాడమ్మా?

తల్లి : (దుఃఖాతిశయముతో) పీనుగు! వట్టి పీనుగు! పాడు పల్లకాటి పీనుగు!

పిల్లవాడు : (కన్నీరు నించి) అమ్మా, మనము వెదకుచున్న నా తండ్రియును ఇతనివలె అయినాడేమి ?

తల్లి : (బాలుని కౌగిలించుకొని ఏడ్చుచు) అయ్యో, నా కంటి వెలుగా! బ్రదుకు మంచితనము నిట్లు చూపుచున్న నీ అమాయకతముందు చావెంత కర్కశముగా కనిపించుచున్నదిరా!

(తల్లి వెక్కి-వెక్కి ఏడ్చు పిల్లవానిని పిలుచుకొని గోడుగోడుమని ఏడ్చుచు ఇరులలో కరిగిపోవును)

## దృశ్యము-3

(అదే శ్మశానపు మరియొక తావు. చీకటిలో వికారపు పిశాచములు రెండు భయపడుచు బిరబిర వచ్చును. వెనుకకు వెనుకకు చూచుచు కెవ్వున కేకవేయును)

మొ. పిశాచము : అక్కా, నా కింకను ఆ పాడు దుర్యోధనుడు అదెక్కడ గద త్రిప్పుచు వచ్చునో అని భయము! మానవులు చంపుటకు మొదలు పెట్టినచో మారిని మీరుదురు.



రెం.పిశాచము : చెల్లీ, విడువిడుము కల్లభయము! ఇంకెక్కడి దుర్యోధనుడు! భీముని గదాఘాతముతో తొడలు విరిగి ద్వైపాయన సరోవర తీరములో పడినాడు.

మొ. పిశాచము : అట్లేకావలయునో దుష్టునికి!

రెం.పిశాచము : విధివిలాసముచే అట్లయినది; లేకున్న భీమునకదియే గతి పట్టుచుండెడిది. నేనచ్చటనే ఉండి కంటిని వారి గదాయుద్ధమును. కౌరవు డోడిపోయియు ఓడిపోలేదు; భీముడు గెలిచియు గెలువలేదు.

మొ.పిశాచము : (దూరముగా చూచి) అక్కా; ఇదేమి మానవుల పిశాచత్వము, మన పిశాచత్వమునుకూడ జయించునట్లున్నది!

రెం.పిశాచము : నిక్కము; మన కొక్కింతయును నిలుచుటకు చోటులేదు. మానవుల మందయే మసనమును ముట్టడించినది.

మొ.పిశాచము : మన రాత్రీ సంచారమును తామే పొంది రాత్రించరులైనట్లు తోచుచున్నారు.

రెం.పిశాచము : ఇట నెవ్వరును కనపడరు. ఇట కొంతవడి నిలిచి బడలికను తీర్చుకొని ముందుకు పోదము—చెల్లీ, ఏమి భయంకర మీ కురుక్షేత్ర సంగ్రామరంగము! పిశాచములకు కూడ పిచ్చిపట్టించునట్లు ప్రేత కళను కూర్చుకొన్నది, తొల్లినేనెప్పుడును మరియే యుద్ధమునందును ఇటువంటి బీరమును, ఇటువంటి మారణహోమమును కని ఎఱుంగను.

మొ.పిశాచము : ఏమి మాత్సర్యమో! ఏమి సమరోన్మాదమో! ఈ నీచమానవులకు! ఈమెనైనను మాట్లాడింతును!

మొ.పిశాచము : (భయముతో) అక్కా, అక్కడ చూడు!

రెం.పిశాచము : పిశాచమో ? స్త్రీయో?

మొ.పిశాచము : పిశాచము కాదు. పిశాచమిట్లింత భయంకరమై ఎప్పుడును కనుపించదు. ఎవరో నరప వెంట్రుకల పరమ వృద్ధురాలుకదా?

రెం.పిశాచము : చెల్లీ, విరబోసికొన్న నరపకురులతో ఎంత రౌద్రముగా నున్నది? పీనుగుల నడుమ నడుచుచు ఎందుకు వంగి వంగి కనుగొనుచున్నది?

మొ.పిశాచము : తన బుడతని వెదకుచున్నట్లు తోచుచున్నది. అదిగో, పవిత్రమైన మాతృప్రేమ జ్యోతి పరివేషమువలె ఆయమను చుట్టి, పీనుగ తిండ్లనుకొట్టి, పరుగెత్తింపజేయుచున్నది! ఈ వైపుకే వచ్చుచున్నది రావక్కా చాటుకు పోదము.




(పిశాచములు మాయమగును. పండు పండు ముసలిదొకతె తన కొడుకును వెదకుచు ఊతలకోలకొని మెల్లగా వచ్చును. ఆయమ్మ కుమారుడు కౌరవ పక్షమున చేరి పోరాడి మడిసిన భటులలో ఒకడు. వచ్చిన ముసలిది నిలిచి, చుట్టుసుచూచి; నిట్టూర్చి, నిర్విణ్ణ భావమును ప్రదర్శించును. ఆమె మాటలాయాసములో అస్పష్టములు. నడుమ, నడుమ, అయ్యో, ఉస్స్' అన్నశబ్దములు చేయుచు విశ్రాంతి పుచ్చుకొనును)

ముసలిది ; తిరిగినట్లెల్ల కరము విస్తరిల్లుచున్నదికదా ఈ పాడు పెనుమసనము! ముసలితనము రానురాను యౌవనపు చిఱుతధర విస్తారమై పెద్దదగుటయె సహజము! అయ్యో, నా కొడుకెటకు పోయెనో, ఎటనుండెనో, కనపడడే. తిరిగి తిరిగి తిరిగి, వంగి వంగి, పీనుగులను చూచి చూచి నా నడుము బాధతో భగ్నమగుచున్నది. (నడుముమీద చేయివేసి బాధను ముఖ భంగిమతో సూచించును) పిలిచి పిలిచి, అరచి, అరచి, నా కుత్తుక ఎండిపోయినది. (నిట్టూర్పు పుచ్చి, కూర్చొని, శ్మశానపు విస్తారతను చూచి, 'ఉస్' అనును) ఇదేమి మారణక్రీడయో ఇలమీది నాదు బిడ్డలకు నేనెరుగను! (తలమీద చేయి పెట్టుకొని దీర్ఘముగా ఆలోచించును) అయ్యో, తండ్రీ! నిత్యమును సందెవేళల గుడిసెకు వచ్చి నేను పెట్టిన చేతిముద్దల తినుచు, నానాటి రణవార్తలను చెప్పుచుండిన వాడవు నేడేల తడవు చేసితివిరా? నీ కోసము మంచి తినుబండములు వండి నీవు వచ్చుదారినే ఎదురు చూచుచు వాకిటనే కూర్చుండి, వేచియుంటిని. ఇప్పుడు వచ్చును, అప్పుడు వచ్చును, ఇంకేమిదే వచ్చునని ఆశించుచుండగా సూర్యుడు పడమటి నింగిపై సంజకెంజాయ చల్లి, మెల్లగ మునిగెను. కారుచీకట్లు భువియందును నా గుండె గవియందును పుబ్బినవి—అయ్యో ఇంకేమిచేతును? ఇంకెచ్చటికి పోదును? (పిలుచును) ఓ బాబూ, నారాయణా! నీవెక్కడున్నావురా! దగ్గరికి రారా! మీ తల్లిని సంతృప్తి పరచరా! నా కింకెవరున్నారు? నాకు నీవే కళ్ళు! నీవే నోరు! నేవే హృదయము! నీవే! నీవే ప్రాణము! (ఏడ్చును) తండ్రీ, నారాయణా! నారాయణా! (కృష్ణుడు తన భక్తశిఖామణియగు విదురునితో కూడి అచ్చటికి వచ్చును. ఆ రాత్రి అతడు ఎడతెరిపిలేక కురుక్షేత్ర శ్మశానమున సంచరించి మరణించువారికి ముక్తిని ప్రసాదించు కార్యమున ఉద్యుక్తుడైనాడు. ముసలిది మారువేషముతో అచ్చటికి వచ్చిన కృష్ణుని చూచి అడుగును)

ముసలిది : అప్పా పిల్లలారా, నారాయణుడెక్కడున్నాడో చూపించగలరా?

కృష్ణుడు : (మృదుమధుర స్వరముతో) నీ నారాయణుడెవరవ్వా?

ముసలిది : నా నారాయణు నెరుగనివాడు నీ వెంతటి చిరుతవావురా! మావారిలోను, వారి వారిలోను నా నారాయణుని బలమును ఎరుగనివారున్నారా?

కృష్ణుడు : (కొంచెమాలోచించినట్లు నటించి) ఎరుగుదును, తల్లీ, ఎరుగుదును. మన్నించుమమ్మా నా తప్పు. నీ నారాయణుడు ఆ దిక్కుననే పరుండియున్నాడవ్వ పోయి చూడుమవ్వా!

ముసలిది : (ఆశ్చర్యముతో) పరుండినాడు? ఏల పరుండినాడు?

కృష్ణుడు : ఏలనో, తల్లీ. నేనెరుగను నేను వచ్చుచున్నప్పుడు నిన్నే పిలుచుచుండెను.

ముసలిది : (కృష్ణునివైపు చేయి చాచి) బిడ్డా, రా యిక్కడ. నన్ను పైకెత్తి నిలబెట్టు. (కృష్ణుడు ఆదరముతో ఎత్తి నిలబెట్టును) ఏమప్పా నీ చేతి గుణము! నా బడలిక అంతయును దూరమై ఒడలికి ఎంత బలము చేకూర్చినది!

కేవలం అసలైన
**జిందాతిలిస్మాత్**
మాత్రమే తన
అల్యూమినియం
మూతపైగల
సీలుపై ఈగుర్తు
కల్గివుంటుంది.

# నకిలీ మందులు మీకు ప్రాణాపాయం కల్గించవచ్చు



నకిలీ జిందాతిలిస్మాత్ తయారుచేస్తున్న వారిగురించి మాకు ఆచూకీ తెలిపే వినియోగదారులకు డీలర్లకు మంచి బహుమతి ఇవ్వబడుతుంది.



కార్ఖానా
జిందాతిలిస్మాత్
అంబర్‌పేట్.
హైదరాబాద్-500013

కృష్ణుడు ; (చిరునగవుతో) జవ్వనపు సాన్నిధ్యమే జవ్వనమును ప్రసాదించు, నవ్వా.

**ముసలిది** : బాబూ, నీకు మంచిదికానీ! (పోవును)

**విదురుడు** : వాసుదేవా, ఎమిటీలీల? ఏమిటీ నీ మాయ?
ముక్తికి మహాద్వారమైనయది ఈనాడు
ఈ కురుక్షేత్ర శ్మశానమ్ము!

కృష్ణుడు : ఓ విదుర,
నాకు నేడు విరామమే లేదు. ఆలించు
మృత్యుముఖులైన వారందరును ఈ నన్ను
తెలియకయొ, తెలిసియో, పిలుచుచున్నారయ్య.
ఎవరైన, ఏ నెపముచేనైన, నా పైన
గణనసేసట్టి నామములలో నొకటైన
మరణకాలమునందు నుడువ నన్నర్పింతు
నేడేను చచ్చువారందరి సమీపాన
నుండి నిష్పాక్షికముగా వారి భవబంధ
నముల భేదించి ఇత్తును మోక్షరాజ్యమ్ము

**విదురుడు** : దీన సంరక్షకా: దుర్జనులు. సజ్జనులు,
అనెడి తరతమ భావములె లేక అందరకు
ఒక్క పదవినె ప్రసాదించి, రక్షించెదవ ?

కృష్ణుడు : భక్తవర, విను. సన్నివేశమ్ము చేజిక్క
దుర్మార్గమందు కాలిడనట్టి సజ్జనులు
ఈ లోకమున లేరు అట్లె సన్మార్గమున
పడలేని దుర్జనులు నీ సృష్టిలో లేరు.
దేశకాలములచే బంధింపబడు నీతి
రెంటికీ నతీతమగు ముక్తికి నిమిత్తమా?
అంతరంగపు మూలతత్త్వమ్ము తెలియని
కుబ్జ దృష్టి గలట్టి నరులు తెగడుదురు, మరి
త్రోయుదురటంచునే నన్నియును తెలిసినను
అట్టులొనరింప——సత్వమ్మునకె లోపమగు
నాకు ద్వేషులు లేరు; ప్రియతములు సైతమ్ము
లేరు: నా దృష్టి కందరు నొక్కచే రూపు!

**విదురుడు** : పరమకరుణాకరా,
వేదములు, శాస్త్రములు, ఆగమ పురాణములు—
సజ్జనత, దుర్జనత; ధర్మము, అధర్మమ్ము
నాకమ్ము, నరకమ్ము అను భేదములు చెప్పి
విధినిషేదమ్ములను బోధించినవదేల ?

కృష్ణుడు : (గగనమునుచూచి, కొంతసేపూరకుండి)
భక్తియోగీ, విదుర, వేదశాస్త్రములెల్ల
నా ఒక్క అంశంపు వాణి; పూర్ణము కావు
వేదములకన్న, శాస్త్రముల సంతతికన్న,
యోగిమౌనులకన్న, మిగుల పెద్దది నాదు
హృదయ విస్తారమ్ము వేదమ్ము లెదమీని,
శాస్త్రములు దాపునకు రానీని, యోగులును
సిద్ధులును గైకొనని పాపులకు నా యెదద
యందు చోటున్నయది; సౌఖ్యమును ఉన్నయది
నాకు ఒల్లనివారెలేరు; చోటున్నయది
నా తనువులోన అందరకు—ఈ గుట్టువిను:
నాలో నిషేధమన్నదెలేదు; నీతియును,
సత్యమును ధర్మమును తను విభూషలు నాకు;
నను బిగించెడి శృంఖలలు కావు భక్తవర,
నేకాను పట్టి తత్త్వముల గుంపును, మరియు
వట్టి వ్యక్తినికాను : రసపూర్ణమైయున్న
జగదాది చైతన్య వ్యక్తిత్వ మంచెఱుగు!
క్షుద్రమగు నియమములకన్న పెద్దను నేను;
శుష్కమగు తత్త్వములకన్న రసమయుడేను;
ప్రబలమగు నీతికన్నను నేను ప్రథముడను
నాటకపు రంగమున రాజమంత్రులటన్న,
సైనికులు, సేనాధిపతులు, ప్రజలంచన్న,
సజ్జనులు, దుర్జనులు, పాపాత్ములంచనక
భేదములు లీలకోసరమునే పలికెదను!
లీల ముగిసిన అందరొక్కటై పోయెదరు!
నాటకపు తస్కరుని పట్టి చెఱకంపింప
ఏమాట యగుచెప్పు! (దూరమున! భగవన్ వాసుదేవ అను చప్పుడగును) ఆలించు, భక్తవర!
వింతకల పగులగొట్టెదను రా, పోదమ్ము
(కృష్ణుడు గంభీరముగా నడచును. వెనుక విదురుడు, అంతర్ముఖుడై అనైచ్ఛికముగా పోవును).

## దృశ్యము-4

కురుక్షేత్రపు వేకొకచోటు సంజయునితోకూడి ధృతరాష్ట్రుడును, గాంధారియు వత్తురు, గదాయుద్ధమున భీమునిచే పరిభవింపబడిన కౌరవుడు ఎక్కడున్నాడో అని వెదకుచు పోవుచున్నారు).

సంజయుడు : ఈ సద్దులేని నిశ మృతశవము వలెనుండె!
ఆర్తనాదములెల్ల మౌనమునె హెచ్చించె
కనులకును, మనసుకును భయదమై ఉన్నయది
ఈ కాటి దృశ్యమ్ము! గ్రుడ్డివాడగు నీవె
ధన్యుడవు నేడు, ఓ ధృతరాష్ట్ర నరపాల
ఐదింద్రియములచే కలుగు వేదనకన్న
నాల్గింద్రియములచే కలుగు బాధయె ఇంచు
కంత తక్కువ కాదె?

ధృతరాష్ట్రుడు , కల్లలాడకుమయ్య,
సంజయా కనులు తెలియని బాధ వీనులకు
రెట్టింపు కష్టమగు ఓ విధీ! అంధునకు
ఏల బధిరత నీక ఇటులు వేధించెదవు ?

గాంధారి : (దుఃఖముతో) సంజయా, ఉదయాన నా సుతునితోకూడి
రణభువికి వచ్చితివి. చూపు మాతని నిపుడు
ఏడకలడాతండు ? హాపుత్ర ! నిన్ను నే
తిట్టుటను మన్నించు ఎవరికీవేమైననేమి ?
నాకు సత్పుత్రుడవు ! దేవునికి ద్రోహివో?
ధర్మబాహిరుడవో? సత్యాపరాధివో?
సజ్జనుల పాపివో? భీమునకు వైరివో?
నాకు మాత్రము, బిడ్డ, ముద్దుల కుమారుడవు!
తండ్రి వీడెనటంచు, తల్లి తిట్టెనటంచు,
మిత్రులు గతించిరని, గురుసుతుడు మిగిలెనని
కందితివ? కుందితివ? చచ్చి నను చంపితివ?

అక్కటా, కనలకుము నామీద నాకూన! (ఏడ్చును)

సంజయుడు : (స్వగతము) ఓదార్చగాలేను : ఊరకుండనులేను;
దుఃఖితుల నోదార్ప దుఃఖమే ఉప్పొంగు
ఏడ్పు కన్నీరుగా పార ఏర్పడు శాంతి.
మసనమున శుష్కతత్త్వములు పలుకగరాదు!
దుఃఖించువారితో దుఃఖించుటే లెస్స
కన్నకడుపు విషాద మెవరోదార్చెదరు?
(గాంధారి దిక్కుమొగమై బహిరంగముగా)
దేవి, కురుకుల సార్వభౌము నన్వేషణకు
కింకరుల పంపితిని—ధృతరాష్ట్రుని వైపు తిరిగి)
ప్రభు, రండు, వెడలుదము.
పడిన పుత్రుని మడియుటక మున్నె చూతమ్ము
జాగుచేసిన యెడల చెయి మించు కార్యమ్ము

ధృతరాష్ట్రుడు : సంజయా, నీవు నాకంటి వెలుగువు; నాదు
చేతికోలవు ముందునడు, వత్తు (గాంధారికి)
రా, రమ్ము;
కన్నీటియేటిలో తేలిపోదము రమ్ము;

(అందరును వెళ్ళిపోదురు. భానుమతి ఒకతెయే తన చెలికత్తెతో వచ్చును. ఆమె దుఃఖము వాగతీతము. పిచ్చిదానివలె నున్నది.)

సఖి : భానుమతి, తల్లి, ఈ దిక్కుగా రండు, అదె సంజయునితో కూడి
దేవరయు దేవియును చనుచుండిరి. (స్వగతము)
అశ్రువుల సంద్రాన అందరును
మునిగియుండగ ఎవరినెవరు దరిచేర్చెదరు?
(భానుమతి ముసుగువేసికొని శోకరసమూర్తివలె పోవును).



## దృశ్యము-5

శ్మశాన కురుక్షేత్రములో మరియొక తావు. ధర్మరాజు, భీముడు అర్జునుడు, ద్రౌపది మొదలగువారు పత్తురు-ఘటోత్కచుడు, అభిమన్యుడు మొదలగు బంధువుల: ఇష్టుల అన్వేషణకై ధర్మరాజు శ్మశానమును చూచి దుఃఖముతో నిట్టూర్చును)

ధర్మరాజు : ఇదియె నా ధర్మంపు ప్రతిఫలము! వాయుసుత,
కనుమిదియె నీ ప్రతాపాగ్ని కాహుతియైన
ద్వాపర మహాపురుషు నుపవనము!

భీముడు : ఔనౌను,
ధర్మ మాహుతిగొన్న అధర్మంపు టుద్యానము;
పుణ్యాగ్ని కాహుతిగనైన పాపపు పంట!

అర్జునుడు : మరణ పీఠిక ఏల ధర్మ సంస్థాపనకు?
రణరక్తధుని పారకయె ధర్మమనితలి
కాలిడదు?
(ద్రౌపది అర్జునుని చూచి ముసిముసి నవ్వునవ్వును)

భీముడు : చని అడుగుమా కృష్ణ. వచియించు.
వికసనపు దశయందె నాశమ్ము కలిగినది
బోధనాపథమునకు శతమానములు వలయు;
విప్లవ పథము పట్ట రెండె దినములు చాలు
యుగయుగమ్ములు ఎదుకు, ఒకరోజు గదకు!
పదియు నెనిమిది నాళ్ళలోనె ముగిసిన దొక్క
కల్పంపు పని సిద్ధిగాగ వచ్చునె గంగ
పాపమయ సాధనకు!

ద్రౌపది : లెస్స పలికితి, భీమ
వీరులకు క్లైబ్యమది ఉచితమ్ము కాదయ్య
హత్య చేసిన పిదప బాధపడి ఫలమేమి?
(రణరంగములో పడి చచ్చుచున్న అనామధేయుడైన సైనికు డొకడు అయ్యో, నీళ్ళు!' అనుచు అరచుచుండును)

ధర్మరాజు ; (ఆ దిక్కు చూచి) ఎవరిదో పాపమ్ము ఆర్తనాదమ్ము?

భీముడు : (ఉదాసీనముగా) ఎవ్వడో మృతిచెందు సైనికుండర చెడిని!

ధర్మరాజు : మానవుడు బాధపడ మానవుండౌదార్ప
మానవుడు దైవమ్ము తానగును. లేకున్న
మానవుడు ధానవుడు
(ధర్మరాజు సైనికుని వద్దకుపోయి మోకాలిపై నిలుచును)

సైనికుడు : (మూలుగుచు) అయ్యో, నీళ్లు!

ధర్మరాజు : అర్జునా, వేగముగ చని నీళ్ళు కొని తెమ్ము, (అర్జునుడు పోవును)

భీముడు : అగ్రజా, తొలుతగా వాడెవ్వడో అడుగు
మనవాడొ? లేకున్న కౌరవుల సైనికుడా?

ధర్మరాజు : భీమ, నీ విపుడైన పగను విడువుము, తండ్రి
మననమున, మరణమున ఎవ్వరెవ్వరి వారు?
అందరు జమునివారు ! ఘనవారు వారివా
రందరు సతని వారు! ఇట్లుండ నీవేల
దయమాలి పలికెదవు? వైరమ్ము, స్నేహమ్ము
పేరాస, మచ్చరము, పోరాట, మివియెల్ల
స్వర్గపు సునీలంపు టౌదార్యమున మునిగి
తన్మయమ్ము యిపోవు తుట్టతుది!

భీముడు : (ద్రౌపదికి) కృష్ణా
వింటివా అగ్రజుని మాటలను నిర్దయుడు
నేనంట తామెల్లరును దయావారిధులు!
సమరమున గద విడిచిపెట్టి నేనును దయను
కైదువుగ కొనియున్న వీరికే గతియుండె?

ధర్మరాజు : కట్టకడపట మనకు దయయే శరణ్యమ్ము!
దయయన్నదా సచ్చిదానందమయమూర్తి
మారుతేజమ్ముకద? అనుజ, నీ వెరుగవా?
ఆకసమునుండి, మబ్బులనుండి, డివినుండి,
దిగివచ్చు పూలసోనల వాన చందాన
దయ మహోన్నత హృదయములనుండి దిగివచ్చు
నరపాలు కరవాలు కన్న గట్టిది కరుణ
పగతురను మెప్పించు మిత్రులుగ నొనరించి
భగవంతు హృదయమ్ము కన్న మృదులము కరుణ;
పరమాత్మ హృదయమునె చూరగొన్నది కాదె?
దాతకిడు దీవన; గ్రహీతను రక్షించు;
కరుణయను నైశ్వర్యముండినను ఊడినను,
పోయినను, వచ్చినను పొందినతడెల్లపుడు
శ్రీమంతుడైయుండు! పొంది ఇచ్చెడువారి
కది ముక్తిద్వారమ్ము స్వీకరించెడివారి
స్వర్గసోపానమ్ము

భీముడు : మున్ను నే పలుమార్లు
విని యుంటి దీని!

(అర్జునుడు నీళ్లుతెచ్చును, ధర్మరాజు సైనికునికి నీళ్ళు త్రాగించును. సైనికుడు నిట్టూర్చి, కనులు తెరచి చూచి)

సైనికుడు : ఎవ్వరు వీరు? పాండవుల!
కటకటా, కౌరవస్వామి కపరాధమ్ము
చేసితిన, తుట్టతుద పాండవుల జలమాని;
మన్నించు నన్ను, ప్రభు! మన్నించు! మన్నించు!

భీముడు : ఈతడే నా కిప్పుడభిమాన వీరుండు!
బ్రదుకులో ఎట్టులో అట్టులే చావులో.
బాధలో,—గురితప్పనట్టి పగసాధించు
నాతడే సహజ వీరవరుండు! తక్కుగల
వారలందరుకూడ కృత్రిమపు సైనికులు!
(దృశ్యము కనుమరుగగును)

## దృశ్యము-6

(ద్వైపాయన సరోవరతీరము. చీకటి కవిసియున్నది. పైనవిశాలముగా వ్యాపించిన నీలవితానమట్లు ద్వాపరయుగాకాశము ద్వాపరయుగ నక్షత్రములచేత ఖచితమైయున్నది. సరోవరము చుట్టును కొన్ని దిక్కులయందు కురుక్షేత్రశ్మశానపు కరాళదృశ్యములున్నవి. ఆ సరోవరతీరమున కౌరవేంద్రుడు ఊరుభంగ, కిరీటభంగములై బాధకును, అవమానమునకును దుఃఖపడుచు పడి యున్నాడు. అష్టాదశాక్షౌహిణీ పతియును, చక్రవర్తియును అయిన అతడు అనాధునివలె పుడమిపై పొరలాడుచున్నాడు. అతని ఎదుట ఉండియు లేనట్లు అశ్వత్థామ గగనమువైపు చూచుచు, నిష్పందుడై కన్నీరు కార్చుచు నిలువబడి యున్నాడు)

కౌరవుడు : (విషాదముతోను, నిరాశతోను)
పొమ్ము, పద, అశ్వత్థామ! ఎవరున్న ఏమొనర్తు?

తనవు రాగాక ఎవ్వండగును మనుజునికి?
పద, పొమ్ము; ఒంటరిగ వచ్చితిని భువికేను,
ఒంటరిగ ఇటనుండి వెళ్ళెదను పద, పొమ్ము
(అశ్వత్థామ మాటాడక కౌరవునికి కైమోడ్చి నిదానముగా పోయి మరుగవును. కౌరవుడు మరల ఏమిటో ఆలోచించి, పిలుచును)

కౌరవుడు : గురుపుత్ర! (అశ్వత్థామవచ్చి)

అశ్వత్థామ : కౌరవేంద్రా, ఇదో వచ్చితిని
తెలుపు మానసి ఏమి? నెరవేర్తు సరలమ్ము
తుష్టతది ఆకాంక్ష ఏముండినను చెప్పు
గురితప్పదయె చేతు!

కౌరవుడు: ఆకాంక్ష! ఆకాంక్ష!
వల్లకాటి ఆకాంక్ష! దీనినొక్కటినైన
పిల్లలను మేరలను పశువులను పదతులను
ఇరులతో పాండవులనంచు ఖండించినటు
భ్రమపడక సలిపెదవ?

అశ్వత్థామ ; ఋణము తీర నొసర్తు

కౌరవుడు : (రోదన స్వరముతో)
కర్ణ నాతో కూడ చితిమీద కాల్చెదవ?
మేమిద్దరొక్కరుగ మేదినిని బ్రతికితిమి;
మేమిద్దరొక్కరుగ సామ్రాజ్యమేలితిమి!
చావులో ఇద్దరము ఒకరుగ సుఖించెదము
చితిమీద మేమిద్దరొకరుకానెంచెదను!
మా ఇద్దరిది బూడి రెండుకాకుండనీ!
ఇది యొక్కటైన భ్రమపడక నెరవేర్చెదవ?

అశ్వత్థాము : రాజాజ్ఞ, పోయివత్తును నేను (పోవును)

కౌరవుడు : మిమ్మెల్లరను నమ్మి మోసపోతిని నేను!
ఓ పితామహ, భీష్మ! ఓ గురూత్తమ, ద్రోణ!
మీరెల్ల నాదు పక్షము వారలేకాదె
తనువు నాకునొసంగి, మనసు వారలకిచ్చి
అన్నంపు ఋణము తీర్పగ—
నామీది అభిమానమున కాదు, నా కెరుక—
పట్టి అన్నంపు ఋణమును తీర్చుటకు గానె
నా పక్షమున నిల్చి పైరి పోరితిరికద?
మీరెల్ల హృన్మనఃపూర్వకమ్ముగపోరి
యున్న నాకగుచుండెనేమి ఈ పరిభవము,
ఈ పరాజయము; ఈ ఊరు భంగమ్ము?
కుంటిసాకులు దొరక వెంటనే జారితిరి!
ధర్మంపు ముసుగు ధరియించి వంచించితిరి
ఓనాదు ప్రియతమభ్రాత! దుశ్శాసనా!
ఓ ప్రియ స్నేహితుడ! నా కర్ణ—ఎవ్వరది?
(ద్వాపరుడు ప్రవేశించును)

ద్వాపరుడు : చక్రవర్తీ!

కౌరవుడు : (వికటహాస్యముగా) ఎవరువారు 'చక్రవర్తిని' పిలుతురు?

ద్వాపరుడు : కురుకుల సార్వభౌమా: నేనిడియె ద్వాపరుడ!

కౌరవుడు : ద్వాపరమహానుభావా, ఆ స్థానము నాకు లేదు. నిన్ను పీఠమున కూర్చుండబెట్టుటకు! అందులకు క్షమింపుము!

ద్వాపరుడు : రాజరాజా, వంగక బ్రదుకు మానవుని హృదయమే మహాస్థానము. స్వాతంత్ర్యమే సామ్రాజ్యము కదా? స్వతంత్రుని కన్న చక్రవర్తు లితరులు కలరా? నీవు సదా చక్రవర్తివి!

కౌరవుడు : యుగపురుషా, నీవేల ఏతెంచితివి చెప్పు?

ద్వాపరుడు : నా పాలనము నేడు ముగిసినది. నీ యానతిని పడసి వీడ్కొనగ వచ్చితిని.

కౌరవుడు : అందులకు నన్నేందు కడుగవలె? పాండవులు కలరుకద! ధర్మజుండున్నాడు! ఆ కృష్ణుడున్నాడు! ఇపుడు వారలేకదా చక్రవర్తులు?

ద్వాపరుడు : నీవుండుదాక నా కితరులు సార్వభౌములెట్లవుదురు? నాకు నీవే సార్వభౌముడవు! నాకు నీవే చక్రవర్తివి! నీవు నాకింకను కౌరవేంద్రుడవు! నిన్ను వీడ్కొనెదను. ఆనతిని దయసేయుము. అప్పుడే కలికి అధికారము నిచ్చితిని. పోయిరానా?

కౌరవుడు : పోయిరా, ద్వాపరమహాదేవ పోయివత్తును నేనుకూడ

ద్వాపరుడు : అట్లే మనమిద్దరమును ఇంకొక్కపరి కలియుదము. (పోవును)

కౌరవుడు : అట్లుకా దింకెట్లు?
మనమందరము మరలి వచ్చుటకె చనువారు!
(కొంచెముసేపు మౌనముగా ఉండి ఉద్రేకముగా)
ధర్మమ్ము! అధర్మమ్ము!
ధర్మవర్తనులెవరు? అధర్మవర్తనులెవరు?
అబ్బబ్బ, ధర్మసంస్థాపనాచార్యుండు
కాదె ఆ కృష్ణుండు!
ధర్మమ్ము వెన్నంటి కాపాడినాడుకద
ఆ కృష్ణుండు?
ఆ పేద గొల్లవాడు!
ఆ పసుల కాపరి!—
ఆ అసంస్కృతుడు, ఆ అనాగరకుడు!—
సరిలెమ్ము
నేనధర్మాధ్వగామిని, సరియె
పాండవులో?
అదియెట్టి ధర్మపథ వర్తనులు?
కురువృద్ధుడగు భీష్మ బ్రతిమాలి చంపిరి;
లోలోనుపాయములు పన్ని చంపించిరి!
మా ఎల్లరకును ఆచార్యుడౌ కుంభజుని
వంచించి, పరలోకమునకు పంపించిరి!
కర్ణు, ఆనాదు ప్రియతమమిత్రు, నా కర్ణు,
సురలు సైతమ్ము పూజించు ఆ సూర్య సుతు
చూచుచున్నట్లె కన్నుల ఎట్టఎదుటనే
మోసమున చంపిరి!
నన్ను సైతము మల్లయుద్ధమున తగనివగి
దిని తొడలు విరుగంగ గొట్టి పడగొట్టిరి
వీరెల్ల ధర్మ ప్రవర్తకులు?
నేనొక్కడె అధర్మ పథగామి!
ఇదియెల్ల ఆ కృష్ణ కుహకము!
కైతవపు శిక్షాగురువు కాదె ఆతండు? (కోపముగా)
ఓరీ కృష్ణా! కృష్ణా! కృష్ణా!
(కృష్ణుడు వెంటనే ప్రత్యక్షమగును)

కృష్ణుడు : రాజేంద్ర, అరుగుదెంచితినిదిగో!

కౌరవుడు : నీ వెవరు?

కృష్ణుడు : నీ విప్పుడే పిలిచినట్టి ఆ కృష్ణుడను!

(కౌరవుని ముఖము వికట కర్కశమగును. పెదవి విరచును. బుస కొట్టును. సర్పము ఫణమెత్తునట్లు సగము పైకిలేచి చేతిమీద ఒరుగును)

కౌరవుడు : ఎవరు పిలిచిరిరా నిన్ను? నా యీ దుర్దశను కాంచి నవ్వుటకై వచ్చితి వేమి?

కృష్ణుడు : (చిరునవ్వుతో) కౌరవేంద్రా, నీవు నన్ను పేరుపెట్టి పిలిచితివికదా?

కౌరవుడు : అరచితినిరా, పిలువలేదు! నీవు చేసిన మోసమును తలచుకొని సిగ్గు చెంది కడుపు మంటతో అరచితినిరా, పిలువలేదు! "కృపాకరా, మురారీ, కరుణాసాగరా, రావయ్యా, కాపాడవయ్యా అని ఈ మహానుభావుని ఎలుగెత్తి పిలువలేదు!—వచ్చిన దారినేపోరా! తొలగరా ఇక్కడనుండి, నీచుడా! నా ఎదుట నిలువకుమురా! తొలగిపొమ్మురా, కనులు కుట్టునురా!

కృష్ణుడు : సావధానము! చక్రవర్తీ, సావధానము!

కౌరవుడు : ఓరి దురాత్మా, 'చక్రవర్తీ'యని నన్ను గేలిచేతువా? నా చక్రాధిపత్యమును పాడుచేసిన దుష్టుడవు నీవేకదా?

కృష్ణుడు : రాజేంద్ర, పాడుచేసిన దుష్టుడను నేను
కాను; నీవే నిన్ను పాడుచేసికొనినావు
కద. మత్సరమ్ముతో పాండుసుతులను జూద
మను వ్యాజమున మోసగించి కాననములకు
పంపించినట్టి పాపాత్ముడను నేకాను
ద్రౌపదీ మానమ్ము రాజసభలో కూడి
యున్నట్టి మహనీయుల సమక్షమున తీసి
ధర్మమును చెరచినది నేకాదు పాండు తన
యులకు ధరణిని ఇమ్మటంచు నేవచ్చి వే
డిన పెడచెవిని పెట్టి, పెద్దలాడినమాట
ప్రక్కలకు నెట్టి, సమరాగ్ని సంటించినది
నేకాను. నీవె కారణము! నీ వల్లనే
ఈ కురుక్షేత్ర రణరంగమ్ము నేడెట్టి
రుద్రభూమిగనైనదో కనుము! నీ వల్ల
నే కర్ణ భీష్మ ద్రోణాది వీరాగ్రణులు,
ద్వాపరయుగానర్ఘ రత్నములు—నుగ్గునూ
చమ్ముగా కాలేద?

కౌరవుడు : (ఉప్పొంగి వచ్చుచున్న కోపముతో)
ఓ మారి! మాయావి!
ఓరోరి హంతకా! రణరక్త రాక్షసా
పేలకుర నా ఎదుట తిక్త వాక్యమ్ములను
ఓరి పితృవనచారి, నేను కద చంపినది?
నేనుకద పెద్దసైన్యముల వీరాగ్రణుల
తిన్న పీనుగతిండి? ఇరుపక్ష సకల భట
ప్రాణముల గ్రావి కాటిగ మార్చినది నేను
కద?—ఓరి పుట్టునెత్తురుపింజి, ఆనాడు
నీవు విదురుని ఇంటినుండి నా ఆస్థాన
మునకు వచ్చిన యపుడె అడుగడుగు నను నీవు
మంటలను రేపి మననమును చేయుచు వచ్చి
తివి కాదె? కపటమును దాచి ఇడి నాతోడ
ప్రేలెదవ? (బుసకొట్టును)

కృష్ణుడు : (గంభీరముగా తనలోనే) చాల్చాలు: చాలు చాలీయాట!
కల పగులగొట్టు సమయమ్మిప్పుడేతెంచె
జగము నెంతటి ప్రసిద్ధిగ చేయు నామాయ!

(కౌరవుని దరికేగి చురచుర చూచి, రెండడుగులు ముందువచ్చి, శక్తిని ప్రసరించు దివ్యవాణితో పల్కును)

ఓ వీర కౌరవా! తత్త్వ కౌరవా!
చాలు నీ అభినయము? పసిదికల ప్రచ్చిలే!
మేల్కాంచి, కనుతెరచి, చూడుమయ్యా! చూడు!
క్రీడ మరచెదవేమి మూఢమానవు రీతి

(సామాన్య గురువుల శక్తిదాయక మంత్రోపదేశములతో మాయా స్వప్నము పగిలి జ్ఞానోదయమగునన్నచో, సర్వజగద్గురువైన భగవాన్ శ్రీకృష్ణుని అధికారయుతమైన మంత్రవాణిచే ఆసన్న విమోచనుడైన కౌరవుని సువర్ణస్వప్నము జలబుద్బుదమువలె చిట్లిపగులును. ఉన్నదున్నట్లే కౌరవుని ముఖమున శాంతి రూపు కట్టును; మొలక నవ్వుతొలుకాడును; కనులు వికసించును. నిట్టూర్పు పుచ్చి ప్రసన్నచిత్తుడై శ్రీకృష్ణుని చూచును. శ్రీకృష్ణుడును మొలకనవ్వు నవ్వును. సూత్రధారుడును, కథానాయకుడును నాటకరంగమునుండి నేపథ్యమందిరమునకు వచ్చినట్లగును)

కృష్ణుడు : స్వర్ణస్వప్నమును పగులగొట్టితివా, కౌరవేంద్రా?

కౌరవుడు : (హసన్ముఖుడై) జగద్గురూ! నీ మంత్రాను ఘాతముతో పగిలినదా స్వప్నము (నిట్టూర్చి) కమలాక్షా! స్వర్ణస్వప్నమైనను కూడ ఏమి

## "కవిత"

పద్దెనిమిది పర్వాల భారతం నుంచి
పద్దెనిమిది పంక్తుల వరకు దిగినా
గంగ లాగా భ్రష్టస్థితిని పొందలేదు!
రవణిస్తూనే ఉంది।
నన్నగిల్లినా మోహాన్ని పుట్టించే
చిన్నదాని లేగొను లాగానే!

## "నవలలే"

సంసారం పేరుతోనూ
సాహిత్యం పేరుతోనూ
సమాజంలో
చిత్రవధ గావింప బడుతున్నది
"నవలలే"
ఈనాడు!

శ్రీ కె. కిశోరు బాబు
శ్రీ కె. అశోకు బాబు

భయంకర స్వప్నము!—సూత్రధారా! నేను నా పాత్రను తిన్నగా అభినయించి చూపితినా? లేక అందులో ఏమైనను తప్పితినా?

కృష్ణుడు : నటులలో నటుడన్న నీవెరడ కౌరవా! నీవలె ఎవ్వరును అభినయ చతురు లుండరు. ఏ మధురయము! నీ యభినయమునకు నేనే మోహితుడనైతిని !

కౌరవుడు : కర్ణునభినయమేమందువు? బలు సొగసుగదా?

కృష్ణుడు : నీకు తరువాతి వాడే అతడు! ఆనాడు కదపటి కదనములో తన్ను తానే మించెనతడు. చూచుచుచూచుచునే నేను చాల ముదమందితిని.

కౌరవుడు : నీవు కళాకోవిదుడవు కదా? విశ్వరవివి కదా?

(పైకి చూచి కొంచెమాశ్చర్యముతో) భగవన్, ఎచ్చటికి పోయినది ఆ తారాపరిశోభిత నీలాకాశము ! (చుట్టుచూచి) శ్మశానమైయుండిన ఆ కురుక్షేత్ర రణరంగమెక్కడ? (చెవియొగ్గివిని) చెవులు చిల్లులుపడు నట్లు పై కెగయుచున్న ఆ ఆక్రందనధ్వనులెక్కడ ?

కృష్ణుడు : (హసితవదనుడై) కలపగిలిన తరువాత అదేముండును, కౌరవకృష్ణా ? అద్దెల్లయును తీయని మాయతో చెక్కిన మాయవునున్న కదా?— అదిగో!

(తెరలో 'సంజయా, దారి చూపు' అను శబ్దమగును!

అదిగో, గాంధారీ ధృతరాష్ట్రులు సంజయసమేతులై వచ్చుచున్నా రిచ్చోటికి నాటకమును తిన్నగా ముగించుము! నేను పోయి వత్తును. (నడచుచు) అచ్చట మరల నిన్ను కనుగొందును. (అదృశ్యుడగును)

(కౌరవుడు మరల మాయ వ్యాపించి నేలమీదపడి మూలుగును. సంజయుడు, ధృతరాష్ట్రుడు, గాంధారి, భానుమతి మొదలగువారు వత్తురు)

కౌరవుడు : (పొరలుచు) హా, ఏమవమానము! అయ్యో, ఏమూరుభంగము! ఏమవమానము!

సంజయుడు : ధృతరాష్ట్రా, చూడు మీ తావుననే పొరలుచు బాధపడుచున్నాడు కురుకుల సార్వభౌముడు

ధృతరాష్ట్రుడు : అప్పా, కుమారా, ఎక్కడున్నావురయ్యా!

గాంధారి : అయ్యో, తండ్రీ!

భానుమతి ; అయ్యో, అయ్యో!

(అందరును కౌరవుని పైబడి గోడుగోడుమని ఏడ్తురు. ఆ భయంకర మైన శ్మశానమౌనమున ఆ రోదన ధ్వని కదలి హోరువలె ప్రసరించును)

## దృశ్యము - 7

(శ్మశానమున ఒక స్థలము. కృష్ణుడు, విదురుడు మాట్లాడుకొను చుందురు.)

కృష్ణుడు : కౌరవేంద్రుని చూచి వచ్చితిని, విదురా. ఏమి పౌరుషవంతుడతడు క్షాత్రమున నాతనికి సాటిమగు మేటిలేడు.

విదురుడు : మహాధీరుడు! అచలప్రతిజ్ఞుడు! (దూరముగా చూచి) ఎవరక్కడ ఇక్కడికి వచ్చుచున్నారు?

కృష్ణుడు : (చూచుచు) ఏమి చిత్రమయ మీ శ్మశానము! సహదేవుడతడు!— కుంతీదేవికదా ఆమె?

విదురుడు : అట్టులే కనవచ్చుచున్నది. ఏమో వెదకుచున్నట్లు తోచుచున్నది కదా?

కృష్ణుడు : పసివానిని తొట్లనుండి త్రోసి పారవేసిన తల్లి, శ్మశానమున చూచుటకు వచ్చినది, తన అనుంగు తనయుని.

విదురుడు : (ఆశ్చర్యముతో) నీవు చెప్పునదేమి? ఎవరిని చూచుటకు వచ్చినది ?

కృష్ణుడు : ఇంకెవరిని ? రణధీరుని, దానశూరుని, కర్ణుని!

విదురుడు : కర్ణుడు! కుంతీపుత్రుడు! ఏమి మాట ఇది కృష్ణా?

కృష్ణుడు : నీకు తెలియదు. పైకథ గుండెలో ఎన్ని లోకథలు కదలుచున్నవన్నది నీకు తెలియదు. ఇక్కడికి రమ్ము. అంతయును చెప్పెదను. ఆలించు వారాడు మాటలు.

విదురుడు : నేడేమిటాశ్చర్యము మీదాశ్చర్యము!

కృష్ణుడు : నేడందరికిని వివేకపువేళ. రా, ప్రక్కకు పోదము!

(విదురుడును, కృష్ణుడును మరుగవుదురు. సహదేవుడును కుంతియు పీనుగులను పరీక్షించుచు వత్తురు)

సహదేవుడు : ఇటు, ఇటు, తల్లీ.

కుంతి : బిడ్డా, ఎట్టి కడుపు నాది? నాడు వేవెలుంగుకు వేరటమైన నా ఈ కడుపు నేడు శ్మశాన వహ్నిలో సంతప్తమగుచున్నది కదా!

సహదేవుడు : (తెలిసియు తెలియనివానివలె) తల్లీ, మీరెవరినిట్లు వెదకుచున్నారు? నాకు సైతము చెప్పనేరరేం? చెప్పినచో అతనిని త్వరితముగా చూపు ప్రయత్నము చేతును. మీరు వెదకుచున్నవాడు వినుతికెక్కిన వీరుడా? సామాన్యసైనికుడా?

కుంతి : (నిట్టూర్చి) వినుతికెక్కిన వీరుడు కుమారా. నేలకన్న వీరులలో నిక్కు వంపు వీరుడతడు! కీర్తికాంతిలో మార్తాండదేవుని మీరిన వాడతడు! రణరంగమున రోషభీషణ పరాక్రమమును చూపినవాడతడు! దానమును విచ్చిన చేతులలో ఇచ్చినవాడతడు!

సహదేవుడు : ఎవరతడు? దానశూరుడు కర్ణుడేమి?

కుంతి : (వెక్కి వెక్కి ఏడ్చుచు) అవును కుమారా, కర్ణుడు! ఆ నా కౌమార ప్రణయమునుండి ప్రభవించిన నా ప్రేమనిధి కర్ణుడు! పెద్దకొడుకు మీ యందరికన్న పెద్దవాడు!

సహదేవుడు : (ఆశ్చర్యము నటించుచు) తల్లీ, మీరు చెప్పునదేమి? మీకు కర్ణుడెట్లు కుమారుడు?

కుంతి : కుమారా, వ్యథిత హృదయమును వేధింపకు!
నా తనువునందు నరకమును రగిలింపకు!—
చూపవయ్యా, కర్ణుని,చూపవయ్యా!

(సహదేవుడు కొంత ముందుకుపోయి కర్ణుని శవమునుచూచి, కొంత భయపడి నిలిచి, చేతివేలితో చూపును. కుంతి ఏడ్చుచుపోయి కర్ణుని శవము మీద పడును)

సంజయుడు : ఏమి కరాళ లీల ఇది! (తల విదిలించుకొని ధీరుడగును)

కుంతి : అయ్యో, కుమారకా, ఏమైపోతివిర!
ప్రసవించి ఏటిలో పారవేసిన నిన్ను
పాడు మనసనమునందు మరల ముద్దొనరించు
పగిదిగా నయ్యెనే?
కన్యాత్వపుంగ్రీడ కను పొడుచునట్లయ్యెనే!
నిన్నిట్టిదుస్థితికి గురియొనర్చిన పాప
మతిని నను మన్నింపుమయ్యా—
ఓనాడు గురుదేవ, గురుదేవ, దుర్వాస,
నీ విచ్చినట్టి పరమది కన్న ఫలమునిదె
కనుమయ్య! కనులార కనుమయ్యా, కనుమయ్యా!
నీదు మిణుగురు కాల్చి వల్లకాటిగచేసి

నట్టి ఉద్యానమును
భారతము నిటు వల్లకాటిగా మార్చుటకె
నే నిన్ను కంటికద?
ఓ నాదు హృత్ప్రేమవారిధి తరంగమా,
ఓ నాదు హృదయ వాంఛా విస్ఫులింగమా,
నా కడుపులో తిరిగి పడవేమి? చెప్పరా!—
ఓ బాబు, నీ సఖుడు కౌరవేంద్రుడు కాదు
నేనె కారణము కద, ఈ మారి విందునకు,
ఈ కురుక్షేత్రంపు టీ మారి విందునకు,
అమ్మ, గంగామాత, నిర్మలాంతఃకరణ,
నాడేను నీచేత నిడినట్టి పసివాని
నేడు రమ్మా, కనుమ, ఇచట ఏమైనాడొ

నాడీవు కాపాడితివి పాపి నేగన్న
ఈతనిని, నేడు సైతమ్ము కాపాడనే
రవతల్లి, పుణ్యమయి!—నా బాబు, ఓ బాబు,
నేను చేసిన మొదటి అపరాధమునకునై
విధి నిన్ను ఎందుకాహుతిగొనియె నీ రీతి?
నా పాపమునకు నీ బ్రదుకు బలియయ్యెనే?
రాజవంశమునందు జన్మమందిన నిన్ను
నే సూతకులమందు తిరుగునటు చేసితిని;
మన్నింపుమయ్య; అపరాధమ్ము; మన్నింపు!—
ఓ బాబు, నాడీవు హస్తినాపురియందు
పాండవులు కౌరవులు విలువిద్య మెఱయించు
వేళలో, నీ హస్తలాఘవము చూపగా
రంగమేతేర నే చూచుచునె పొంగితిని;
నాతప్పు తలచికొని పట పట వణంకితిని!
అటచేరి నట్టి వీరులు నిన్ను సూతకుల
జుండనుచు తెగడ నీవ్యాసమ్ము దించితివి!
నేనద్ది కనినంత మూర్ఛలో మునిగితిని
అప్పుడైనను నేను సత్యమును వచియించి
తిరిగి నిను పడయగా నైయుంటి అయినను
ప్రజల అపవాదమ్ము వచ్చునని సత్యమ్ము
కానట్టి సిగ్గుతో; ఎడదపొంగిన బిడ్డ
పై ప్రేమ క్రుంగించుకొంటి! నాశముచేసి
తిని, అయ్యొ, నాశనము చేసితిని నీ బ్రదుకు!
ఓ కృష్ణ, నీదు పలుకాలించి చెడిపోతి!
నాదు కొమరుని నేను చంపుకొంటినికాదె!
అక్కటా, నీ యాజ్ఞ పాలింప నిష్టపడి
'తొడిగిన శరమ్ము మరి తొడగకూడదటంచు
ప్రతిన కైకొనునట్లు చేసితిని!
నా సుతుని నేనె మృత్యువు పాలొనర్చితిని!
ఓ విధీ! కాల్చు నా తల్లితనమును!
కొడుక, ఎరుగని అబలనిటు అందరును మోస
గించిరికదా; నిన్ను చంపివేసిరి కదా?
నీవును నన్నిట్లు వంచించి ఎటుపోతి?
ఓ పార్థ, మాతృనేత్రము నిట్లు క్రుచ్చెదర?
ఓ శిశూ, ఓ కర్ణ అక్కటా!

(దృశ్యము మారును)

## దృశ్యము - 8

(ముసలిది కొడుకు నెచ్చటను కానక బడలిపోయి వచ్చును)

**ముసలిది** ; ఇదేమి పిశాచాల ఆట? ఇంతమంది తిరుగుచున్న ఈ చీకటి బయలులో నన్నడుగు వారే లేరు. అందరును వెదకువారె కాని చూపువార్నే కన పడరు. ఓ నారాయణా, ఎక్కడున్నావయ్యా పలుకవయ్యా బిడ్డలులేని ముసలిదాని నడుగు వారెవరు? బాబూ, నీవు నాతో ఉండగా అందరి కిని నేను నచ్చినదానినై యుంటిని. నీవు పరాక్రమశాలివని తెలిసి దొరగారి సైన్యాధిపతులు నా వద్దకు వచ్చి వందలాది తీయని మాట లతో, మోసపుటాశలతో నా వెన్ను తట్టి, సమాధానపరచి, దేశాభి మానము, స్వామి భక్తి, ధర్మనిష్ఠ, క్షాత్రధర్మము మొదలగు సమ యోచితములగు ఉపాయ వేదాంతముల వర్ణించి నిన్ను కొనిపోయిరి నేను మాటలకు మరులుగొంటిని. ఇప్పుడెక్కడా తత్త్వములు ఆ అధికారములు, ఆ భక్తి ధర్మాభిమానములు! అన్నియు వట్టి కల్లలు కదా? తెలియని వారికి తెలిసినవారు పన్ను వలల ఉరిత్రాళ్ళు కదా? ఇంతకును, శ్రీమంతుల కలహాగ్నికి యజ్ఞపశువులు మావంటి దరిద్రులేకదా?—

(ముసలిది తలమీద చేయివైచికొని కూర్చుండి చింతించుచుండును. తల్లియును, పిల్లవాడును ప్రవేశింతురు)

**పిల్లవాడు** : అమ్మా, నేనింక నడువలేను.

**తల్లి** : రా; బాబూ, ఎత్తికొందును (ఎత్తికొని నడచి ముసలిదానిని చూచి) ఎవరక్కడ? (దగ్గరకుపోయి చూచి) అవ్వా ఎందుకిచ్చట కూర్చుం టివి?

**ముసలిది** : (తలయెత్తిచూచి) తల్లీ, నా కుమారుడగు నారాయణుని వెదకి వెదకి చచ్చి సున్నమైతిని. అయ్యో! ఎక్కడున్నాడో ఏమో? చెప్పువారు లేరు, చేయువారు లేరు; నా కింకేమి గతి? చెప్పవమ్మా మునిగిపోవు చున్నదానికి మునగబెండు దొరకినట్లయినది. (పిల్లవానిని చూచి) తల్లీ ఈ పిల్లవాని నెందుకు ఇచ్చటికి ఈడ్చుకొని వచ్చితివి? ఈ దరిద్ర రుద్రభూమికి?

**తల్లి** : అవ్వా, గుడిసెలో ఎవరును లేరు: వీడు తప్ప నాకింకెవ్వరును గతి లేరు. కదనమునకేతెంచిన నా హృదయనాథుని వెదుక వచ్చితిని— ఈపాడు వల్లకాటిలోని పీనుగు పెంటలలో నేమియు కనబడదు!

**ముసలిది** : నీ నాథుడెవరి పక్షము వాడు?

**తల్లి** : పాండవుల పక్షమువాడు—నీపుత్రుడు?

**ముసలిది** ? కౌరవులవాడు

**తల్లి** : నీ కుమారుడు నా పతికి పగవాడై యుండెనా?

**ముసలిది** : ఎవరికెవరు పగవారు? నీవును నావును నడుమ పగయా?

**తల్లి** : కద్దా ?

**ముసలిది** : మనవంటి నిరుపేదలందరును తెలివిలేని వారమమ్మా పాండవ కౌర వులునేలకై పోరాడగా మన పిల్లలు వారితో వీరిలో మైత్రిచేసి నిలిచి అభిమానముకకై కొట్టుకొని చత్తురు—నా పుత్రునికి నీ పతిమీద పగయా ?——మనమిద్దరమును దుఃఖార్తులమమ్మా: రా వెదకి చూతము.

(ఇద్దరును పీనుగుల నడుమ చీకటిలో కొంతకొంతదూరములో తిరు

గుచు వెదకుదురు. ఒకచోట 'తల్లి' నిలిచి; అరచి: బిడ్డను క్రిందికి దించి, ఏడ్చును. అచట యిద్దరు భటులు ఒకరినొకరు శూలములతో పొడుచుకొని చచ్చియుండిరి. ఒకడు ముసలిదాని కొడుకు మరొకడు 'తల్లి' పతి ముసలిది రోదనము విని పరుగెత్తివచ్చును)

ముసలిది : ఏమాయెనమ్మా, తల్లీ?

తల్లి : అయ్యో, అవ్వా, చూడుమిక్కడ. నా పతిని ఈ పాపాత్ముడు పొడిచి చంపినాడు అయ్యో.

ముసలిది : అయ్యో, అయ్యో, నా కొడుకును నీపతి పొడిచి చంపినాడుకదమ్మా అయ్యో పాండవులు పాడుగాను!

తల్లి : అయ్యో, కౌరవులు పాడుగాను!

(ఇద్దరును పడి ఏడ్తురు)

## దృశ్యము-9

(కురుక్షేత్ర శ్మశానపు ఒక భాగమున పాండవుల పక్షపు చితి. భీముడు, అర్జునుడు, ధర్మరాజు, ద్రౌపది—ఎల్లరును శోక విహ్వలురై నిలిచికొని యుందురు. చితిమీద అభిమన్యుడు, ఘటోత్కచుడు—మున్నగువారి శవము లున్నవి. ఇదివరకును రాతిగుండెతోనున్న భీమునకు నేడు చితిపైనున్న ఘటోత్కచుని శవమును చూచి, దుఃఖము మితిమీరినది. అస్పష్టరోదన ధ్వని అన్ని దిశల వ్యాపించినది).

ధర్మరాజు : భీమసేనా, మొదలిడిన కార్యమును పూర్తి
చేయు, మయినది అయ్యె. చింతతో నేమగును?
చితికగ్గిపెట్టు. (భీముడేడ్చును)
నీ వీరీతి ఏడ్వగా
భీమ, ఇంకెవ్వరి తరులను ఓదార్చెదరు?

భీముడు : అన్న, హంతకుడేనటన్న దిప్పుడు తెలిసె
ఈ నాదు ముద్దుబిడ్డల శవములను కాంచి
గాంధారి ధృతరాష్ట్రు లేడ్పు లోతునుకంటి
(అర్జునుడు మున్నగు వారతనితోకూడ ఏడ్తురు)

ధర్మరాజు : వీరులైననేమి? స్థితప్రజ్ఞులు కానట్టి
మానవులు కోపమునె పౌరుషముగ భ్రమింత్రు
కోపము నశింప వెంటనె పౌరుషము కరగు.
కోపమనియెడి మద్యపానమ్ము లేక వీ
రెపుడు చంపుటకు ద్యమింపరు! చితికగ్గి
నేనె పెట్టెద—(అగ్గిపెట్టబోయి నిలుచును)
ఎవ్వరచట వచ్చెడివారు?
తల్లి కుంతీదేవి! భ్రాత సహదేవుండు!
ఎవరినో మోసికొని వచ్చుచున్నారు కద?

(కుంతీ సహదేవులు కర్ణుని తెత్తురు. అందరును ఆ దిక్కు తిరిగి నిలుతురు. భీముడు దుఃఖమును విసరి పారవేసి నిలిచి, బొమముడివైచి, చురచుర కర్ణుని శవమును చూచును)

ధర్మరాజు : సహదేవ, ఏమి ఇది?

కుంతి : ఓ బాబు, ధర్మజా, కర్ణు ఈ చితిమీదె
దహనమ్ము చేయుటకు కృపచూపు నా కొఱకు

ధర్మరాజు : తల్లి, కాల్చెడి అగ్ని కనుకంపలే, దసూ
యయు లేదు కాని, దీనికి అర్థమేమమ్మ?
తెలుపకోరెదనమ్మ
బాబు, నేనేడియును
చెప్పలే; నీవు నా కోర్కె తీర్చగవలెను.

భీముడు ; (రోషముతో) ఏమి పని, తల్లి, ఇది. మనదు కులఘాతకుని
ఈతనిని మనము కాల్చుటయ? కనుకనుమిచట;
వీడు చంపిన ఘటోత్కచుడు, అభిమన్యుండు.
(కండ్లు విచ్చి సహదేవునిచూచి)
సహదేవ, ఏమిటిది చేసెదవు! తొలగించు
మిటనుండి ఈ జంతు శవము! (కుంతి ఏడ్చును)
ఓ ధర్మజా,
రోదనకు నీవు భయమంద లయమగునేడె!

అర్జునుడు : అన్నయ్య, అభిమన్యు కాల్చు ఈ అగ్నితో
కర్ణు కాల్చగరాదు—మనకు కర్ణుండెవరు?

భీముడు : శత్రుమిత్రుండు! అభిమన్యుని, ఘటోత్కచుని
మోసమున చంపిన దురాత్ముడు!—

కుంతి : అర్జున, భీమ,
ఓ నాదు సుతులార, కై మోడ్చి వేడెదను,
చెఱగొడ్డి వేడెదను, నా ఆశ తీర్చండి!
నేను మీ తల్లినై యున్నచో—

భీముడు : తల్లియని
తెలిసియే ఇట్లు చెప్పెద

కుంతి : నేను మీ తల్లి
కాను; మరి వీనిదౌ తల్లినని తెలిసినా
కోర్కె కరుణించండి—వాదించకండి—ఓ
సుతులార (అశ్వత్థామ వచ్చును)

అశ్వత్థామ : ఓ ధర్మపుత్ర, ఓ ధర్మజా!
ఒక వీరవరు కట్టకడ కోర్కె తీర్పగా
ఇచటికేతెంచితిని వీరవరులగు మీరు
నాకు సాయము చేసి దాని నెరవేర్చవలె
కౌరవేంద్రుడు చచ్చుటకు ముందు నను పిల్చి
కర్ణు తనతోకూడ కాల్చవలెనని చెప్పి
పోయె. పోయినవారి కోర్కె బ్రదికినవారు
నెరవేర్చుటే ధర్మము-

ధర్మరాజు : అశ్వత్థామ, కర్ణుని
కొనిపొమ్ము. నీవతనికగ్ని సంస్కారమ్ము
చేయుటయె ధర్మమ్ము.

కుంతి ఓ అశ్వత్థామ:
కర్ణు ఈ మాదు చితిమీద దహించుటే
నా కోర్కె. ఈ కోర్కె కడ్డుపడకుము, తండ్రి.

అశ్వత్థామ : దేవి, కౌరవు నాస! మరి నాదు బాస!
కై మోడ్చి వేడెదను; వీడొకనుడు కర్ణుని

భీముడు : తడవేల, తీసికొని పొమ్ము, అశ్వత్థామ.

కుంతి : (భీముని దిక్కు తిరిగి చెప్పును)
ఓ భీమ
తల్లికోసరమయిన కరగనేరవు నీవు?
కాలిన శరీరమున కైదువులు గ్రుచ్చెదర?
(అశ్వత్థామ కర్ణుని తీసికొనిపోవును, కుంతి తిరిగిచూచి పడి ఏడ్చును)

కుంతి : ఓ బాబు, ఓ కర్ణ, నిన్నిందుకోసమే
కంటినా? ఊరకుంటివదేల, సహదేవ?

ధర్మరాజు : ఏమదేమది చెప్పు, సహదేవ, తల్లి క
ర్ణుని కన్నదాననని ఏడ్చుచున్నదికాదె!

సహదేవుడు : అన్న, నను మన్నించు: తల్లిగర్భమునుండి
జనియించినట్టి రాధేయుండు మనకెల్ల
పెద్దన్న!

ధర్మరాజు : (పిడుగు పడినట్లయి) ఏమి చెప్పితివీవు, సహదేవ?

భీముడు : కల్లలాడకు!

అర్జునుడు : అయ్యో: ఏమయ్యె. కడపటికి;

సహదేవుడు : విషరములు తరువాత. నే పలికినది నిజము.

కుంతి : ఓ బాబు, ఓ కర్ణ,
ఇపుడు వీరెల్లరును నీవారె, నేనే
పాపిష్ఠురాల, పరకీయనైతిని కాదె?
లోకమ్ము వీరినెవరిని నిందసేయదు.
నన్నొ, సుతు చంపుకొని తిన్న కడుపాపినని
నిందించు (ఏడ్చును)

ధర్మరాజు : తల్లి, ఏమి పొనర్చితివి నీవు

అర్జునుడు : కృష్ణా, అసత్యమును చెప్పి చంపించితివ!

భీముడు : తుదకు కలుషితమయ్యె నీ భారతరణమ్ము;
(దృశ్యమదృశ్యమగును)

## దృ శ్య ము-II

(కురుక్షేత్ర శ్మశానము. ఎక్కడ చూచినను నిరవత, చీకటి అలుముకొని యున్నవి. కాగడాల వెలుగులేదు; తిరుగాడు మనుష్యాకృతులు లేవు. అంతయు బట్టబయలు. ఆకాశపు టనంతపు నీలపటముమీద చెక్కబడ్డ లక్షోపలక్ష నక్షత్ర మందకాంతి కొంత వ్యాపించి ఘోరదృశ్యమును ఘోరతరముగా చేసినది. శ్మశానమునకు నడుమ ప్రక్కప్రక్కన రెండు భస్మరాసులున్నవి. ఒకటి పాండవపక్ష వినాశనమునకు ప్రతినిధి. మరొకటి కౌరవపక్ష వినాశనమునకు ప్రతినిధి. ఆ ఒక్కొక్క భస్మ పర్వతముమీదను ఒక్కొక్క కాలుంచి రుద్రలయమూర్తియైన మహాదేవుడు, భీమాకారుడై నిలిచి యున్నాడు. అతని తల విరబోసికొనియున్నది. కుత్తుకలోగల పాములు భయములో ముడుచుకొనియున్నవి. పులి తోలు పైన కప్పుకొనియున్నాడు. త్రిశూలమును ధరించినాడు. భస్మరాసులనుండి అప్పుడప్పుడు బూడిదను తీసికొని పూసికొనును—ఒక్కొక్కసారి పూసికొనునపుడును మహాభారతపు ఒక్కొక్క వీర పురుషుని నామధేయమును గట్టిగా చెప్పును. మధ్య మధ్య పిచ్చివానివలె అట్టహాసము చేసి కేకవేసి నవ్వును! అంతటను నిశ్శబ్దము; భీషణముగానున్నది: భీకరముగా నున్నది; గంభీరముగా నున్నది; రుద్రముగా నున్నది)




రుద్రుడు : దుర్యోధనుడు భీష్ముడు: ద్రోణుడు, కర్ణుడు అభిమన్యుడు, ఘటోత్కచుడు, భీముడు, అర్జునుడు, ద్రౌపది కృష్ణుడు:

(ముసుగువేసికొన్న అస్పష్టాకృతులు ఆ చీకటిలో బారులు తీరి వచ్చును. వారిలో మగవారు, ఆడువారు, పిల్లలు, వితంతువులు, వీరులు—అందరును ఉన్నారు. వారందరును మృతిచెందిన పాండవ కౌరవ పక్షాలవారి బంధువులు కౌరవపక్షమువారు ఒక వరుసగా ఏర్పడి మహారుద్రుని ఎడమనుండి కుడికిపోయి అదృశ్యమౌదురు. పాండవపక్షమువారు ఇంకొక్క వరుసగా ఏర్పడి కుడినుండి ఎడమకుపోయి అదృశ్యమౌదురు. మహాదేవుడందరిని చురచుర చూచుచు నిలిచియుండి మరల ప్రారంభించును. అతని ధ్వని దూరపుటురుమువలే ,గంభీరముగా మ్రోగుచున్నది; శ్మశానమౌనమును ఊంచి నిద్రపుచ్చు జోలపాటవలె నున్నది)

ఎల్లదానములు, ఎల్లధర్మములు
తుదకిక్కడకే—నా కడకే!
ఎల్ల పాపములు, ఎల్ల పుణ్యములు
తుదకొక్క నవ్వుకే-భస్మమ్ము నాకే!
నక్షత్ర ఖచితమీ అంబర వితానమ్ము
సశ్య శోభితమిద్ది పెద్ద భూమి,
హోరుహోరుమను పార మేలేని
కడలి ఈ వ్యాప్తి కడకు ఇచ్చటికె!
—కడకు ఇచ్చటికె-కడకు ఇచ్చటికె!
కాలదేశములు, జననమరణములు
జీవకోటులును,--కాటి దిక్కుకే!
కాటిదిక్కుకే-కడకు కాటికే!
నాదు పిచ్చికై ఐన ఈ సృష్టి
కడకు కడియగను-నాదు పిచ్చికే!
నాదు పిచ్చికే-నాదు పిచ్చికే!
ఇదె జగపు మొట్టమొద; లిదె జగపు తుట్టతుది,
ఇదె జగపు కట్టకడ నమ్మిక!
కడ నమ్మిక! కడ నమ్మిక!

(రుద్రుడు దృష్టిజ్వాలను సారించి ధ్యానమగ్నుడగును. శ్రీకృష్ణుడు మెల్లగా అడుగులు వేసికొనుచు గంభీరముగా ప్రవేశించును. రుద్రుని తదేక దృష్టితో చూచి పిలుచును)

కృష్ణుడు : మహాదేవా!

రుద్రుడు : (నిదానముగా కనులు తెరచి, కృష్ణుని చూచి) వాసుదేవా, వచ్చితివా?

కృష్ణుడు : వచ్చితినయ్యా, భగవన్. నీవేమి రుద్రనాటకపు టంతిమ దృశ్యాభినయమున తన్మయుడైయున్నట్లున్నాడవే!

రుద్రుడు : అవునవును, సూత్రధారా! (చిరునవ్వు నవ్వి) నీ నాటకము పూర్తి అయినదా ?

కృష్ణుడు : నీ సాయముండినచో పూర్తికాకేమి!

రుద్రుడు : నీవు రసికులకు గురుడవు. నీదు దృశ్యకావ్యపు సౌందర్యమును, గాంభీర్యమును వర్ణనచేయటకు సాధ్యము కానివి—అది పూర్ణము; నవరసపూర్ణము!

కృష్ణుడు : నీ ఒక్కని ఆవేశమున్నచో రుద్రకావ్యము సఫలము!

రుద్రుడు : వాసుదేవా, ముందింకే కావ్యమును కట్టెదవయ్యా

కృష్ణుడు : కలియుగ మహా కావ్యమును! రేపే పీఠికా దృశ్యారంభము; కలియుగ ప్రారంభము!

రుద్రుడు : రసమూర్తీ, దర్శించ నిచ్చగింతు నా కథాసంవిధానమ్ము.

కృష్ణుడు : ప్రదర్శింతును దివ్యదర్శనమును. కనుమదే మత్ప్రణీతము కలియుగ మహా లలిత కావ్యము.

(శ్రీకృష్ణుడు చేయి చూపించును. కాలపు తెరలొకటొకటి విప్పారును. రుద్రుడు ప్రసన్నుడై తిలకించును)

రుద్రుడు : వర్ణించవయ్యా, విశ్వకవీ, ఆ మిరుమిట్లుగొల్పు దృశ్యములా.

కృష్ణుడు : వర్ణింతు సతి ముఖ్య దృశ్యములు :

చూడుమదే భారత వర్షము, ఉపనిషదారామము...
గౌతమ బుద్ధుడు, మౌఢ్యనిరాసకుడు!...
అశోకుడు, చక్రవర్తి శ్రేష్ఠుడు!...
ఆసియా ఖండము!...క్రీస్తు! దీన రక్షకుడు——
యవనదేశము!...జ్ఞానులు వారు!...
రోమను చక్రాధిపత్యము...ఐరోపాఖండము...
ఆంగ్లదేశము!...యంత్ర కౌశలము! ఇదిగో...
అరబ్బీస్థానము...మహమ్మదు...కేరళము...
ఆచార్య శంకరుడు...మేధావి, సిద్ధుడు!...
మొగలు సామ్రాజ్యము...మహారాష్ట్రము...
త్రిలింగ దేశము[1]...తిక్కన మహాకవి[2]...విజయనగరము...
పాశ్చాత్య ఘోరయుద్ధము!...రష్యాదేశము...
విప్లవము...ప్రజాధిపత్యము...చక్రవర్తి వినాశనము...
విప్లవ మత ప్రచారము...చీనాదేశము...
రక్తప్రవాహము...బాంబుల్క్రీడ...రౌద్రము!...
పిశితాశాక్రాంత భారతవర్షము...దారిద్ర్యము...
దౌర్బల్యము...శ్రీరామకృష్ణ పరమహంస!...
(రుద్రుడును కృష్ణుడును నమస్కరింతురు)
సర్వధర్మ సమన్వయాచార్యుడు...వివేకానందుడు...
స్వాతంత్ర్య సంగ్రామము...అహింసావ్రతము...
మహాత్ముడు...సత్యాగ్రహము! అత్యాచారము! !...!
దౌరాత్మ్యము ! !
(రుద్రుడు శూలమెత్తును)
తాలిమి, తాలిమి, హే రుద్ర చెదపకుము కావ్యమ్ము...
ముందు కనుమయ్యా...సార్వభౌమత్వభంగము...
స్వతంత్ర భారతరంగము...సర్వ ప్రజాధిపత్యము...
సర్వసమత్వము...జగత్కల్యాణము...
భూవైకుంఠము...కనుమదే...
దూరమున, బహుదూరమున, కాలగర్భమున...

గమనిక : మూలమున 1. కన్నడదేశం 2. కవిరన్నన్ అని ఉన్నవి.

సామాన్య మానవ సంసారము...సతిపతుల శృంగారము
శిశువుల ఖేల, లీల, కావ్యము
సుమధురము...దివ్యము...సుశ్రావ్యము!

(ఉన్నదున్నట్లే దృశ్యము మాయమై, అలముకొన్న చీకటి మరింత దట్టమై, హఠాత్తుగా అత్యంత కాంతి యుక్తమగును. మాయమైన కృష్ణరుద్రుల సమ్మిశితాట్టహాసము గగన సునీల శూన్యమునుండి తరంగతరంగములుగా విన వచ్చును. కాంతి మరింత ఎక్కువగును. లయమూర్తియైన రుద్రుని నవ్వుతో సృష్టిమూర్తియైన కృష్ణుని నవ్వు లగ్నమై ఆ మహాజగద్వ్యక్తుల సుమధుర వికటాట్టహాసము శ్మశానగర్భమునుండి వెలికి వెడలివచ్చి విశ్వవ్యాప్తియగును)

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః □

# నిన్నే

## శ్రీ కావూరు పాపయ్యశాస్త్రి

నువ్వేమిటి
ఇలా
అరకు లోయలో
పరచుకున్న వెన్నెల్లా .... !
నీ కన్నుల్లో

ఆ తియ్యటి పాటలేమిటి
నాకు రాగయోగాన్ని నేర్పి
మూగవాణ్ణి చేయడానికి .... !
నీ చిరునవ్వుకు
అంతగా

నా అంతరంగాన్ని వింతగా
ఉక్కిరి బిక్కిరి చేసే
ఆ పరిమళం ఎక్కడిది .... !
అటు చూడు

స్వర్గం కాబోలు
రంగు వెలసిన కాగితం పువ్వులా
నీ అందం ముందు .... !
నిన్నే ....
ఒక్కసారి మాట్లాడవూ !
నా హృదిలోకి
వంద బృందావనాలను
ఒక్కసారిగా ఊదేలా!
వేయరాదా
ఒక్క అడుగు ఈ గడ్డిపూవువైపు!
నీ మృదుపద స్పర్శనే
అలా .... అలా ....
స్మరిస్తూ తరిస్తా !
నా జన్మానేక వేదనా భారం తీరేలా!

శ్రీ బి. డి. బి. ప్రసాదరావు

# ఆధునిక తెలుగు సాహిత్యములో "ఇమేజిస్టు" కవిత- శ్రీరంగం నారాయణబాబు

యిరవయ్యో శతాబ్దం రెండవ దశాబ్దం మొదటి సంవత్సరాలలో ఆంగ్ల దేశంలో వ్యావహారిక భాషను కవితలో జొప్పించి, కొత్త నడకలతో నిర్దిష్ట పద చిత్రణలతో కవిత వ్రాసి "ఇమేజిస్టు కవితోద్యమం ప్రారంభించాడు ఎజ్రాపౌండ్. ఆంగ్లదేశంలో ప్రారంభమైన "ఇమేజిస్టు కవితాధోరణి ప్రభావం. ఈ శతాబ్దం మూడో దశాబ్దంలో తెలుగు కవులను కూడ ఉత్తేజపరిచింది. శ్రీరంగం నారాయణ బాబు కూడా ఉత్తేజితుడై సామాజిక వికృతులను వర్ణించడం "రుధిరజ్యోతి" చదివిన వారిలో స్పందన కలుగచేస్తుంది.

"మచ్చుకి "దేశమాత"

ఎండాకాలం
ఎండాకాలం
పగళ్ళు నెగళ్ళు
మండేరోడ్డు
కాలం కాలిన
గుడ్డపేలికై
ధూళి రేగినది

అడవి ప్రాంతాలలో చలికాలంలో రాత్రిపూట దుంగలు పేర్చి మంట పెడతారు. దీనిని నెగడు అంటారు. ఈ నెగడు చుట్టూ చేరి చలికాగుతారు. గ్రీష్మ ఋతువులో పగళ్ళు ఈ నెగళ్ళులా తీక్షణంగా వున్నాయి.

విలయ వేళల
విహాయసాలు
విస్ఫులింగములు
వర్షించాయి.

కణకణలాడే ఎండల్లో కళ్ళు జిగేలుమని ఆకాశంనించి నిప్పురవ్వలు రాలుతున్నట్లు గోచరమవుతుంది. ఈ విస్ఫులింగముల వర్షంలో కాలం కాలిన గుడ్డపేలికై ధూళి రేగింది. ఈ తాపమెక్కుస్తున్న సమయంలో కవికి నెలత ఒకర్తె బిక్షాపాత్రికతో దర్శనమిచ్చింది. ఎలాగ?

అంటీ అంటని
ఆమె శరీరపు
చాలీచాలని చీరను
తొంగిచూచే మానం"తో
గుక్కెడు అన్నం
గుక్కెడు నీళ్ళ
స్వాతి వానకే
ముత్యపు చిప్పై
కరువే రూపం దాల్చి
కడుపే చెరువై ఏడ్చి.

నెలత అంతర్వాతావరణం జఠరాగ్నితో మండుతుంది. బాహ్యవాతావరణం సూర్యాగ్నితో మండుతుంది. మానం అంటీ అంటని చాలీచాలని చీరను తొంగి చూస్తుంది. ఈ వాతావరణంలో

చచ్చిన బాలింతలు
వెచ్చని చనుబాలతీపి
మచ్చరించు కంఠముతో
ఆకలి! దాహం!
అన్నం! అన్నం! అంటూ.
అటమటించింది.

బాలింత చనుబాలు వెచ్చగా తియ్యగా వుంటాయి. అయితే చచ్చిన బాలింతకి చేపులుండవు. వెచ్చని చనుబాలు చేపవు. చచ్చిన బాలింత రొమ్ముపై పడి ఆకలి, దాహంతో పాలకోసం కింకపెట్టి అటమటిస్తున్న పురిటిపిల్లలా బిచ్చకత్తె ఆకలి! దాహం! అన్నం: అన్నం అని అరుస్తుంది. అటమటిస్తుంది. పురిటి పిల్లకి చచ్చిన బాలింతనుండి పాలురానట్లే బిచ్చకత్తెకు అన్నం రాలేదు. దాహోపశమనం కలగడంలేదు. ఎంత హృదయవిదారకమైన వాతావరణం! జీవి మనిషైతే ఈ దృశ్యానికి మానవత్వానికి పెల్లుబికి ప్రవహించాలి. కాని కాలిన గుడ్డపేలికలైన ఈ కాలంలో సమాజ శక్తులు

బలి ప్రముఖుల
పాతర మా భూమి
అతిథి పూజలకు
మొదటి వారము
కర్ణుడు మావాడంటూ
గంతులు వేసే
దేశనాయకులు.
అన్నపూర్ణను
ఆరాధించే ముగుదలు
జాలకములపై
తడిపిన వట్టివేళ్ళ
తట్టీలు కట్టిన ఇండ్ల
ద్వారముఖమ్ములు
బంధించేరు
కన్నులుమూసి
నిద్రించారు.

విష్ణుమూర్తి బ్రాహ్మణ వడుగులా వచ్చి దానమడిగితే బలిచక్రవర్తి తన్నుతానే అర్పించుకుని పాతాళానికి పాతరగా పోయేడు. శిబి చక్రవర్తి దేవత బారి నుండి పావురాన్ని రక్షించడానికి తన తొడమాంసము కోసియిచ్చినా సరిపోక తన్నుతానే దేవతకు ఆహారంగా అర్పించుకున్నాడు. భారత ప్రముఖుడు కర్ణుడు తనకు రక్ష అయిన కవచకుండలాల్నే దానమిచ్చేడు. ఇల్లు కట్టుకుందుకు పుల్లలడిగితే తన నివాస గృహాన్ని కూలదోయించి బీద బ్రాహ్మడికి కలప దానమిచ్చాడు. అన్నపూర్ణ నిత్యం అన్నార్తులకు అన్నం వడ్డిస్తుందని హైందవుల

నమ్మకం. ఇందుకే అన్నపూర్ణ చేతిలో వడ్డించే గరిట వున్నట్లు అన్నపూర్ణ ప్రతిమను మలుస్తారు. ఈ అన్నపూర్ణను ఆరాధించే స్త్రీలు, బలిచక్రవర్తి, కర్ణుడు మొదలగు ప్రముఖులంతా మా వాళ్ళని గొప్పలు చెప్పుకుని గంతులు వేసే దేశ నాయకులు నెలత ఆకలి, దాహం అని అలమటిస్తూ అరుస్తుంటే ఇళ్ళ కిటికీలకు తడిపిన వట్టివేళ్ళ తడికలు కట్టుకొని చల్లని వాతావరణం కల్పించుకొని సుష్టుగా కడుపు నిండా తిని, తలుపులు బిగించుకొని, హాయిగా నిద్రపోతున్నారు. బిచ్చకత్తె ఆర్తనాదం వారికి వినిపించదు. ఈ దోపిడీ వ్యవస్థను చచ్చిన బాలింతతో పోల్చి వర్ణించడం ఎంత హృదయవిదారకమైనది. ఏ ఆధునికకవి చేయనివర్ణన. బహుశః ఏ పాశ్చాత్యకవి వర్ణించని కవనం. నారాయణబాబు ఈ కవితను 1937లో అప్పటి వేసం కాలంలో ధనవంతులు కిటికీలకు వట్టివేళ్ళ తడకలు కట్టుకోడం తరచు కనబడే వాస్తవదృశ్యం. మనకు స్వరాజ్యం చేకూరింది 1947లో. ఇప్పటికి ముప్పైఏడుసంవత్సరాలైంది. అప్పటి ధనవంతులు కిటికీలకు వట్టివేళ్ళతట్టీలు కట్టుకుంటే ఈనాడు ధనవంతుల ఇళ్ళకు ఎయిర్ కండిషనర్లు అమర్చి వుండడం వాస్తవం. కాని అప్పటి బిచ్చకత్తెకు ఇప్పటి బిచ్చగత్తెకు తేడా ఏమీ లేకపోవడమూ వాస్తవమే.

దేశం అంటూ
దేవుళ్ళంటూ
కొలిచే కళ్ళకు
బానిసత్వమే
ప్రబలింది.

ఈ పీడితవర్గ సమాజం విజృంభణకు కినుకచెంది జఠరాగ్ని తాపంతో ఎండవేడిలో ఆమె కన్నులు కాలిన బండి కమ్ములులా ఎర్రనై చూపులు వడగాల్పులా తీక్షణం అయ్యాయి.

రెండు కన్నులు
కాలిన బండి కమ్ములు
................
కాలిన మారుని తూపులు
కలికి చూపులు
అగ్నివీణయై
అలాపించింది
ఖణేలుమన్నవి.
కకుప్పాళికలు:

కకుప్పు అంటే దిక్కు. కకుప్పాళికలు దిగంతాలు. బిచ్చగత్తె అగ్నివీణాలాపనకి దిక్కులు పిక్కటిల్లాయి? దిగంతాలు దద్దరిల్లాయి. అయినా దేశం అంటూ దేవుళ్ళంటూ కొలిచే దోపిడీవర్గ సమాజం కళ్ళకి బానిసత్వపు బలం వుంది. డబ్బుకి, స్వార్థానికి దాసులై చల్లని గదులతో కడుపారతిని హాయిగ నిద్రపోతున్నారు, వారికి బిచ్చకత్తె ఆలాపన వినబడదు.

ఉన్నాడా చిన్ని కృష్ణుడు?
అనసూయేదని
అరుంధతేదని
ప్రశ్నించింది.

ఇక్కడ పతితకి హైందవపురాణగాథలు జ్ఞప్తికి వస్తాయి. కృష్ణుడు భగవంతుడని, హైందవుల నమ్మకం. భారత కథనంలో ఏకవస్త్ర ద్రౌపది, వస్త్రాపహరణం జరుగుతున్నప్పుడు కృష్ణుడు ఆమె మాన సంరక్షణ చేశాడు. అత్రిమహాముని భార్య అనసూయని పరీక్షించడానికి త్రిమూర్తులు అతిథ్యానికి వచ్చి ఆమెను దిగంబరంగా ఆతిథ్యమివ్వమని కోరితే ఆమె తన శక్తిచేత త్రిమూర్తులను చంటిపిల్లలుగా మార్చి ఆతిథ్యమిస్తుంది. అంతటి పాతివ్రత్యం ఆమెది. ఇంక అరుంధతి హరిజనకన్య. వశిష్ఠ మహాముని వివాహమాడకోరి శీలపతులకొరకు పరీక్ష పెడతాడు. ఇసుక అన్నంగా వండిపెట్టే యువతిని వివాహమాడ కోరుతాడు. ఎవరూ ధైర్యంగా ముందుకు రాలేకపోతే అరుంధతి తాను ధైర్యంగా ముందుకువచ్చి, తన శక్తివల్ల ఇసుక రేణువుల్ని బియ్యపు గింజలుగా మార్చి అన్నం వండిపెడుతుంది. ఆమె శీలానికిమెచ్చి అరుంధతిని వివాహమాడతాడు. ఇంతటి శక్తిమంతురాలు కనుకనే ఈమె నక్షత్రమండలంలో తారయిందని ఈ పతివ్రతామతల్లిని చూచి తరించాలని కొత్తగాపెళ్ళైన దంపతులకి అరుంధతీనక్షత్రాన్ని చూపిస్తారు. అరుంధతి కనపడలేదు కాని ఆరువేల అప్పు కనిపిస్తోందని తెలుగువారి నానుడి. భగవంతుడైన చిన్ని కృష్ణుడు, పతివ్రతా మతల్లులు, అనసూయ, అరుంధతి, తన మానం బజారున పడుతుంటే వున్నారా? వుంటే ఎక్కడికి పోయేరు? అని బిచ్చకత్తె ప్రశ్నిస్తుంది. కాని వీరి భక్తులమని చెప్పుకుంటూ ధనికవర్గ సమాజం స్త్రీలు, దేశ నాయకులు చల్లని గదులలో సుష్టుగా తిని నిద్రపోతున్నారు. ఇది మన హైందవ సమాజ సౌభాగ్యం కాదు - దౌర్భాగ్యం.

తమ జాతికి చెందిన బిచ్చకత్తెను చూసి మానవులకే జాలి కలగని సాంఘిక వాతావరణంలో మనుషులచే నీరసంగా చూడబడే కొన్ని జీవులు స్పందించాయ్.

వీధి కాలువను
బురదనీటిలో
విశ్రమించిన
శ్వానాధుడొక్కడు
నిశ్వసించాడు.

ఎండవేడికి తట్టుకోలేక కుక్కలు వీధి కాలువలో బురదనీళ్ళలో పడుకోవడం మనందరికు కనిపించే సామాన్యదృశ్యమే! అలా పడుకున్న కుక్క బిచ్చకత్తె దయనీయ స్థితికి జాలిపడి నిట్టూర్చిందట. శ్వానాధుడంటే కాలభైరవుడు శివుడు. ఈ శ్వానాధుని నిట్టూర్పు తాండవమాడే ముందు నిట్టూర్పు. కుక్కకు గౌరవప్రదంగా శ్వానాధుడంటూనే శివతాండవాన్ని సూచిస్తున్నాడు. దిగంబరుడు తాండవమాడితే మిగిలేది దక్షవాటికే.

మరొక నాలుగుకాళ్ళజీవి
ముందర కాళ్ళకు
బంధంతో
కాకితమ్ములే
కసువని మేస్తూ
చక్రమణం చేసే
చక్రీవంతపు చక్షులు
చిలుప చిలుపగా
తొలకరించినవి



చక్రీవంతం అంటే గాడిద. బట్టలమూటలు మోయడానికి రజకులు గాడిదల్ని పెంచుతారు. ఈ కష్టజీవులకు ప్రత్యేకంగా మేత పెట్టరు. వూరిమీద తిరిగి మేయవలసిందే. పట్టణాలలో రోడ్లమీద పచ్చిక దొరకదు. పారేసిన చిత్తుకాగితాలు తప్ప. చిత్తుకాగితాలే కసువని మేస్తూ తిరుగుతున్న గాడిద బిచ్చకత్తెను చూసి కళ్ళనీళ్ళు పెట్టుకుంది. ఈ కన్నీటిబొట్లని తొలకరి చినుకులతో పోల్చడం విశిష్టం. నవ్యత. తొలకరించడం తెలుగు నుడికారం. ఎంత రమణీయచిత్రణో గమనించండి.

యింకొక జీవి,
తోడులేని
నీడలేని
ఆదుదాని
చూడజాలక
తరుశాఖల్లో
తల క్రిందై
తపించిపోయి
ఋషి పక్షొకటి
నేలకు వాలింది.

మండుటెండలో చెట్లకొమ్మలలో ఋషిపక్షులు తలక్రిందుగా వేళ్ళాడుతూ ఎండవేడికి తట్టుకోలేక చచ్చి రాలిపడడం గ్రీష్మఋతువులో తరచు కనిపించే దృశ్యం. అయితే ఋషిపక్షి తోడులేని నీడలేని బిచ్చకత్తె దారుణస్థితిని చూచి తపించిపోయి నేలకు వాలింది. ఎంగెల్స్ ప్రసాదించిన కాస్తంత నీడలో బ్రతుకుతూ, బడుగువర్గాల జీవనసరళికి తపించిపోయి "దస్‌కేపిటల్" వ్రాసి కర్తవ్యం ప్రబోధించిన కారల్‌మార్క్సు పతితకు జ్ఞప్తికి వస్తాడు.

బిచ్చకత్తె అగ్నివీణయై ఆలాపిస్తూ
ఉసురుసురైంది
ఉమ్మరించింది.
అసువులువీడి
చచ్చిన దేశమాతయై
చాప చుట్టగ
నేలకు వాలింది.

ఆకలి, దాహంతో కొట్టుమిట్టాడి చలువలు కమ్మి ప్రాణం విడిచి చాప చుట్టలా నేలకు వాలింది. చాపచుట్టలా నేలకు వాలడం తెలుగు నుడికారం. గురజాడ, దేశం అంటే మనుషులన్నాడు. బిచ్చకత్తెను అందుకే దేశమాత అంటున్నాడు నారాయణబాబు. హిందూదేశం దౌర్భాగ్యం అంతా యీ ఒక్కమాటలో యిమిడి వుంది. యిదే నారాయణబాబు కవన విశేషం.

భూపతి ఆజ్ఞను
భూమి పుట్టువు

చిచ్చున జొరబడ్డాది
శీలం కోసం ఆనాడు

తన శీలం నిరూపించుకోడానికి రాముడి ఆజ్ఞను సీతమ్మ అగ్నిప్రవేశం చేసింది ఆనాడు. కాని

మట్టిప్రమిదలో
వత్తై కాలిందీ
మానిని యీనాడు.

అగ్నివీణయై ఆలాపిస్తూ కర్తవ్య ప్రబోధిస్తూ ఎందుకు?

ఆకలి దీర్పని
మా నంగప్పని
దేశం కోసం

కవి, బిచ్చకత్తెను దేశమాతగా దర్శిస్తూ "అకలి దీర్పని, మానం గప్పని దేశం కోసం మట్టిప్రమిదలో వత్తై కాలిందీమానిని ఆనాడు" అని సాధారణీకృతిని కావించడంలో కవితోపాటు మనం స్పందించి నిట్టూరుస్తాం. కర్తవ్యోన్ముఖుల మవుతాం. ప్రకృతి సహజ దృశ్యాలను చూస్తూ వాటితో హైందవ సంప్రదాయాలను, ఆచారాలను నారాయణబాబు వ్యక్తం చేస్తాడు. పురాణ హైందవ గాథలను సంస్కృతులను జ్ఞప్తికి తెస్తూ జీర్ణమైన ఈ సంస్కృతులను పట్టుకుని వేళాడుతూ సమాజంలో మార్పును కాంక్షించి ఆహ్వానించకపోడాన్ని నిరసిస్తాడు. తన కవితలలో పురాణగాథలను క్లుప్తంగా ఉటంకిస్తూ ప్రస్తుత సమాజంలో వాటి నిస్సారతను ఎత్తిచూపుతారు. ఈ పద్ధతి యితని కవితలలోని ప్రత్యేకత— అనితరసాధ్యం.

"వస్తువుని సామాజిక విమర్శనాదృష్టితో తరచి తరచి చూడవలసి వుంటుంది. సమాజాన్ని ఎక్కడికక్కడ విమర్శించడం వాస్తవికవాద లక్షణం. వస్తు వ్యాకరణాలతో ఆగక విప్లవ పథాలను పడుతుంది. రీతిలోను, వస్తువులోను సరికొత్తదనం కనిపిస్తుంది. ఈ లక్షణం నారాయణబాబు కవితలో ప్రస్ఫుటం. నోటికి పట్టే ఛందస్సులతో శ్రీశ్రీ పరుగులు తీస్తాడు. తన లక్ష్యాన్ని ప్రత్యక్ష పద్ధతిని వ్యక్తం చేస్తాడు. నారాయణబాబు పరుగులో ఉద్వేగం లేదు. 'అతనిది పరోక్ష పద్ధతి, కాని భారత సాంప్రదాయం నారాయణబాబు కవితలో చక్కగా జాలువారుతూ వుంటుంది. ఎవరూ చెప్పని పద్ధతిని చెప్పడం అతనికి సరదా. శబ్దార్థాలతో కుదించి సొగసైన విగ్రహాలను నిర్మించే శిల్పి. క్లుప్తత యితని పద్ధతి. పది మాటలలో చెప్పవలసినది ఒకమాటలో చెప్తాడు. ఈ శిల్పం సాధారణులకు అలవడేది కాదు. పరిపూర్ణాకృతితో అతని వర్ణ్యమాన వస్తువులు కనుల ఎదుట మసలుతాయి. శ్రీశ్రీ స్థూలదృష్టికి దొరుకుతాడు. నారాయణబాబు కొన్ని తావులలో సూక్ష్మదృష్టికి వినాస్పష్టం కాడు. "ఇమేజిస్టు" కవితకు యితను ప్రాణం పోస్తాడు." రుధిరజ్యోతి ప్రస్తావనలో ఆచార్య రోణంకి వారి యీ మాటలు గమనార్హం. "దేశమాత" ఈ విమర్శకు దర్శనం.

ఆధునిక తెలుగు సాహిత్యంలో బిచ్చకత్తెను వర్ణించిన నాళం కృష్ణారావు గారు 'పేదరికమింత యోర్పు నేర్పినదే తల్లీ! అని జాలిపడ్డారు. భిక్షువర్షీయసి ని వర్ణించిన శ్రీరంగంశ్రీనివాసరావుగారి వెర్రిగాలి ఆ అవ్వేమరణిస్తే ఆ పాపం ఎవరిదని ప్రశ్నిస్తూ వెళ్ళిపోయింది. ఎముకముక్క కొరుక్కుంటున్న కుక్క ఏమీ అనలేదు. తొండ ఒక ఈగను పడేసుకొని తొందరగా తొలిగింది. ఎగిరొచ్చిన ఎంగిలాకు పాపం నాదికాదంది. కాని నారాయణబాబు 'దేశమాత'ను చూచిశ్వానాధుడు నిశ్వసించాడు. చక్రీవంతపు చక్షువులు చిలుప చిలుపగా తొలకరించాయి. ఋషి పక్షి తపించిపోయి నేలకు వాలింది. దేశమాత తప్పంతా ఈ పెట్టుబడిదారీ సమాజందేనని అగ్నివీణయై ఆలాపించింది. నారాయణబాబు ఈ గీతం సద్యోఫలితం. విద్యుద్దీపం వెలుగులో గదిలో ప్రేయసి కంఠతమియాలని వ్రాసిన ఖ్యాతి గడించే భావగీతం కాదు. విప్లవభావగీతం, ఈ పశ్చిమానిలపుపాటే గడ్డిపరకకి – కాకాసురుడి కథ జ్ఞప్తికి తెచ్చి, మన్నుసత్తువ తెలిపి, గర్జింప చేసింది. యిందుకే నారాయణబాబు జ్వాలనాలలనా ప్రియుడు. విప్లవఋషి. విద్రోహకవి. ఆధునిక తెలుగు సాహిత్యంలో "ఇమేజిస్టు" కవితకు ప్రాణం పోసేడు. దేశంలో పెట్టుబడిదారి వ్యవస్థ బ్రతికున్నంత కాలం "దేశమాత" దర్శనమిస్తూనే వుంటుంది.

ఈ వ్యాసరచనకు ప్రోత్సహించిన నా ఆచార్యులు రోణంకి అప్పలస్వామి గారికి అభ్యుదయవాది, నా ప్రియమిత్రుడు, పెక్కులి జూనియర్ కాలేజీ ఆంగ్ల సాహిత్యోపాసకుడు నిష్టల వేంకట రమణమూర్తికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు...



# మేఘేశ్వరుర మందిరం

ఇచ్ఛాపురపు రామచంద్రం





ఇదిగో...యిలాటప్పుడే-జీవిత స్వరూపం - అందకుండా పొంద కుండా...ఎదుట నిలిచి వెక్కిరించేది. వేనోళ్ళతో నవ్వేది. నీకేం "తెలుసోయ్ వెర్రిమొహమా అని ఎకసక్కెమాడేది.

కాకపోతే ఏమిటిది?

ఈ వోట మేమిటి?

* * *

భోజనంచేసి కూర్చున్నాను-ఇంగ్లీషు నవల పట్టుకొని కల్పనలో పటిష్టత నన్ను మిగిలిన వన్నిటినీ మరపించి—పుస్తకంలో లీనం చేసింది.

పది కొతుందేమో...వొచ్చాడు విశ్వం.

ఎలాగ?

చిన్న తూలుడు ... మందహాసం...మసాలావాసన ... మల్లెపూలదో మరలాటి సెంటుదో మరో వాసన. రాత్రి పది గంటలకి అతను రావడమే ఒక ఆశ్చర్యమయితే-అతని మాటలు మరీ ఆశ్చర్యం గొలిపాయి.

"నేను-చావడానికి వెళ్తున్నాను. చివరిసారిగా నిన్ను చూసి-చెప్పి పోదామని వొచ్చాను. గుడ్ బై ఫరెవర్"

వొళ్లు మండింది నాకు...నవలా భంగం కలిగించినందుకుకాదు. అతని మాటలకి. అతనికి ఐశ్వర్యముంది. అందమయిన భార్య ఉంది. అనుభవించే వయసుంది. మరేమిటి పిచ్చి మాటలు?

"మందెక్కువయిందా?" మందలిస్తున్నట్లడిగాను.

"నిజంగా మందెక్కువయింది. విందెక్కువయింది. పొందూ

ఎక్కువే అయింది. ఎక్కువ మాటలెందుకూ?...జీవితమే ఎక్కువయింది."

"అంటే?" తెల్లమొహంవేసి చూశాను.

"అంటేనా? అర్థంకాలేదూ? నువ్వేం రచయితవి? ఇంక నా జీవితంలో అనుభవించడానికేమీ కనిపించక ఆత్మహత్యచేసుకోబుద్దేస్తూందని. అన్ని రుచులూ చూసేశాను. ఇంక బతికినా మానినా ఒకటే. విసుగేస్తూంది. నేనుండి లాభమూ లేదు. లేక నష్టమూ లేదు ప్రపంచానికి. ఎందుకి వ్యర్థ జీవితం జీవించాలి?

గుడ్ బై...ఫరెవర్..."

నామాట వినిపించుకోకుండా...నన్నసలు పట్టించుకోకుండా...అలాగ మొండిగా...గుడ్‌బై చెప్పేసి అతనయితే వెళ్ళిపోయాడు కానీ—నేను ఆలోచనలో పడ్డాను పుస్తకం వొదిలి.

అన్నీ అంది అతనికి వైరాగ్యం వొస్తే—
ఏదీ అందక నాకు వైరాగ్యం రావాలి. కాని—రావడంలేదు!

భార్య ఉంది–సుఖపెట్టకుండా ... సుఖపడనివ్వకుండా. డబ్బులేదు. వయసూ లేదు. నేనుండి ప్రయోజనమూలేదు, లేక నష్టమూ లేదెవరికీ. ప్రపంచం నాకు కాని నేను ప్రపంచానికి కానీ యివ్వవలసిందీ యివ్వగలిగిందీ ఏమీ కనిపించదు. మరి—నేనెందుకు బ్రతుకుతున్నాను?

ఎలా బ్రతుకుతున్నాను?

ఏం చూసుకుని?

ఈ ప్రపంచానికి నా వల్ల చిన్నమెత్తు ఉపయోగంలేదు. నిజంగా నాది వ్యర్థ జీవితమే. మూసినా తెరచినా ఒకటే అయిన గ్రుడ్డి కంటి తీరు.

న్యాయంకామూఅన్నీ ఉన్న అతను లేక–

ఏమీలేని నేనే యీ ప్రపంచంనుంచి...పెరవారికి చోటొసంగుచూ... తొందరగా నిష్క్రమించాలేమో.

రాత్రి గడుస్తూంది.

ఆలోచనలు తెగడం లేదు.

నీటికి నాచు తెగులు...మాటికి మాట తెగులు లాగా ఆలోచనకి ఆలోచన తెగులేమో.

నవల వొదిలి—ఆలోచనల అంతం చూస్తున్నాను.

అర్ధరాత్రి గడిచిందనే గమనించలేదు.

అలాగే...వరండాలో... విద్యుద్దీపంకింద...వాలు కుర్చీలో...ఆంగ్ల నవలని గుండెలమీద పెట్టుకొని ఆలోచనల ఆకాశంలో...

త్రుళ్ళి పడ్డాను.

నిశ్శబ్దం–చిన్న శబ్దాన్ని పెద్దది చేస్తుంది.

ఆలోచనలు—భంగపడితే—మనిషికి త్రుళ్ళిపాటు కలిగిస్తాయి.

కళ్లు విప్పి చూశాను.

గోడకు కొట్టిన బంతిలా వొచ్చేసిన విశ్వాన్ని చూసి—నవ్వాను.

"భయమేసిందా తీరా ఆ క్షణం వొచ్చేసరికి?"

"భయమా! నాకా! హుఁ. చావబోయేవాడికి సముద్రం మోకాళ్ళోతు."

మరెందుకు చచ్చిపోలేదు నువ్వు?"

"జీవితాని కర్థం తెలిసింది."

ఆత్రంగా అడిగాను. "ఏమిటి? జీవితమంటే ఏమిటి?"

"అర్థం చేసుకో..." అని ఉపక్రమించాడు.

"అందంగా...హాయిగా చచ్చిపోదామని...వెన్నెలలో...ఊరి చివరకు...ఏటి అవతలకు బయలు దేరాను. ప్రకృతీ...వెన్నెలా...పరిసరాలూ మహా బాగున్నయ్. ఆ యిళ్ళ వరుస దాటానో ఊరు దాటినట్లే. వంతెన దాటేసరికి...

"మాష్టారూ?"

"ఊఁ"

"చిన్న సహాయం చేసి పెట్టరూ?"

"ఏమిటి?" పోన్లే మానవుడనుకుని అనుగ్రహించాను.

"మా పాపకి సీరియస్‌గా ఉంది. ఇంట్లో ఎవరూ లేరు. నేను ఊళ్ళోకి వెళ్ళి డాక్టర్ని తీసుకు వొచ్చే వరకూ...ఓ అరగంట...పాపకి సాయంగా ఉండరూ కనిపెట్టుకొని? ప్లీజ్—"

"దానికేముంది? అలాగే పదండి"

బ్రిడ్జి పక్కన—డౌనులో—ఆ యింట్లోకి నడిచానతనితో.

"ఆ గదిలో ఉంది పాప—వేగంగా డాక్టర్ని తీసుకు వొచ్చేస్తాను పాపకసలే భయం. నేను వొచ్చేలోగా వెళ్ళిపోకండేం పాపని వొంటరిగా వొదిలి? థాంక్యూ–" అతను హడావిడిగా వెళ్ళిపోయాడు.

నేనా గదిలోకి నడిచాను.

దీపం వెలుగులో–మంచంమీద—

కెవ్వుమని కేకవేయకుండా ఎలా ఉండగలిగానో ఆ దృశ్యం చూసి.

నైతికంగా—అతని కిచ్చిన వాక్కుకి కట్టుబడబట్టి అక్కడ అతను డాక్టర్ని వెంటబెట్టుకు వొచ్చేవరకూ ఉన్నాను కానీ–లేకపోతే ఆ పాపని చూసిన తక్షణం అక్కడనుంచి పరుగెత్తి పారిపోయేవాడినే.

డాక్టరు–ఆ పాపకి యింజక్షనిచ్చి వెళ్ళిపోయాడు.

నాకు–జాలేస్తుందా మానవుడిమీద.

ఎందుకా పాపమీద అతని కా మమకారం?

ఆ పాపలో–ఏముందని? పదిహేనేళ్ళ వయసట కానీ–పదినెలల పాపాయి సైజులోకూడా లేదు శరీరం. కాళ్ళూ చేతులూ అవి చీపురు పుల్లలన వొచ్చయితేవాటినీ అనవొచ్చు. కేక తప్ప మాట రాజాలదానోట. కదలలేని—మెదలలేని—మాంసపు ముద్ద. అదీ ఆ పాప. దిష్టిబొమ్మకంటె వికృతంగా—పిశాచపు పిల్లలా భయంకరంగా–

ఉండబట్టలేక అడిగేశాను. "ఎందుకింకా ఆమెకోసం మీరు తాపత్రయ పడతారు? జీవించి లాభమేమిటి? మీరు డాక్టర్ని తీసుకురాకపోతే–పాప కచ్చితంగా చచ్చిపోయేదికదా. బతికి బావుకునేదేమీలేదు. చచ్చి పోవడమే మేలూ సుఖమూ కదా అటువంటి జీవులకి—"

లోపలనుంచి–కెవ్వున–యిల్లెగిరి పోయేలా కేక. ఆ పోలియో పాపకింత కంఠముందా? ఆశ్చర్యపోయాను.

"ప్లీజ్–దయచేసి–చావు–మృత్యువు–మరణం–అనే మాటలు అనకండి. పాప చాలా భయపడి–గోల చేస్తుంది. ఊఁ–లేదమ్మా–లేదు–నీ గురించి కాదు–నువ్వు చిరంజీవివి. నీకేమమ్మా–హాయిగా కలకాలం బతుకుతావు." అంటూ పాప దగ్గరికి పరిగెత్తాడా మానవుడు.

నా ఆశ్చర్యానికి అవధి లేక పోయింది.

కన్నతల్లే వదిలేసిపోయినా–ఆ పాపని సాకుతున్న యీ మానవుడే విచిత్రమనుకుంటే– కదలలేక–మంచంలో పడుంటూ–ప్రతిపనికి అతనిమీద ఆధార పడుతూ–పరాధీనంగా– శాపగ్రస్తలా–బతుకుతున్న ఆ పాప–చావుకి భయపడడం

# జీవితం

## శ్రీ సడ్లపల్లె చిదంబరరెడ్డి

పాఠాలకు
అధ్యాయాలకు
చిత్రాలకు
విచిత్రాలకు
పుటలకు
రసాలకు
పొందు లేని పుస్తకం !
ప్రతి మనిషికీ ఒక భూషణం !!
చదువు దామంటే
కనిపించని అక్షరాలు
కనిపించినా —
కొరుకుడు పడని పదాలు
నానార్థాలు
అనర్థాలు
ప్రశ్నార్థకాలు
సంశయ పరంపరలు !!
మూసేద్దామంటే
మూలతో సేద్దామంటే
చుట్టూరా వెక్కిరింతలు
అవహేళలను
పదం పదంలో సమస్యలు
నోరు పెకలని పరిస్థితులు !!
రాత్రీ పగలు తిరగేసినా
ముగిసినట్టే కనిపిస్తూ
దానుగెద్దు బాటలాగ
భూగోళం కక్షలాగ
చుక్కల లెక్కింపు లాగ
ఎడారి దారి లాగ
అక్షయమైన పేజీలు
అవతరిస్తూనే ఉంటాయి
అందరి చేతుల్లోనూ
విశేషం గానే
తొంగిచూస్తూంటాయి
తమ పుస్తకం వరకూ
అందరూ విద్యార్థులే !
ఎదుటివారి కెరిగించడంలో
అందరూ ఉపాధ్యాయులే !
ప్రతి వాడూ కాపీ మాష్టారు
ప్రతి లైనులో కొట్టి వేతలు
సవరణలు
ఉదాహరణలు
వ్యాఖ్యానాలు
తన దానికి దీటు మరోటి లేదు
అన్నింటికీ తనదే ఆదర్శం
అన్నదే అందరి భావం !!
ఎన్నో జవాబులు
ఒకే సమస్యకు
ఒక్క సమస్యకూ
దొరకని సమాధానాలు — అసంపూర్ణాలు
ఆ పుస్తకం నిండా !!
అందుకే ఆ పుస్తకాన్ని "జీవితం" అన్నారు

మరో మహా విచిత్రం.

ఈ జీవితంలో-ఏం కనపడుతుందామెకు?

ఆ పోలియో పాప-మంచానికంటిపెట్టుకున్న మాంసపు ముద్దకి-జీవితంలో-భవిష్యత్తులో ఏం కనిపిస్తుంది? ఇవాల్టినుంచి- రేపటివేపుకి-ఏది ఆకర్షిస్తుంది.

ఆ రోగిష్టి పాపే చూడగలుగుతున్న జీవితాన్ని - జీవితంలోని ఆకర్షణని-అన్నివిధాలా సమర్థుడి నయిన నేనెందుకు చూడలేక పోతున్నాను?

ఆమె-జీవించాలని అంత తీవ్రంగా ఆరాటపడుతుంటే నేనెందుకు జీవితాన్ని చాలించాలనే విసుగుకి లోనయ్యాను?

గుడ్డివాడు చూడగలుగుతూ - కళ్ళున్నవాడు చూడలేకపోతున్నట్లు-విచిత్రంగా లేదూ?

నాకు పౌరుషం వొచ్చింది.

ఈ జీవితంలోని ఆకర్షణ ఏమిటో తేల్చుకోవాలనిపించింది

తేల్చుకుందామన్న పట్టుదలతో-"

తిరిగి వొచ్చేశాడు-చచ్చిపోకుండా

అదీ సంగతి

నాకు పట్టరాని ఆనందం కలిగింది

విశ్వాన్ని కౌగలించుకున్నాను ఆప్యాయంగా.

సంతోషం ఉక్కిరిబిక్కిరి చేస్తూంటే- "నీకు చాలా కృతజ్ఞతలోయ్" అన్నానతని చేతులు పట్టుకుని

ఈసారి తెల్లబోవడం అతనివంతయింది

"దేనికి?"

నవ్వాను. నువ్వు బ్రతికి-నన్ను బ్రతికించావు"

ఇంకా వెర్రి మొహం వేసుకునే ఉన్నాడతను.

అతనికి నేనింక ఏమీ చెప్పదలచుకోలేదు. నా ఆలోచనలూ అవి నన్ను తీసుకువెళ్ళిన దూరమూ - విశ్వంలాంటివాడే జీవితంమీద విసుగుపుట్టి చనిపోతే నేనెందుకు చెప్పడం?

అతనే అర్థం చేసుకుంటాడు చేసుకోగలిగితే

(18 వ పేజీ తరువాయి)

"యెందుకలా నవ్వుతావ్? ముప్ఫయి అయిదేళ్ళ అమ్మాయి రిటైర్డ ఉద్యోగిని పెళ్ళి చేసుకోవడం తమాషాగా కనిపిస్తోందా నీకు?"

"ఆవిడగారి కంతకంటే మంచి సంబంధమెక్కడ దొరుకుతుంది? సుకుమారిగారిని చూసి మన మీనాక్షి యెలా అసూయ పడుతోందో తెలుసా?"

"ఘోరం-" మానస భరించలేక పోయింది. "అయినా అన్నీ ఇలాంటి ఏడుపుగొట్టు కబుర్లే చెబుతావేమిటి నాకు?" చీదరించుకొంది.

"నువ్వడిగిన విశేషాలే గదా చెబుతున్నాను-" జలజ బిక్కమొగం పెట్టింది.

"నేనిక వెళ్తాను-" అంటూ మానస పైకి లేచింది.

"యెక్కడికి?" అంది జలజ.

"యెక్కడికేమిటి? ఇంటికి-"

"వచ్చిన పని అయిపోయిందా అప్పుడే!"

మానస సమాధానం చెప్పలేదు.

క్యాంటీనులోనుంచీ బయటపడి, కాలేజీ మైన్ బిల్డింగు దాటి, ముఖద్వారం దగ్గరికొచ్చి నిల్చుంది.

స్టాండు దగ్గర బస్సు కోసం నిల్చున్న అమ్మాయిలు ఆర్టీసీపైన జోకు లేసుకుంటున్నారు.

సూర్యుడు నడినెత్తిపైకి రావటంతో రోడ్డుపైన పాదచారుల సంఖ్య పలచబడిపోయింది.

తన కోసం ఆగిన స్కూటరు వెనక సీట్లోకెక్కి కూచున్న విద్యార్థిని వయ్యారంగా టాటా చెబుతోంది.

"జూలియట్ ఫోజు పెడుతోంది చూడు-" వొక అమ్మాయి చెవి కొరుకుతోంది.

'అలా అసూయ పడొద్దు - నీకు సైతం ఒక తోడు దొరక్కపోదు' అంటూ మందలించాలని అనుకొంది మానస. 'తోడు దొరికినప్పుడు ఎవరికయినా ప్రపంచం స్వర్గంగానే కనిపిస్తుంది. తొలి ప్రణయం యెంత మజాగా వుంటుందని! తన పెళ్ళి నిర్ణయమైన కొత్తలో ఒకరోజు చిరంజీవి గూడా ఇలాగే కాలేజీ దగ్గరికొచ్చాడు. స్కూటర్ని ఆపి కూచోమంటూ ఆహ్వానించాడు. బిడియపడుతూనే వెళ్ళి కూర్చుంది తాను. పట్టుకోకపోతే పడిపోతావ్ - అయినా యెన్నాళ్ళిలా దూరంగా కూర్చోగలవో చూస్తాన్లేనుగూడా - అతడి కవ్వింత తన మానసంలో యెన్ని తరంగాల్ని సృష్టించిందని! - ఇప్పుడిప్పుడే పెళ్ళి చేసుకోనంటున్నావట! నేనంటే ఇష్టం లేదా?-సమాధానం చెప్పడం కోసం ప్రయత్నం చేసింది తాను. నోరు పెగిలితేనా! హోటలుకెళ్ళి కూర్చున్న తరువాత మళ్ళీ అదే ప్రశ్న అడిగాడు. చదువుకోవాలని అంటూ సాగదీసింది - చదువెందుకు? ఉద్యోగాలు చేయాలా? వూళ్ళేలా? యెందుకు చేయకూడదు? రోషమొచ్చింది. చదివిన చదువు చాలు. నీకు నేనే ఉద్యోగం ఇస్తాను. వూళ్ళేలాల్సిన పని లేదుగానీ మా ఇంటిని పరిపాలిస్తే చాలు. నువ్వు కోరినంత జీతం. యేమంటావ్?- తానేమని జవాబు చెప్పగలదు? చిరంజీవి పెళ్ళయ్యాక గూడా తమ మొదటి షికారును గురించి గుర్తు చేస్తూనే వుండేవాడు. నీకప్పుడు నోట్లో నాలుకే లేదనుకున్నాను సుమా- అంటూ యెగతాళి చేసేవాడు. యెన్ని కబుర్లు! యెన్ని విశేషాలు! రోజుకో ప్రోగ్రాం! ఆరు నెలలు - యెంత తొందరగా గడచిపోయాయి? నిద్రలో కల గన్నట్టు - వులిక్కిపడి మేలుకున్న తరువాత యేం మిగిలిందని? - స్వప్న భ్రమ - తనవైపు ఆప్యాయంగా చాపిన చేయి - తనవైపు ప్రేమగా చూసిన కళ్ళు - తన హృదయంతో పెనవేసుకు పోయిన హృదయం - యేడీ - యేడీ చిరంజీవి?-'

క్రిక్కిరిసిన జనంతో వచ్చిన టౌను బస్సు స్టాండులోని సగం మందిని వదలి పెట్టేసి వెళ్ళిపోయింది.

మానస ఆటో స్టాండుకేసి నడచింది.

అడ్రస్సు చెప్పి, ఆటోలో కూచొంది.

ఆటో పరిగెత్తసాగింది.

'పెళ్ళిగాకముందు నిన్ను చూసినప్పుడల్లా పెళ్ళంటూ చేసుకుంటే యీ అమ్మాయినే చేసుకోవాలి అనుకునేవాడిని, అనేవాడు చిరంజీవి. యిప్పుడు మాత్రం నిన్ను గురించి ఆలోచించడమే లేదు - అంటూ వుడికించేవాడు. తాను బుంగమూతి పెడితే - నువ్వు నాలో ఒక భాగమైపోయావు. అంటే నిన్ను తలుచుకోవడమంటే నన్ను గురించి ఆలోచించడమనే అర్థం. అందుకే అలాగన్నాను - అంటూ నవ్వేసేవాడు. యేదో బిజినెస్ డీల్‌కోసం బొంబాయి కెళ్ళినప్పుడు తాను కళ్ళనిండా నీళ్ళు పెట్టుకుందని అతనెంతగా కదలిపోయాడని!- వారం రోజులేగా! అయినా నువ్వు నన్నెక్కడ వదలిపెడుతున్నావోయ్!- చూడు, యెక్కడున్నావో — అతడి పర్సులో తన ఫోటో—చిరంజీవి—ఆ పేరూ, ఆ వ్యక్తీ, అతడి మాటా, అతడి సాహచర్యమూ, చివరికి అతడికి సంబంధించిన అనుభూతులూ — ఓహ్, యెంత మధురం!—' మానస చేయి ఆమె పొత్తికడుపు పైకి ప్రాకింది. అవధుల్లేని అగాధం వేరు చేస్తోంది-అంతులేని దూరం ఆవలికి నెడుతోంది. గాఢాంధకారం దుర్గమారణ్యంలోకి నెట్టి పారేసింది — అయినా చిరంజీవి పిలుపు వినబడుతూనే వుంది — మానస తన్మయంగా కళ్ళు మూసుకుంది—

"మేడమ్-మీ యిల్లొచ్చింది-" ఆటోడ్రయివరు కేకేసేవరకూ ఆమె యీ లోకంలోకి రాలేదు.

పర్సులోకి చేయిపెట్టి, చేతికందిన నోటును పైకి తీసి ఆటోడ్రయివర్కు చేతికందించింది.

"చిల్లర లేదండీ-"

మానస యింటిలో కొచ్చేసింది.

"యెక్కడికెళ్లావింతసేపూ? భోజనం వేళకైనా యింటికి రాకపోతే యేమనుకోవాలి? యేమైపోయావోనని హడలిపోయాను-" అన్నపూర్ణ కంగారుపడుతోంది.

"ఏమైపోతాను?" మానస ప్రశ్ననే సమాధానంగా సంధించింది.

"భోంచేశావా?"

"టయమయిందా అప్పుడే?-"

"యిప్పుడు రెండు కావస్తోంది-"

"మానస చేయి కడుక్కుని, డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుంది.

"పదకొండు గంటలప్పుడు మీ అన్నయ్య ఫోన్ చేశాడు. నువ్వింకా యింటికి రాలేదని చెప్పాను. మళ్ళీ పన్నెండింటికి ఫోన్ చేశాడు. రాలేదన్నాను. అప్పటినుంచీ నీకోసమని వూరంతా వెదికాడు పాపం! నువ్వెక్కడికెళ్ళావో యెవరికి తెలుసు? చెప్పి వెళ్ళావా యేమయినానా? అయినా నీ ధోరణేమిటో అర్థం గావడం లేదు. నీ ఉద్దేశమేమిటి?-"

మానస భోంచేస్తున్నంతసేపూ ఆమె మాట్లాడుతూనే వుంది.

ఆమె ప్రశ్నలకు నిష్క్రమణాన్ని సమాధానంగా చేసి, తన గదిలోకొచ్చి పడుకొంది మానస.

'మళ్ళీ ఏకాంతం - తాను గీసిన బొమ్మలోని స్త్రీ యింకా నీళ్ళు చేదే ప్రయత్నాన్ని మానలేదు. అసలే వొంటరితనం - పైగా అంతులేని ప్రయాస- మానవుడెప్పుడూ వొంటరివాడన్నది పచ్చినిజమే కావొచ్చు. రెండు పదుల కాలం భయపెట్టని ఒంటరితనం ఇప్పుడిలా దుర్భరంగా తయారయ్యిందెందుకని? తోడుగా

కొంతకాలం నిలిచి, ఒంటరితనాన్ని మరిపించి, - అంతలో అంతర్ధానమైపోయిన వ్యక్తిని నిందించాలి. ఇలా యెన్నాళ్ల వేగాలని? ఏం తప్పు చేసిందని తనకీ శిక్ష? గడచిన రోజులు మరువలేనివే గావచ్చు. అంతమాత్రాన వాటినే స్మరిస్తూ కూచోడానికి యెలా మనస్కరిస్తుంది? తాను గూడా మానవమాత్రురాలే గదా! తన శరీరంలోనూ రక్త మాంసాలున్నాయి. ఆవేశ కావేశాలున్నాయి. ఎప్పటి కప్పుడు కొత్త అనుభవాల కోసం అర్రులు చాపే తృష్ణ తనలోనూ వుంది. ఉన్న కోరికలను భ్రమలుగా భావించడానికెలా కుదురుతుంది? అనుభూతుల సాంద్రతని తగ్గిస్తూ కాలం పరిగెడుతూనే వుంటుంది. ఒంటరితనం దుర్భరమవుతూనే వుంటుంది. తన చేతగాదు. జీవితాన్ని శాపంగా మార్చుకోవడం మూర్ఖత్వమని తనకు బాగా తెలుసు - అవ్వా బువ్వా కావాలంటే యెలా కుదురుతుందని నన్ను ప్రశ్నిస్తారెందుకు?-చిరంజీవి నావాడు - అతడి తాలూకు సర్వం నా స్వంతం-- అతడితోటి అనుబంధం ఒక తీయని స్వప్నం--ఆ అనుభవాలని గుర్తు తెచ్చే సాక్ష్యం తన కళ్ళముందు మెదులుతూనే వుండాలి. చిరంజీవి తన శరీరంలోనూ, మనస్సులోనూ ఒక భాగం - తమను విడదీయడం సాధ్యం కాదు. ఆ అనురాగ ప్రస్థానపు అనుభూతులు సైతం చిరంజీవులు - ఆ అనుభూతికి ఒక ఆకారం కలగడం యెంత అదృష్టం! నాదైన అదృష్టాన్ని కాదనే వారెవ్వరు?- మళ్ళీ మొదటికొచ్చావు? మళ్ళీ పెళ్ళి చేసుకోవాలంటే ఆ బీజం మొలకెత్త డానికి వీల్లేదు- యెందుకు వీల్లేదు?-చిరంజీవి తాలూకు సంతానానికి నువ్వు తల్లివైతే మరో వ్యక్తికి పెళ్ళానివి కాలేవు - ఎందుకని? ఇందులో ఛాయిస్ యిచ్చి ఒకటి మాత్రమే కోరుకోమంటున్నారెందుకు? తనకు రెండూ కావాలి! మనీషిగా బ్రతకడం తనకు చేతగాదు! పశువుగా బ్రతకడమూ తనకు నచ్చదు: మనిషిగా బ్రతికితే చాలు! చిరంజీవి జ్ఞాపకాలు తనకు కావాలి! భవిష్యత్తును సుఖశాంతులతో మలచుకోగలిగే అవకాశం గూడా కావాలి! తనకూ ఒక మనస్సుంది! దానికీ కొన్ని కోరిక లున్నాయి! తన గొంతును నొక్కేస్తున్నారెందుకు? భూమిపైకి వూడిపడక మును పటినుంచీ తాను మరొకరి దయా దాక్షిణ్యాలపైన ఆధారపడుతూనే వుంది! ఇలా యెందుకు జరగాలి? తన స్నేహితులు, తన చదువు, తన కోరికలు - అసలీ బ్రతుకు సైతం మరొకరి ఆజ్ఞలకు లోబడి వొదుగుళ్ళు పోతూనే వుంది! తాను కోరిన చదువు చదవనివ్వలేదు! ఉద్యోగం చేసి తన కాళ్ళపైన తాను నిలబడగలిగే హక్కు తనకు లేదు- అమ్మా, నాన్నా, అన్నయ్యా, భర్తా —— తనకెందరు యజమానులు? అందరికీ తాను బానిసే! ప్రతి విషయంలోనూ తనకో న్యాయం. అన్నయ్యకొక న్యాయం! ఎందుకిలా సాగుతోంది? స్త్రీకొక న్యాయం, పురుషుడి కొక న్యాయం! చివరికి స్త్రీకి ప్రేమించే హక్కు సైతం లేదు! ప్రేమించబడడ మొకటే శరణ్యం: తన కిష్టం వచ్చిన చదువు చదివి, తనకిష్టం వచ్చిన ఉద్యోగం చేసి, తానెక్కడ స్వేచ్ఛగా బ్రతికేస్తుందోనని భయపడి నట్టున్నారు అందరూ! అందుకే ఎప్పటికప్పుడు అడ్డు తగులుతూనే వచ్చారు! నిస్సహాయు రాల్ని చేసి, యిప్పుడు తమాషా చూస్తున్నారు! అయినా ఆర్థిక స్వాతంత్ర్య మున్న స్త్రీకి సైతం స్వేచ్ఛెక్కడ దొరుకుతోంది? తానొక నీడ! అనుసరించడం తప్పితే గత్యంతరం లేదు! తనకు స్వయంప్రకాశం లేదు - వీల్లేదు - వీళ్ళ దయాదాక్షిణ్యాలు తనకు అవసరం లేదు! తనకిష్టం వచ్చినట్టు తాను బ్రతకాలి! తన జీవితం, తన బ్రతుకు, తన యిష్టం। తనవికాని నిర్ణయాల్ని తన నెత్తిపైన రుద్దడానికి ప్రయత్నిస్తున్నారు! తానొప్పుకోదు! పరుల నిర్ణయాలకు తలవంచడం పిరికితనం! ఆత్మహత్యను పిరికితనం అంటున్నారు యెవరు నమ్ముతారు? ఆజ్ఞలనే చురకత్తులతో తన బ్రతుకును ముక్కచెక్కలుగా నరికి పారేస్తున్నారు! ఎదిరించక పోవడమే పిరికితనం - ముందు జాగ్రత్తతో తన చేతిలో ఆయుధమన్నదేదీ మిగలకుండా జాగ్రత్త పడ్డారు! కానీ చివరి ఆయుధమొకటి తన గుప్పిట్లో వుండనే వుంది! 'ఆత్మహత్య' తన ఆయుధం! ఆత్మహత్యను పిరికితనం అనడం పొరబాటు! వెనకడుగు వేయని ధీశక్తితో, తలవొంచని ఆత్మాభిమానంతో తాను ఆత్మహత్య చేసుకోబోతోంది!'

మానసకు తననేదో కొత్త శక్తి ఆవహించినట్టుగా తోచింది! ఉచ్ఛ్వాస నిశ్వాసాల ధాటితో పోటీ పడుతున్నట్టుగా ఆమె వక్షస్థలం యెగసి యెగసి పడ సాగింది!

మానస పైకి లేచి నిల్చొంది! -

## 10

"మీతో రెండు మాటలు మాట్లాడాలి! అయిదు నిముషాలు నా కోసం కేటా యించాలి మీరు! ప్లీజ్-" సాగర్ ప్రాధేయపడసాగాడు.

"ఇప్పుడు అయిదు నిముషాలసేపు మాట్లాడే తీరికెక్కడుంది నాకు? అవతల పేషంటు ఏ స్థితిలో వుందో యేమో! తరువాత మాట్లాడుతాను. నేను వెళ్లాలి." డాక్టరు సుందరవల్లి పైకి లేచి నిల్చుంది.

"ప్లీజ్ —— దయచేసి కాస్సేపు కూచోండి డాక్టర్! అయిదు నిముషాలు వొద్దులెండి, పోనీ రెండు నిముషాలు - చాలా ముఖ్యమయిన విషయం. ఇప్పుడు మీరు వినకపోతే, తరువాత మీకు చెప్పుకున్నా లాభం లేదు-"

డాక్టర్ సుందరవల్లి కొద్ది క్షణాలసేపు అతడికేసి సూటిగా చూసింది.

చిందర వందరైన వెంట్రుకలు - రాత్రంతా సాగిన జాగరణను గుర్తుకు తెస్తున్న కళ్లు - ఉద్వేగంతో వణుకుతున్న పెదవులు-అతడిలో ఏదో సంఘర్షణ సాగుతున్న విషయం స్పష్టంగా కనిపిస్తోంది.

"ఏమిటో చెప్పు-" ఆమె కూర్చొంది.

"నాకు సహాయం చేస్తానని మాటిచ్చారు మీరు. మళ్ళీ అదే సహాయాన్ని అర్థిస్తున్నాను-"

"అంటే?-"

"మానస ఇలాంటి పనెందుకు చేసిందో అర్థం గావడంలేదు. ఇలాంటి ప్రమాదం సంభవిస్తే అబార్షనయిపోతుందని అంటారు. అలాంటి అవకాశమున్న పక్షంలో మేము అదృష్టవంతులమని అనుకుంటున్నాను. అలాంటిదేమీ లేకపోయే పక్షంలో-"

"చూడబోతే మీరే కావాలని మానస చేత ఈ పని చేయించినట్టున్నారు-" డాక్టరు కోపాన్ని అణచుకోలేక పోయింది.

"అలా అనకండి మేడమ్" సాగర్ గొంతు బొంగురుపోయింది. "మానస నాకు చెల్లెలు - దాని భవిష్యత్తు కోసం నేనెంత ఆరాటపడుతున్నానో మీకెలా చెప్పగలను? పగలూ రేయీ కంటికి రెప్పలా కాపాడుకుంటూ వచ్చాను. ఇంట్లోకా పాయిజన్ ఎలా వచ్చిందో తెలియదు. అప్పటికీ తొందరగానే తెలుసుకున్నాము. వెంటనే మీ దగ్గరికి తీసుకొచ్చాము - మీరే కాపాడాలి-"

"బలవంతంగానయినా అబార్షన్ చేయమని అంటున్నావు. అదేగదా నీ కోరిక?"

"మీరలా కోప్పడితే ఎలా చెప్పండి? పెద్ద మనసు చేసి ఆలోచించండి. ఈ గండం గడిస్తే చాలు! పెళ్ళి చేసుకోడానికి మా రాజేష్ సిద్ధంగా వున్నాడు. మళ్ళీ ఓసారి ఆలోచించండి. మీకు తెలియనిదేముంది? మీకు చెప్పగలిగేవాణ్ణి కాను." సాగర్ రెండు చేతులూ జోడించి నమస్కరించిన తరువాత, వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

చంద్రమౌళి హడావుడిగా లోపలికొచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"ఎవరు మీరు? లోపలి కొచ్చేముందు పర్మిషను తీసుకోవాలన్న మర్యాదయినా తెలియదా మీకు?" సుందరవల్లి కస్సుమంది.

"ఫార్మాలిటీస్ పాటించే తీరిక లేదమ్మా నాకు - మీరు నాకో సహాయం చేయాలి-"

"నేను సహాయం చేయాలా?-తొందరగా చెప్పండి - నాకవతల అర్జెంటు పనుంది-"

"నన్ను మీరు చూసే వుంటారు - నేను చిరంజీవి తండ్రిని - అంటే మానస మామగారిని-"

"అయితే?"

"మీరూ ఆడవారే గదా! పైగా డాక్టరు! మీకు అన్ని విషయాలూ వివరించి చెప్పాల్సిన అవసరం వుండదని తెలుసు. మొగుడు పోయిన తరువాత ఆడపిల్ల జీవితం ఏమైపోతుందో మీకూ తెలుసు! అలా జీవించడంకంటే చనిపోవడమే మేలు-"

"మీరేమంటున్నారో నాకర్థం గావడం లేదు-"

"తల్లినీ బిడ్డనీ, ఇద్దర్నీ కాపాడ్డం కష్టమంటోంది మీ నర్సు. ఎవరినో ఒకరిని బ్రతికించవచ్చునంటోంది. మాకు చిరంజీవి ఒక్కడే సంతానం. మా వంశం మాతోనే అంతరించి పోకుండా చూడండి - ఫీజెంతయినా పరవాలేదు-"

సుందరవల్లి కాస్సేపు మాట్లాడలేకపోయింది.

చివరికెలాగో గొంతు పెగలించుకొని అటెండర్ని కేకేసింది.

అతడు పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"ఎవరికి వాళ్ళు లోపలి కొచ్చేస్తున్నారు. నువ్వెక్కడున్నావు? ఎక్కడ బలాదూర్లు తిరుగుతున్నావు?" అంటూ అతడిని అదిలించి పారేసింది.

"డాక్టరుగారూ, మీరు-" చంద్రమౌళి తడబడిపోతూ పైకి లేచి నిల్చున్నాడు.

"ముందు మీరు అవతలికెళ్ళండి. వయసులో పెద్దవాళ్ళన్న ఒక్క కారణంచేత మిమ్మల్నింకా గౌరవించాల్సి వస్తోంది." ఆమె కేకలతో గది మార్మోగిపోయింది.

చంద్రమౌళి తల వంచుకుని బయటికెళ్ళిపోయాడు.

"చేసిన నిర్వాకం చాలుగానీ, ఇక వెళ్ళు-" అటెండర్ని వెళ్ళిపొమ్మని చెబుతూ పైకి లేచింది సుందరవల్లి.

ఫోను గగ్గోలు పెట్టింది.

రిసీవర్ని విసుగ్గా పైకెత్తి "హలో! ఎవరూ?" అంటూ ప్రశ్నించింది.

"మీరు డాక్టరు సుందరవల్లిగారేనా?" ఎవరిదో అపరిచిత కంఠం అడుగుతోంది.

"అవును-"

"మీరు నాకో సహాయం చేయాలి-"

"ఎవరు మీరు?"

"ఒక్క నిముషం ఓపికగా వినాలి మీరు — నేను రాజేష్ అన్నయ్యని. బ్యాంక్ మేనేజరుగా పనిచేస్తున్నాను. మావాడొట్టి తొందరపాటు మనిషి— ప్రపంచాన్ని తానొక్కడే ఉద్ధరించేయాలని వాడి ఆలోచన-"

"నాకు అర్జెంటు పనుంది-"

"తొందరగా చెప్పేస్తాను — సాగర్ మీకు తెలుసుననుకుంటాను. మా తమ్ముడు అతడికి స్నేహితుడు. సాగర్ చెల్లెలి భర్త ఇటీవలే పోయాడు. మావాడు ఆవిడగారిని పెళ్ళి చేసుకుంటానని తన స్నేహితుడికి ప్రామిస్ చేశాడట! మేము కేకలేస్తే బెంబేలు పడిపోతున్నాడు - వాడో అర్భకుడు. మంచీ చెడూ వాడికేం తెలుస్తుంది? స్నేహితుడని మొహమాట పడుతున్నాడు. తనంతట తానుగా తెలిసి తెలిసీ రొంపిలోకి దిగిపోతున్నాడు. మీరే కాపాడాలి-"

"నేనేం చేయాలి?"

"ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకోబోయిందట గదా! మీ హాస్పిటల్‌కే తీసుకొచ్చారని విన్నాను. చనిపోవాలనుకుంటున్న అమ్మాయిని బ్రతికించడమెందుకు చెప్పండి? మీరీ సహాయం చేస్తే నన్నూ, మా అమ్మానాన్నల్నీ, మొత్తం మా వంశాన్నే కాపాడిన వాళ్ళవుతారు. మీరెంత ఫీజడిగినా పర్వాలేదు-"

డాక్టర్ సుందరవల్లి రిసీవర్ని క్రెడిల్ పైన పడేసి "డెవిల్" అంటూ గొణుక్కుంది.

గబగబా ఎమర్జన్సీ గదిలోకి నడచింది.

మంచంపైన పడుకున్న మానసకు గొంతువరకూ తెల్లటిదుప్పటి కప్పావుంది. తల మాత్రం బయటికి కనిపిస్తోంది. చిక్కి శల్యమైపోయిన ఆమె శరీరం మంచానికి అతుక్కుపోయింది, ఇనుప చక్రాల కింద పడి నలిగిపోయిన పుష్పంలా.

సెలైన్ బాటిల్లోంచీ బొట్లు క్రిందికి జారుతున్నాయి. మంచానికిరువైపులా ఇద్దరు నర్సులు కూర్చుని పేషంటు పరిస్థితిని గమనిస్తున్నారు.

"ఇంజెక్షను వచ్చిందా?" అంటూ ప్రశ్నించింది డాక్టరు.

"కాంపౌండరు బజారు కెళ్ళాడు మేడమ్! యింకా రాలేదు..." నర్సు.

"వెళ్ళి అరగంట కావొస్తోంది. ఇంకా తిరిగి రాకుండా యేం చేస్తున్నాడు. అవసరానికి పనికిరాకపోతే మనుషులెందరున్నా లాభమేముంది?" ఆమె కంగారు పడుతూ గది బయటికొచ్చి రోడ్డుకేసి పరకాయించి చూడసాగింది.

"అమ్మాయి కెలావుందమ్మా?"

ఆమె పక్కకు తిరిగి చూసింది.

కళ్ళనిండా నీళ్ళు నింపుకుని ప్రశ్నిస్తోంది అన్నపూర్ణ.

ఆమె పక్కనే నిల్చుని వున్నాడు కృష్ణమూర్తి.

డాక్టరు మాటల్ని వినడం కోసం సాగర్ దగ్గరికి పరిగెత్తుకొచ్చాడు.

చంద్రమౌళి దూరంనుంచే చెవులు రిక్కించి వింటున్నాడు.

హాస్పిటల్లో జరుగుతున్న తతంగం తనకు సంబంధించిన విషయం గాదన్నట్టుగా, కిటికీలోంచీ బయటికి చూస్తూ నిల్చుని వున్నాడు రాజేష్.

"ఇంకా ప్రమాదం దాటిపోలేదు ... పరిస్థితి 'క్రిటికల్'గా వుంది..." అంటూ జవాబు చెప్పి, లోపలి కెళ్ళిపోయింది డాక్టరు సుందరవల్లి.

( అ యి పో యి ం ది )



# ఊరంత వెలుగు

శ్రీ అడబాల వి. వి. సత్యనారాయణ

ఊరంతా పొగలు సెగలుగా ఉంది
మాజీ మునసబు నాంచారయ్య ఒక ప్రక్క ....
సర్పంచ్ రాంభద్రం ఇంకో ప్రక్క ....
మధ్యలో నలిగి పోతున్నారు బడుగు జనం
బట్టలుతికే బసవన్నకు తల పగిలింది
క్షవరాలు చేసే శాంతయ్యకు చెయ్యి విరిగింది
ఒకరి పాలేరుకు తలే తెగింది
కొన్ని నోరు లేని జీవాలూ నోళ్ళు వెళ్ళ
బెట్టి స్వర్గానికి వెళ్ళి పోయాయి
అయినా నాంచారయ్య నాంచారయ్యలానే
ఉన్నాడు మీసాలు దువ్వుతూ ....
రాంభద్రం వీరభద్రం అవుతూనే ఉన్నాడు
ఎత్తుకు పై ఎత్తు లేస్తూ
ఆ ఊరి అమ్మోరు మేకల నెత్తురు
మాత్రమే తాగుతుంది - అదీ పండుగరోజుల్లో
కాని వీళ్ళిద్దరూ ఊరోళ్ళ నెత్తుర్లు
తాగుతున్నారు బడుగోళ్ళ బక్కోళ్ళ
బతుకుల్ని కాలిచెప్పులకింద నలిపేస్తున్నారు
"ఒరే నరిసిగే" నాంచారయ్య గారు
ఖంగు ఖంగున పిలుస్తారు
బెంగు బెంగున పరుగెడతాడు
నరిసిగాడు
"భద్రిగాడి మనుషులేవంటున్నార్రా"
ఆయన ప్రశ్నిస్తారు
నరిసిగాడు బొడ్లోపెట్టుకొచ్చిన కథల్ని విప్పి
ఆయన చెవిలోకి ప్రవేశపెడ్తాడు
"ఒరేయ్ నరిసీ" అని ఆయన ఆజ్ఞాపిస్తాడు
అది సుగ్రీవాజ్ఞగా భావిస్తాడు
ఆజ్ఞను కళ్ళకద్దుకుంటాడు శిరసావహిస్తాడు
వహించీ వహించీ ఎప్పుడో ఏ విప్పుల్లోనో -
దూకేస్తాడు
నరిసి గాడి పెళ్ళాం తాడు
తెగిపోతుంది
"ఒరే బక్కోడా"
రాం భద్రం విసురుగా పిలుస్తాడు
బక్కోడు గాల్లో తేల్తూవచ్చి
భద్రం గారి పాదాల మీద పడతాడు
తాతలనాటి కర్రను మంత్రించి
ఇచ్చినట్లు ఇస్తాడు
"వత్తాను బాబయ్యగోరూ" ——
అంటూ కర్రతో సహా ఎగిరిపోతాడు
ఇక రాడు ........
ఊరి కాలవలు రక్తాలతో ఎర్ర బడ్తున్నా
పంట పొలాల్లో రక్తంపంటలు పండుతున్నా
ఊరి చెరువులో శవాలు కప్పల్లా
ఎగురుతున్నా —
కథకొక అంతు లేదు
నాంచారయ్యా బాగానే ఉంటాడు
రాం భద్రమూ దుక్కలాగే ఉంటాడు
మధ్యలో వాళ్ళు మసైపోతుంటారు
ఆపూరి చరిత్ర అలా వుంది ఎప్పటికి మోక్షమో?
గొడవలు గొడవలుగా రూపుదిద్దు —
కుంకటాండగానే ఎలక్షన్లు మళ్ళారంగం —
మీది కొస్తున్నాయి — పిచ్చెక్కిన పులుల్లాగా
కోడిపుంజు కే ఓటంటూ
కొందరు — గ్యారెపొట్టెలుకే
మా ముద్రంటూ ఇంకొందరూ అరచి గీపెట్టడానికి
నోళ్ళు శుభం చేసుకుంటున్నారు
తెల్లగా గోడలకి రంగేసుకున్న వాళ్ళు
రాత్రిళ్ళకొందరు కాపలాకూచున్నా
వాళ్ళకళ్ళు కప్పి — కళ్ళల్లో కారంజల్లో
రాయదలచు కొంది రాసిపారేస్తున్నారు
"మహాజనులారా "అంటూ
ఉపన్యాసాలు ఆరంభమయ్యాయి
మైకుసెట్లు "లే....లే....లేలేలే"అంటూ
చైతన్యగీతాలు పాడుతున్నాయి
అలాంటి సందర్భంలో
ఒకానొక రాత్రిపూట— . లేదా అర్ధరాత్రిపూట
ఒక అఘాయిత్యం జరిగిపోయింది
ఒక పతివ్రతను పాడుచేసిన అఘాయిత్యం కాదిది
ఒక హరిశ్చంద్రుణ్ణి ఖూనీ చేసిన అఘాయిత్యం కాదిది
ఒక నిర్దోషిని ఉరితీసిందికాదు
ఒక పసిపాపను గొంతుకోసిందికాదు
మరేమిటా అఘా .... .. ?
ఇద్దరు మనుషుల్నెత్తుకు పోయేరు రాత్రికి....రాత్రి
ఇద్దర్ని మాయంచేసేరు
ఏం చేసేరో? ఏమయ్యారో? .ఎందుకు చేసేరో?
ఈ ప్రశ్నలు ఎవరూ అడగటం లేదు
ఆ ఇద్దరూ ఒకరు నాంచారయ్య
ఒకరు రాంభద్రమూగనుక
ఊరంతా ఇప్పుడు పొగలు సెగలుగాలేదు
చల్లగా మంచులా పువ్వులా నవ్వుతూ హాయిగా
ఆనందంగా నిద్దరోతోంది గుండెలమీద చెయి
లేసుకున్న ఊరు ఊరికళ్ళల్లో కొలవలేనంత తృప్తి....
ఉతికేవాళ్ళు ఉతుక్కుంటున్నారు
క్షవరాలు చేసే చేతుల్లోనికత్తెర్లు స్వేచ్ఛగా తమ
వృత్తిని చేసుకుపోతున్నారు ఎవరికీ బాధలేదు భయం లేద
"రామిగే రాక్షస బాధ తప్పిందిరా—"
"చంద్రిగా మా బలేగాపోయే రా...."
"ఇకరారు ఒస్తే ఊరంతా ఒకటై మళ్ళావెళ్ళగొట్టాల"
ఓవృద్ధయువకుడు వయసుకి పెద్దయినా ఉత్సాహాన్ని ఉవ్వెత్తు
లేపుతున్నాడు
బడుగోళ్ళు బక్కోళ్ళు చేతుల జోడించారు
"అమ్మా అమ్మోరమ్మా ఆళ్ళిద్దర్నీ తినెయ్ తల్లీ" ఇదీ
వాళ్ళప్రార్థన ఆమె తినేస్తే మిగిలిందంతా దీపావళి పండుగ □

శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మ

# మధుర తెలుగు మాండలికం

మధుర తెలుగు మాండలికం అనగానే అది అరవ తెలుగు అనే అభిప్రాయం వెంటనే కలగడం సహజం. తమిళనాడు నడిబొడ్డు అనదగిన యీ ప్రాంతంలో వ్యవహృత మయ్యే తెలుగుమీద తమిళభాషా ప్రభావం కనిపించడం ఒక వింత కాదు. అయినా, పరిశోధన దృష్టితో కనక పరిశీలిస్తే మధుర తెలుగు మాండలికం తేట తెలుగు మాటలకు నెలవనే నిజం అవగతం కాకపోదు.

విజయనగర సార్వభౌముల కాలంలో ఎందరెందరో తెలుగువారు దక్షిణాపథానికి తరలి వచ్చారు. వారిలో దండనాథులూ మంత్రులూ పురోహితులూ నట్టువకత్తెలూ పండితులూ గాయనీగాయకులూ ఉన్నట్లే, వివిధ కులస్థులూ ఉన్నారు. అలా వచ్చినవారు తమిళనాడులోని విభిన్న ప్రాంతాలలో స్థిరనివాసాలు ఏర్పరచుకున్నారు. స్థానికులతో కలిసిమెలిసి పోయారు. కాలం గడవను గడవను వారికీ తెలుగునాడులోని తెలుగువారికీ మధ్య సంబంధ బాంధవ్యాలూ రాకపోకలూ తక్కువవుతూ వచ్చాయి. ఇది సుమారు నాలుగు శతాబ్దుల నాటి ముచ్చట.

ఈనాడు దక్షిణాంధ్రులుగా వ్యవహృతులవుతున్నవారు ఆనాడు తెలుగు దేశంనుంచి తరలివచ్చినవారి సంతతివారే. వీరి సంఖ్య 49 లక్షలని భావించబడుతున్నవి. ఇది గణనీయమైన సంఖ్యే అనడం నిస్సందేహం.

భాష పరిణామశీలం కలది. కాలగతితోపాటు, ఇతర రంగాలలోనూ మార్పులు ఏర్పడుతున్నట్టే. భాషా రంగంలోనూ మార్పులు ఏర్పడక తప్పదు. తత్ఫలితంగా కొన్ని మాటలు తమ ప్రచారాన్ని కోల్పోయి, కొత్తవాటికి చోటిస్తాయి. ఈనాడు జ్వరం అనేమాట ప్రచుర ప్రచారంలోవున్నా, ఒకానొకప్పుడు వేకి అన్నదే బాగా వాడుకలో ఉన్నట్లు చెప్పవచ్చు. అందుకు దక్షిణాంధ్రుల భాష ప్రబల సాక్ష్యం. వారి వ్యవహారంలో వేకి అన్న ప్రాచీనరూపం ఈ షద్భేదంతో సజీవంగా ఉండడం గమనించదగిన అంశం. ఇలాగే మరికొన్ని కనిపిస్తాయి.

తెలుగుదేశంలోని తెలుగుమీద పారశీకం, ఉరుదూ, ఇంగ్లీషు మొదలైన భాషల ప్రభావం కానవస్తుంది. అలాగే, దక్షిణాంధ్రుల తెలుగుమీద తమిళ భాషా ప్రభావం ప్రధానంగా కనిపిస్తుంది; అదే సమయంలో భాషా ప్రాచీనత కూడా ప్రముఖంగానే కనిపిస్తుంది. ఈ విషయాదికం మధుర తెలుగు మాండలికానికీ వర్తిస్తుంది.

వృత్తిని పురస్కరించుకునీ, శిష్ట శిష్టేతర భేదం వల్లనూ సాధారణంగా మాండలిక భేదాలు ఏర్పడుతూ వుంటాయి. మధుర మాండలికానికి సంబంధించినంతవరకూ, ఈ భేదాలు వివిధ వర్ణాలవారి వ్యవహారంవల్ల ఏర్పడినట్లు భావించవచ్చు. ఇక్కడి తెలుగువారు సాధారణంగా తమిళమో ఆంగ్లమో అభ్యసిస్తారు. పాఠశాలల్లో తెలుగు లేదు. కనుక, తెలుగు నేర్చుకునే అవకాశాలు చాలా తక్కువ; కాని కొందరు ఐచ్ఛికంగా తెలుగు నేర్చుకుంటున్నారు. బయట ఏ భాష వ్యవహరించినా, ఇండ్లలో మాత్రం తెలుగువారు తమ మాతృ భాషనే ఉపయోగిస్తున్నారు. అనగా, తెలుగు ఇంటివరకే పరిమితమై పోయింది. అందువల్ల, వారి భాష ఆపే మార్పులకు లోనుకాక, ప్రాచీనతను నిలబెట్టుకోకలిగింది. ఆ యా కుటుంబాలలో తరతరాలుగా వస్తున్న కొన్ని శబ్ద రూపాలు అలాగే నిలిచి పోయాయి.

ఉదాహరణానికి, కమ్మవారు తమ దైనందిన వ్యవహారంలో ఇడ్డెన దుప్ప, సకలపాడి మొదలైన మాటలు తరుచుగా ఉపయోగిస్తారు. ఇడ్డెనను కుడుములని ఇతరులు వ్యవహరిస్తారు. పనికిమాలినవాణ్ని దుప్ప అంటారు. అలాగే వారి వ్యవహారంలో సకలపాడి అంటే షద్ధకుడు. మా వారు యింట్లో లేరు' అనడానికి కమ్మవారు 'తన యింట్లో లేరు' అంటారు. తన అనే మాట భర్తను సూచిస్తున్నది. ఇది ఒక విలక్షణమైన ప్రయోగం. తన వచ్చి వుండారు. ఇలా వారి వ్యవహారం. ఆయన వారి వ్యవహారంలో గౌరవ వాచకం కాదు. అలాగే 'ముసలాడు' అన్నదికూడా గౌరవ వాచకం కాదు. బగ్గడు (ముసలివాడు) బగ్గి (ముసలిది) వారికి గౌరవ వాచకాలు. భర్తను మాంష అనిగాని బావ అనిగాని వ్యవహరిస్తారు. యువకులు తమ యింటిపేర్లు మరచిపోయినా, వృద్ధులు మాత్రం మరిచిపోలేదు. మేడసానీ, పెమ్మసాని, వడ్లమూడి, పేరం, చె(సె)రుకూరు, అమ్మిని మొదలైనవి వాళ్ళ యింటిపేర్లలో కొన్ని.

బలిజనాయుళ్లు నేల (పొలం), నూగులు (నువ్వులు) అనే తేట తెలుగు మాటలతోపాటు జీని (పంచదార), కేళ్వరగు (రాగులు) మొదలైన శబ్దాలనుకూడా యథేచ్ఛగా వాడుతారు. పెళ్ళిళ్ళల్లో బొట్టు కట్టేముందు 'అగ్నిసాక్షిగా అమ్మి సాక్షిగా అరశాణి సాక్షిగా వేదబ్రాహ్మణుల సాక్షిగా' అని చెప్పడం వారి ఆచారం ఈ ఆచారం. తమిళ బ్రాహ్మణేతరులలో లేదని విజ్ఞులు చెపుతారు. అమ్మి అంటే సన్నికల్లు అని అర్థం. పెళ్ళిలో దీనికి ప్రాధాన్యం వుంది. గుండ్రాయి దాస్తే కూతురు పెళ్ళి అగుతుందా? సన్నికల్లు దాస్తే పెళ్ళి కాదా? అనే సామెతలు తెలుగులో వున్నాయి. రావికొమ్మను అరశాణి అంటారు. దీనికీ పెళ్ళిలో ప్రాముఖ్యంలేకపోలేదు. అరశాణిని ఉపయోగించటం తమిళ బ్రాహ్మణేతరులు కొందరిలో ఉన్నది. కాగా అమ్మి అరశాణుల వాడకం బలిజవారి ఆచారాలకు ప్రత్యేకత కలిగిస్తున్నది. బలిజల్ని గవరలనికూడా వ్యవహరిస్తారు.

బలిజలలో వెంకటస్వామి, అళగర్‌స్వామి, రెం (రం) గస్వామి. నారాయణస్వామి, మొదలైన పేర్లు ఎక్కువగా కనిపిస్తాయి. రంగమ్మ, అళగమ్మ, తాయమ్మ మొదలైనవి స్త్రీలపేర్లు. తమ పేర్లకు ముందు తాత, తండ్రుల పేర్లు వుంచుకోవడం కొన్ని కుటుంబాలలో ఆచారం. ఉదా : పి. వి. రామస్వామి నాయుడు—పి. అనగా పెరుమాళ్ళు, వి. అనగా వెంకటస్వామి.

స్నానం చేశాడు-అనడానికి బలిజలు కొందరు 'ఒంటికి పోసుకున్నాడు అని అంటారు. కొందరు మేత్తికి (మేను) పోసుకున్నాడని అంటారు. విశ్వకర్మ కులస్థులు (విశ్వబ్రాహ్మణులు) మునిగయింది లేక మునిగయ్యె అంటారు. మునుగు శబ్దాన్ని స్నానమనే అర్థంలో వాడడం ఒక విశేషం. మునిగాడు (వర్తమానం) మునిగయింది (భూత) మునుగుతుడు (భవిష్యత్కాలం)—ఇదీ వారి క్రియాపద ప్రయోగ సరళి; కొన్ని గ్రామాలలో తినేరా (తింటారా), తినేతి (భూతకాలం) తినెను (వర్తమానం) అని వ్యవహరిస్తారు. వారి వ్యవహారంలో అమ్మమ్మ, నాయనమ్మ వంటి రూపాలు లేవు. బెద్దమ్మ, అవ్వ మొదలైనవి వీటికి బదులుగా వాడబడుతున్నాయి.

బ్రాహ్మణులు పూర్ణానుస్వార సహిత రూపాలు ఎక్కువగా వాడుతారు. సౌకర్యం పడలేదు (వీలుకాలేదు): వెంటపుట్టినవాడు (తోడపుట్టిన), చొప్పటం

(చెప్పటం), మంచిదిగా వున్నారా (క్షేమంగా) అన్య (అనెను)—ఇలా వారి వ్యవహారం నుంచి కొన్ని మాటలు ఉదహరించవచ్చు. చొప్పినారని బలిజలుకూడా వ్యవహరిస్తారు.

రెడ్లు, బలిజలు-ఇలా అనడం మధురాపురాంధ్రుల సంప్రదాయంకాదు. రెడ్డివాళ్ళు, కమ్మవాళ్ళు పాండ్యవాల్లు (మధుర, తిరునెల్వేలి జిల్లాలవారు) అని వారి వ్యవహారం. కారం బోంచేయడం (తినడం) వారి వ్యవహారం. అన్నం 'తిను' వంటి ప్రయోగాలు వినిపించవు.

ఇక మధుర తెలుగు మాండలికంలో కానవచ్చే కొన్ని సామాన్య లక్షణాలను ఈ దిగువ ఉదహరిస్తున్నాను.

(1) తేట తెలుగు మాటల వాడుక :

ఉదా : అమ్మ, అయ్య, ఆలు. కూడు, చెక్కు (చెంప), ఎనుము, కుదుమ్ములు, కొంగు, అవు (అంగీకార సూచకం), నూగులు (నువ్వులు), అంగడి—

(2) తమిళ శబ్దాల వాడుక :

ఉదా : తూరల్/తూర (జల్లు), వాయిలి (వాకిలి), మేడ (వేదిక), సుడుకాడు (వల్లకాడు), మట్టుం (మాత్రం), తొందరవు (యిబ్బంది) మచ్చం (మచ్చ)

(3) పూర్ణాను స్వార సహిత రూపాలు :

ఉదా : పేంట (ద), ఆడంవాళ్ల, కోంతి, కాంచు (కాచు), రాంత (వ్రాత) ఆంకలి...

(4) మహాప్రాణం అల్పప్రాణంగా మారడం :

ఉదా : బయం (భయం), బాష (భాష), అదికారం (అధికారం), అర్తం, (అర్థ)...

(5) మధ్యాక్షరాన్ని దీర్ఘం చేయడం :

ఉదా : కోడాలు (కోడలు), మిరాలు (మిరియాలు)

(6) పాత మాటలకు కొత్త అర్థాలు ;

ఉదా : తీయు (కొను). ఎత్తుకొను (తీసికొను), ఒకటి ఏమీ: బొత్తిగా)

(7) రండి మొదలైన వాటిలోని డి కారం దకారంగా మారడం ;

ఉదా : చెయ్యండ (డి), రండ (డి). ఏమండ (డి) వినండ (డి), పొండ (డి)

(8) లకారానికి మారుగా నకారం వాడుక :

ఉదా : నేత (లేత) నేత మేక (లేత మేక, మేకపిల్ల) నస (లెస్స): మునక్కాయ (ములక్కాయ)

(9) వర్ణలోపం :

ఉదా : ఆదనూనె (ఆముదం) అయిదురు (అయిదుగురు).

(10) తమిళ భాషా ప్రభావం :

ఉదా : పండిగ (పండిగై), పచ్చపప్పు (పెసరపప్పు త. పచ్చ పరుప్పు), కొండుపోయి (తీసుకుపోయి), ఇంట్లైలేదు (పిట్టలి—'లేని' తేల్చి పలకాలి. ఇంట్లైలోని 'ట్లైని' తేల్చి పలుకుతారు.), పుస్తకం పట్టిందా [నచ్చిందా—తమిళంలో పుత్తగం పిడిత్తదా అని వ్యవహారం. పిడిత్తదా అనేది పట్టిందా అయింది.), చెప్పేదిలేదు [సొల్లు వదిలై.]

[11] అవ్యయాల వాడుక :

ఇల్ల [ఇలా, ఇట్లా]

[12] వింత [వికృత] రూపాలు

ఉదా : ఆగిలి [ఆకలి], మరింజిపోయి [మరిచిపోయి], దొవ్వ [దవ్వ], వెక్కి [వేకి-జ్వరం], కావిరికాయ [కాకర], వట్టం [వణ్ణం], అన్య [అనెను

పీనిక [పీనుగు], వెండిక, వెంట్రాకులు [వెంట్రుకలు]

[13] అపూర్వ రూపాలు

ఉదా : దుప్ప [స్వర్థుడ], బగ్గడు [ముసలివాడు], బగ్గి [ముసలిది], పదం [వెన్న], పదును [వెన్న], పెండి [పేడ], కంద [మాంసపు కూర], పెంట, తొప్ప [పేడ], మిర్జా [చొక్కా, వృద్ధుల వ్యవహారం]. నుగ్గు [ముగ్గు]

[14] క్రియాపద ప్రయోగ భేదాలు

పడేను/పడిని [వర్తమానం]

పడె [భూతకాలం]

పడు [భవిష్యత్కాలం]

తినేను [వర్త], తినేతి [భూత]

చెప్తు / సెప్పేను | [వర్త], సెప్తి [భూత]

వచ్చె/వచ్చేను [వర్తమాన]

వస్తి [భూత]

పోచ్చినారు [పోయారు, భూతకాలం]

[15] బహువచన రూపాలు

లు ప్రత్యయం సర్వసాధారణంగా ప్రయుక్తం. బిడ్డలు, బిడ్లు-అనడం కలదు. ఒక్కొక్కసారి ప్రత్యయరహితంగా వ్యవహరించడమూ కలదు.

ఉదా : నేడు నాలుగు ఉపనయనం [ఉపనయనాలు] ఇది వందాకు వంటిదిగా గ్రహించవచ్చు. కొన్ని సబంధాలు, వాక్యాలు

అది మాదిరి—దానివలె.

కాయా కండా : కాయగూరలు [త. కాయ్‌కరి] అనడం లోక వ్యవహారం కాయలూ మాంసమూ అని కలిపి వాడటం ఒక విశేషం, 'కరికి తమిళంలో కూరలూ మాంసమూ అనే అర్థాలున్నాయి.

వంటానికి : అన్నానికి అనే అర్థంలో యిది ప్రయుక్తం. వట్ట భోం చేయండ— అని కొన్ని పల్లెల్లో వ్యవహారం. వణ్ణానికి వట్ట వికృతరూపమనవచ్చు. అలాగే వంటానికి అనే వ్యవహారం ఏర్పడి వుండవచ్చు.

సద్దువేశాడు : అరిచాడు అని అర్థం. సద్దు [చప్పుడు] చేయుట అని వ్యవహారం.

నస వుండేనా : కులాసాగా వున్నారా అనడానికి కొందరు బ్రాహ్మణుల వ్యవహార మిది. లెస్సగా [బాగా[ అనే మాట వారి వ్యవహారంలో తరుచుగా విన వస్తుంది. లెస్స నెస్సగా మారింది. బాగా చెప్పు అనడానికి నస చెప్పు అనడం కూడా వ్యవహారమే.

పిల్ల వేసింది : పిల్లపెట్టింది. కుక్క పిల్లవేసింది అనడం వ్యవహారం. తమిళంలో కుట్టిపోట్టదు అంటారు.



పశుపక్ష్యాదుల సంతానాన్ని 'పిల్ల' అనీ, మనుష్య సంతానాన్ని 'బిడ్డ' అనడం మధుర వ్యవహారం. కాని కొన్ని గ్రామాలలో మీకు ఎన్ని పిల్లలు? ఎంతమంది బిడ్డలు అని అడగడం అలవాటే. పిల్లాజెల్లా అనడానికి తమిళుల వ్యవహారం పిళ్లై కుట్టి.

ఒకటీ తెలీదు—ఏమీ తెలీదు.

దోవలేదు : అశక్తతను సూచిస్తుంది. వాడికి ఆ చీర తీసే దోవలేదు.

కూడు వండే తావు : వంటిల్లు

ఒంటిగా పోవు : ఒంటరిగా వెళ్ళు

ఒంటికి పోసుకొను : స్నానము చేయు. కొన్ని గ్రామాలలో మేత్తికి పోసేదు అని అంటారు. మేనుకి [ఒడలు] మేత్తికి అయివుండవచ్చు.

వెంట పుట్టినవాడు : తోడబుట్టినవాడు. బ్రాహ్మణుల వ్యవహారంలో ఇది తరచుగా వినిపిస్తుంది.

కులదేవుడు : ఇలువేల్పు.

మి యిల్ల చేసుండావు? [ఎందుకిలా చేశావు]

వాయిలి చల్లపల [వాకిట్లో పేడనీళ్ళు చల్లాలి]

ఆంజనేయుడికి పదం పెట్టాల [వెన్న పెట్టాలి]

మంచిదిగా వున్నారా? [క్షేమంగా వున్నారా?]

అవశ్యం పొయ్యి కావాలి [తప్పకుండా వెళ్ళాలి లేక వెళ్ళి తీరాలి]

నడిచి వచ్చేవా? [నడుస్తావా?]

ఒంటికి పొయ్యాలి [స్నానం చెయ్యాలి]

కూడు వండేతిరా? [అన్నం వండారా—వండితిరా?

దీన్ని పత్తి నాను సెప్తి [దీన్నిగురించి నేను చెప్పాను)

దానిక్కాను/గ్గాను : [అందువల్ల]

ఎదిన్ను చేసేది లేదు [ఏమీ చేసేందుకు లేదు]

చచ్చి పోడ్చినారు : [చచ్చిపోయారు]

ఎక్కడ పోతారు : [ఎక్కడికి వెడుతున్నారు?]

ఈ పక్కలో వుంది : [ఈ వైపుగా/దగ్గర్లో వుంది.]

వాడు పనికి పోయుండేడు [ఉద్యోగానికి వెళ్ళాడు]

మా వూరు ఊడు ఓ బెద్ద వూరుగా వుండిని.

[మా వూరు యిప్పుడు ఒక పెద్ద వూరుగా వుంది.]

మధుర తత్ప పరిసరాలలో తరచుగా వినిపించే కొన్ని మాటలు :

అ

అబ్బ అయ్య [తండ్రి], అమ్మ, అవ్వ, అవు [అగు, అవును], అక్క, అణ్ణ (అన్న), అల్లుడు, అలమారి [అలమర], అవశ్యం [తప్పక], అంచు [చి]ల్లు [పక్క యిల్లు], అంచునెల [వచ్చేనెల], అంత [అన్ని—అంత కాయలు], అంటికాయ [అరటి కాయ], అయిద్దార బుట్టి [అగ్గిపెట్టె]

ఆ

ఆయన [భర్త], ఆలు [భార్య], ఆదనూనె [ఆముదం], ఆదమ గింజలు [ఆముదపు గింజలు], ఆగిలి (ఆకలి), ఆణి [మేకు], ఆడ [అక్కడ] ఆరికలు [వంట చెరకు], ఆవాలు, ఆనక [తర్వాత], ఆంకలి [ఆకలి]

ఇ

ఇల్ల [ఇలా. ఇట్లా] ఇల్లు, ఇడ్డెన [ఇడ్లీ], ఇట్టియాన [భర్త, ఇంటి ఆయన], ఇంగవ [ఇంగువ]

ఉ

ఉద్దులు [మినుములు], ఉద్దుబేల్లు [మినపపప్పు], ఉప్పట్లు [అట్టు, దోసె], ఉల్లిగడ్డ [ఉల్లిపాయ], ఉష్టకాయ [ఉస్తికాయ].

ఎ, ఏ

ఎనుము [గేదె], ఎర్రగడ్డ [ఉల్లిపాయ], ఎల్లుండి [డి], ఎండు [అనుకొను], ఏంటి [ఏమిటి] ఏంపై [యాభై], ఏమండ [ఏమండి]

క

కడుగులు (ఆవాలు), కుట్టు, కోడా (ద) లు, కువ్వడ (స్త్రీ కేశములు), కాయితం, కూడు, కొప్ప (కొంప), కొసువం (కుచ్చెళ్ళు), కండ (మాంసపు కూర), కందరగోళం (గంద్రగోళం), కంసలవాడు (కమసాలి), కుడుములు కర (అంచు), కొంగు కావిరికాయ (కాకర) కూర, కూడు, కొత్తమల్లి (ధనియాలు), కొట్టం (వంటిల్లు, కూంతురు, కాంచు (కాచు), కోసరం (కోసం), కోంతి కోక.

గ

గుడ్డ, గుండు (గుండ్రముగా, పెద్దది) గుంపు

చ

చీర, చెల్ల, చెల్లి (చెల్లెలు), చిన్నమ్మ (పిన్ని), చల్ల, చెక్కు-(చెంప), చెట్టు మొక్క), చొప్పటం (చెప్పటం/డం), చాప

జ

జనాలు (చాలమంది జనం), జాస్తి : ఎక్కువ, జోలి (పని), జీని (పంచదార), జీనికాయ (చిక్కుడు), జీలగార (జీలకర్ర)

త

తూర, తూరల్ (జల్లు). తొప్ప (పేద), తండు కూరాకు (తోట కూర), తెల్లగడ్డ (వెల్లుల్లి), తడవ, తొప్పి (టోపి), తమ్ముణ్ణు ('ణ్ణు'ని తేల్చి పలకాలి), తొందరవు (ఇబ్బంది), తవిర (తప్ప), తీయు (కొను), తుండు (తుండు గుడ్డ)

ద

ధారి (అశక్తత), దొవ్వు (దూరం), దొడ్డ (లావు, గొప్ప), దుడుసు (త్వర), దుప్ప (పనికిమాలినవాడు), దండిగా (ఎక్కువగా). దోవ, దుప్పటి

న

నల్లమ్మ (పిన్ని), నేలక/నాలక, నాను (తడియు), నస (లెస్స/బాగుగ), నూన (నె), నాను (నేను), నేల (పొలం), నూగులు (నువ్వులు) నేత (లేత), నిండా (ఎక్కువగా), నీళ్ళు (మంచినీళ్లు), నడచు (జరుగు)

ప

పేంటి పెండి, పేండ (పేడ), పెయ్య (దూడ), పిన్నమ్మ (పిన్ని), పెద్దమ్మ, పండి (ద) గ, పెరుగు, పలగారం (అల్పాహారం) పకోడా (డీ), పేనా (కలము), పిన్నాండు (పిల్లవాడు), పసరం (కోడెదూడ. పసల దొడ్డి (పశువుల కొట్టం), పోతు (దున్నపోతు), పూరా (పూర్తిగా), పళ్ళికూడం (పాఠశాల), పిల్లకాయ (పిల్లవాడు), ప్రశ్న (సమస్య). పొడలంగాయి (పొట్లకాయ), పత్తి (గురించి—తమిళం పత్రి, పెద్ది (పెద్దమ్మ), పసుపు పొడి (పసుపు), పచ్చి బియ్యం (ఉప్పుడు బియ్యానికి వ్యతిరేక పదం), పడం (పటం/సినిమా), పులుసు, పొల్లకాయ (పొట్ల) పడికట్టు (మెట్టు)

బ

బొమ్మరిది, బెండి [డ] కాయ, బిడ్డ [శిశువు/పిల్ల], బెద్ద, బట్ట, బెద్దసూది [దబ్బలం], బగ్గడు [ముసలివాడు], బగ్గి [ముసలిది], బాపనవాడు [పురోహితుడు], బొట్టు [మంగళ సూత్రం], బంజ [బలిజ], బావ [భర్త] బెద్దమ్మ [వృద్ధ స్త్రీ], బాగా, భారీ [పెద్ద], బియ్యం

# రా నేస్తం రా

## హనీఫ్

నేస్తం !
నేస్తం !!
నీ గదిలో ఒంటరిగా
గుడ్డి లాంతరు వెలుగులో
నీ కై నీవే
వెలి వేసుకుంటున్నావు దేనికి
కాశ్మీరు శిఖరాల అందాల్ని
కన్యా కుమారి దిగంతాల్ని
భారతీయ అందాల్ని. సోయగాల్ని
చూడ్డం, చవిచూడ్డం అంటే
నాకూ ఇష్టమే
కానీ !!
కళ్ళుపొడుచుకున్నా
ఏమీ కనిపించని
చిమ్మని చీకట్లో
ఏం చూస్తావు నేస్తం
ఆ అందాల్ని ఎలా వర్ణిస్తావు

అటు చూడు నేస్తం
చీకట్లను కురుస్తూ
కారు మేఘాలు క్రమ్ముకొస్తున్నాయి
శిశువు జన్మలో ఎర్రదనం
ఎందుకుందని ప్రశ్నిస్తున్నాయి
"క్రాంతి కారుణ్ణి కంటున్నావా ?"అని
'తల్లి'ని నిలేస్తున్నాయి చీకట్లు
ఇటు చూడు నేస్తం
కార్మికుడు
గనిలో పనివల్ల
ఆకలితో నీరసించటం వల్ల
ఖాతంతా 'దొర' ల ఖజానాకు
కాపలా ఉండటం వల్ల
నిద్రలేమి వల్ల ఆకలివల్ల
కండ్లెర్ర బడితే —
నీ కండ్లెందుకు ఎర్ర గున్నాయని

కండ్లను నిర్దాక్షిణ్యంగా
పీకేస్తుంది చీకటి
ఆకు,ఆకు రాజుకొని
కొమ్మ,కొమ్మ రాజుకొని
అడివంతా వేడెక్కి
వెలుగుని ప్రకాశిస్తుంది
అందుకే
అడివంతా బొగ్గులుచేసి
తనలో ఇముడ్చుకోవాలని
చిందు లేస్తుంది చీకటి
నేస్తం !!
చీకట్లను చూసి దడిస్తే
నీ గుడ్డి దీపాన్ని ఆర్పేయి.
వెలుగుల్ని ప్రేమిస్తే
రా .... ! నాతో చేయి కలుపు
దీపం వత్తి నింగి కంటా పెంచి
త్యాగాల వెలుగుల్ని చిమ్ముదాం.

---

**మ**

మిర్జా [చొక్కా-వృద్ధుల వ్యవహారంలో], మొగుడు [భర్త], మాగు/మాను [చెట్టు], మీంద [పైన], మునగ, మొట్ట [బోడి], మిరగాయలు [మిరపకాయలు], మావ [భర్త], మాడి మేడ [వేదిక] మిరిపికాయ, మాళు [పీలగు], మట్టుం [మాత్రం]

**ర**

రేపు, రేప్టికి [రేపటికి], రేదు [లేదు], రెడ్డివాళ్లు [రెడ్లు], రాంత [వ్రాత]

**వ**

వెంటిక [వెంట్రుక], వాయిలి [వాకిలి], వదంతి, వణ్ణం, వడ్లు/ఒడ్లు [ధాన్యం], వంకాయ, వాడిక [అలవాటు], వద [గారె], విపసాయం [వ్యవసాయం], వాసి [బాగు/నయము]

**శ, స**

సి (చి) సుకులు, సౌరకాయ, శనిగ పప్పు (సెనగ), సకలబాడీ (వడ్రంగి); శనింకాయలు/శనక్కాయలు (వేరుసెనగ), శక్కర (నాటుచక్కెర), సిన్నయ్య (పినతండ్రి), సౌకర్యము (వీలు-సౌకర్య పడలేదు), సుడుకాడు (శ్మశానం), సొత్తు, సద్దు (చప్పుడు), సమ్మంది (వియ్యంకుడు), సారు (పులుసు)

ఇక బి. యస్సి పట్టభద్రుడైన ఒక యువకుడు తమ పూర్వుల్ని గురించి చెప్పిన కొన్ని వాక్యాలను యథాతథంగా ఉదహరిస్తున్నాను. యువ తరానికి చెందినవారు తెలుగు మాట్లాడే తీరు ఈ వాక్యాలలో ప్రతిఫలిస్తున్నది.

"మంకు దేవుడు విశ్వబ్రహ్మ. ఎందుకంటే విశ్వబ్రహ్మవిని బిడ్డలే మాము. అయిదురు బిడ్డలు ఆయనకు. వారు మను, మయ, ద్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ. వీర్ల విశ్వజ్ఞ బిడ్డలే మాకు. మేము చేసే పని బంగారు పని. ఈ పనిని నేర్చేదానికి వేరేజాతివాల్లు వస్తే ముందరకాలంన ఒగ్గరు. అయితే వుండు ఎవురొస్తేను పని నేర్చికినేదానికి సమ్మతించేము. నేటికి చూస్తే మంతవిద మిత్ర జాతివాళ్లె జాస్తి వుండారు..."

కొద్దిపాటి మార్పులతో పై వాక్యాలను ఈ కిందివిధంగా చదవవచ్చు.

"మాకు దేవుడు విశ్వబ్రహ్మ. ఎందుకంటే విశ్వబ్రహ్మ (యొక్క) బిడ్డలం మేము. అయిదుగురు బిడ్డలు ఆయనకు. వారు మను, మయ, ద్వష్ట, శిల్పి, విశ్వజ్ఞులు. వీళ్ళలో విశ్వజ్ఞు బిడ్డలమే మేము. మేము చేసే పని బంగారు పని. ఈ పనిని నేర్చుకునేందుకు వేరే జాతివాళ్లు వస్తే ముందర కాలాన (పూర్వం) ఒగ్గరు. అయితే యిప్పుడు ఎవరొస్తేను పని నేర్చుకునేందుకు సమ్మతించేము. నేడుచూస్తే మాకంటె మిగిలిన జాతి వాళ్ళే జాస్తి వున్నారు."

మధుర తెలుగు మాండలికం గురించి పైన పేర్కొన్న విషయాలు నేను చేసిన ప్రాథమిక పరిశీలనవల్ల తేలినవి. పర్యాప్తమైన పరిశీలనవల్ల ఆసక్తి కరములైన ఎన్నో విషయాలు తెలియగలవని నా ప్రగాఢ విశ్వాసం. నా దృష్టిలో తేట తెలుగు మాటలకు కొటారం మధుర తెలుగు మాండలికం!

(వ్యాస రచనావసరమున చక్కని సూచనలు చేసిన మిత్రుడు శ్రీ కె. గురుస్వామికి కృతజ్ఞుణ్ణి.) చ రా. శ. □

# పుణ్య భూమి

(వంద సంవత్సరాల క్రితం ఫ్రాంక్లిన్ పియర్స్ అమెరికా అధ్యక్షుడుగా ఉండేవాడు. అమెరికా దేశీయులైన ఎర్ర ఇండియన్‌లనుండి విస్తృతంగా భూములు కొనాలనుకొన్నాడు. ఫ్రాంక్లిన్‌పియర్స్ తన ఆలోచనను రెడ్‌ఇండియన్‌ల నాయకుడైన సియాటల్‌కు జాబుద్వారా తెలియజేశాడు. పాషాణ హృదయులైన అమెరికన్ తెల్లవారి నుండి పరిసరాలను పరిరక్షించి కోవాల్సిన అవసరాన్ని వివరిస్తూ సియాటల్ వ్రాసిన సమాధానంలో మార్మికంగా వివరించాడు. విల్లు బాణం చేతబట్టి పక్షియీకల శిరోభూషణం సింగారించుకున్న 'అనాగరక' వ్యక్తి యొకడు 'నాగరకుడైన' అమెరికన్ అధ్యక్షునికి పరిసరాల ప్రభావాన్ని గురించి వ్రాసిన వాక్యాలు విశృంఖలంగా పరిసరాలను మార్చివేస్తున్న నేటి భారత దేశానికి అన్వయిస్తాయి. ఆ జాబు యొక్క స్వేచ్ఛానువాదమిది.)

* * *

ఆకాశాన్ని, ఈ నేలపై మాకున్న మమకారాన్ని మీరెలా ఖరీదు కట్టగలరు? ఎలా కొనగలరు? విక్రయించగలరు? ఈ వూహే మాకు విచిత్రంగా వుంది. గాలిలోని నైర్మల్యాన్ని, నీటిలోని స్వచ్ఛదనాన్ని మీరెలా కొనగలరు? ఈ నేలపైని ప్రతి అణువూ మాకో ఎంతో పవిత్రమైనది. నిగనిగలాడే ఆకులు ఇసుక తిన్నెలతో కూడిన సముద్రతీరం, దట్టమైన అడవుల్లోని మంచు తెరలు ఝమ్మని వినవచ్చే కీటకధ్వనులు ఇవన్నీ మా ప్రజలకు విడదీయని అనుబంధాలు.

తెల్లవారు చచ్చి స్వర్గం చేరి నక్షత్రాల మధ్య మసలుతూ తాము పుట్టిన స్థలాన్ని విస్మరిస్తారు. రెడ్ ఇండియన్ జాతికి ఈ భూమి కన్నతల్లి కాబట్టి చచ్చినా యీ నేలను మరచిపోరు. మేము ఈ నేల పిల్లలం. ఈ మట్టి మాది. సువాసనల వెదజల్లే ఈ పూవులు మా అక్క చెల్లెళ్లు. ఇక్కడ తిరిగే దున్న, దుప్పి, గుర్రం గ్రద్ద యివన్నీ మా సోదరులు కొండలు, కోనలు, పచ్చికబీళ్ళు మా గుర్రాల వంటిపై వెచ్చదనం, యీ మనుష్యులు మేమందరం ఒకే కుటుంబానికి చెందిన వాళ్ళం నదీనదాల్లో, వాగుల్లో గల గల మంటూ ప్రవహించే జలాలు కేవలం నీరుకాదు- అది మా ప్రాచీనుల రక్తం.

మా నుండి మీరు కొనదలచిన భూమి ఎంతో పవిత్రమైనదని తెలుసుకోండి. సరోవరాల్లో జలాశయాల్లో ప్రతిబింబించే ప్రతియొకటీ మా ప్రజల జీవితాల్లోని సంఘటనలను, జ్ఞాపకాలను స్ఫురింపజేస్తుందని మీ పిల్లలకు చెప్పండి. ఈ నీటి గలగలల్లో మా తండ్రి తాతల పలుకులు మార్మోగుతున్నాయని తెలుసుకోండి.

మా దప్పికను తీర్చే నదులు మా సోదరులు. ఈ నదులు మా పిల్లలకు అన్నం పెడుతున్నాయి. మా పడవలు మా ప్రయాణ సాధనాలు నదులు మాకే కాదు మీకు కూడా సోదరులు

ఈ విషయం మీరు గుర్తించుకోవటమేకాక మీ పిల్లలకు కూడా తెలియజేయండి. మీరు కూడా నదులను తోబుట్టువుల్లా ప్రేమించండి.

తెల్లవారికి మా ఆచార వ్యవహారాలు అర్థంకావని మాకు తెలుసు. రాత్రి వేళల్లో గుట్టుగా వచ్చి తనకు కావలసిన దానిని తీసుకుని వెళ్ళే తెల్లవాడు విదేశీయుడు. భూమి అతని శత్రువు. సోదరుడు కాడు. కొత్త భూములకోసం ప్రాకులాడుతూ పాతవాటిని వదలి ముందుకు పోతాడు. తన ప్రాచీనుల సమాధులను వదలి ముందుకు పోతాడు. వాటిని గమనించడు. తన పిల్లల భూములను సైతం కాజేస్తాడు. అతడు తన తల్లిని, తోబుట్టువులను, భూమిని, ఆకాశాన్ని కూడా కొనగలడు. దోచుకోవచ్చు, గొర్రెల్లా అమ్ముకోవచ్చు. వాని ఆకలి, సస్యశ్యామలమైన యీ నేలను నాశనం చేసి ఎడారిగా మిగల్చవచ్చు.

మా ఆచార వ్యవహారాలు మీ వాట్లకు భిన్నమైనవి. మీ నగరాలను చూచిన మా వాళ్ళ కళ్ళకు నొప్పులొస్తాయి. మేము అనాగరకులం కాన యీ విషయాలన్నీ అర్థం చేసుకోలేక పోవచ్చు. తెల్లవారు కాపురముంటున్న నగరాల్లో ప్రశాంతతకు చోటేలేదు. వసంతంలో చెట్లు చిగుర్చటాన్ని లేదా తుమ్మెదల రెక్కల చప్పుళ్ళను వినేందుకు వీలే లేదు. అనాగరకుడైన నాకు యివన్నీ అర్థం కాకపోవచ్చు. చిమ్మచీకట్లో పక్షికలరవాన్ని వినుపించుకోని, సరస్సుల్లోని కప్పలు రాత్రుల్లో బెకబెకమంటూ సాగిస్తున్న చర్చలను వినటానికి నోచుకోని బ్రతుకూ ఒక బ్రతుకేనా? నేనొక ఎర్ర ఇండియన్ కాబట్టి నాకేమీ తెలియదు.

జంతువులు, వృక్షాలు, మానవులు, అందరూ పీల్చేది ఒకే ప్రాణవాయువును అందువల్ల ఎర్రవాడికి ఆ గాలి అమూల్యమైనది. తెల్లవాడు తాను పల్చేగాలినే గమనించడు చావును అన్వేషిస్తూ తన చుట్టూవున్న దుర్గంధాన్ని కూడా గమనించనంతటి జడప్రాయుడైనాడు. మా భూమిని మీకు అమ్మివేసినపుడు, ఆ గాలి మా కెంత అమూల్యమైనదో మీకెలా తెలుస్తుంది. తన్ను ఆశ్రయించిన సమస్త జీవరాశితో గాని తన చైతన్యాన్ని పంచుకొన్న విషయాన్ని మీరు గుర్తించాలి. మా తాతకు మొదటి శ్వాసనిచ్చిన గాలియే అతని కొనవూపిరిని కూడా స్వీకరిస్తుంది. గాలిలోని పావిత్ర్యాన్ని కాపాడుకుంటూరావాలి. అప్పుడు మాత్రమే. ఈ నేలపై వికసించిన పూవుల పరిమళంతో కూడిన నిర్మలమైన గాలిని అనుభవించి ఆనందించవచ్చు.

నేనొక అనాగరికుణ్ణికాన నాకు మరేమీ తెలియదు. పరుగులుతీసే రైలుబండిలో కూర్చున్న తెల్లవాడు పేల్చిన తూటాలకు గురియై చచ్చి కుళ్ళుతున్న వేలాది దున్నలను చూచాను. మా ఆహారం కోసం మాత్రమే చంపేదున్నకంటే పొగలు క్రక్కుతూ పరుగులు తీసే ఇనుప గుర్రం ఎలా గొప్పదో నాకు తెలియదు. అందుకు కారణం నేనొక అనాగరకుణ్ణి. ప్రాణులు లేని బ్రతుకొక బ్రతుకా? పశుపక్ష్యాదులన్నీ నామరూపాలు లేక పోయినపుడు మానవజాతి చైతన్యపు ఒంటరితనంతో వినాశమవుతుంది. ప్రాణులకు పట్టిన దుర్గతి అచిరకాలంలోనే మానవులకూ పడుతుంది. జీవరాసులన్నీ అన్యోన్య అనుబంధం కలిగినవే.

మీరు మీ పిల్లలు నడయాడే నేలపై వున్నది మన ముత్తాతలనాటి బూడిద అన్న విషయం తెలియజేయాలి. ఈ నేల మా కులము వారి బ్రతుకుతో సమృద్ధమైందన్న వాస్తవాన్ని మీ పిల్లలకు చెప్పండి. ఈ నేలను వారు గౌరవించేటట్లు తీర్చి దిద్దండి. ఈ మట్టి మా తల్లి అని మా పిల్లలకు నేర్పినట్లే మీరు మీ పిల్లలకు బోధించండి మట్టికేమవుతుందో అదే మట్టిలో పుట్టిన మనకూ ప్రాప్తిస్తుంది. ఈ నేలను తిరస్కరిస్తే మనలను మనమే తిరస్కరించుకొన్నట్లు.

మాకు తెలిసిందింతే. ఈ నేల మానవుడిది కాదు. మానవుడు ఈ నేలకు చెందినవాడు. ఈ సంగతి మీకు తెలుసు. ఒక కుటుంబానికి చెందిన వారిలో రక్తసంబంధం వున్నట్లే భూమిపైవున్న జీవజాలం మధ్య సంబంధం ఉంటుంది.

మానవుడు జీవితాన్ని నిర్మించలేదు. జీవితంలో మానవుడొక అంశం మాత్రమే. అతడు తన బ్రతుకుదెరువుకోసం చేసేదంతా తనకు మాత్రమే.

దేవుడితో మాట్లాడుతాను. అతనితో స్నేహ సంబంధాలు కల్గి ఉంటాను అనుకుంటున్న తెల్లవాడు కూడా అందరితో కలసి మెలసి వుండాలి. అతనికేవిధ మైన ప్రత్యేకత లేదు. మన మందరమూ సోదరులమే. అందరి దేవుడూ ఒక్కడే అన్నది మనకు తెలుసు. ఈ సత్యాన్ని ఎప్పుడో ఒకప్పుడు తెలుసుకుంటాడు. దేవుడు మీవాడని మీరు భావించి ఉండవచ్చు. కాని అది నిజంకాదు. దేవుడు అందరివాడు. మాపట్ల తెల్లవాళ్ళపట్ల సమాన కారుణ్యాన్ని ప్రదర్శిస్తాడు. భగవంతునికి నేల అమూల్యమైనది. ఈ నేలకు అవమానం జరిగితే — ఆ భగవంతునికి అవమానం జరిగినట్టే. ఇతర జాతులకాలం చెల్లిపోయేందుకు ముందే తెల్లవాడికాలం పూర్తికావచ్చు. మీరు పడుకునే పడకనే అపరిశుభ్రం చేసినట్లయితే ఏదో ఒకనాడు ఆ అశుచిలోనే వూపిరాడక చచ్చిపోవచ్చు.

ఏదో వుద్దేశంతో భగవంతుడు మీకీనేల నేలమీద మనుష్యులపైన యాజ మాన్యాన్ని యిచ్చాడు. ఈ విధి విలాసం మాకు రహస్యంగా తోస్తున్నది. మీరు అడవి దున్నలను కాల్చివేయటం అడవి గుర్రాలకు కళ్లెలు బిగించటం సురభిళ మయిన, అందమయిన అడవులమధ్య మాట్లాడే తీగలనులాగి అరణ్యాల నిగూఢత్వానికి అడ్డు తగలడం మాకు అర్థం కాకున్నది.

ఇంకెక్కడి పొదలు? ఇంకెక్కడి పక్షులు? అవి జీవించేకాలం చెల్లిపోయింది. ఉనికి కోసం పోరాడవలసిన కాలం ఆసన్నమయింది.

జానపద్ది హనుమచ్ఛాస్త్రి

# శ్రీరామ అప్రమేయ తత్త్వం

వేదము విశ్వ సాహిత్యమున నాది కావ్యమయితే 'వేదసంజ్ఞ' రామా యణ స్వరూపంతో లౌకిక సాహిత్యమునకు 'ఆదికావ్య' మయినది. మహర్షి వాల్మీకి 'నారాయణ అప్రమేయ తత్త్వాన్ని' చరిత్రగ రూపొందించి లోకమునకు అందిస్తాడు. రామాయణం ఆధిదైవికం. మహర్షులు దానిమీద ఆదిభౌతిక తత్త్వాన్ని అచ్ఛాదన చేశారు. శ్రీరామ 'అప్రమేయ తత్త్వం', రామావతారహేతువైన 'నిశాచర వినాశకరం' మనకు కావ్యారంభములోనే ద్యోతకమౌతుంది.

'రామ' పదానికి విశ్వమునకు ఆనందాన్నిచ్చు పరంబ్రహ్మ స్వరూప మని అర్థం. 'రామో విరాయో ‍‍రజః' అని ఆ పరంబ్రహ్మ తత్త్వాన్ని ఆరాధించే విధానం భారతదేశంలో ఆదికాలంనుండి ఉంది. 'రమయతి యోగీనాం మనాంసి ఇతి రామః'; 'రమంతే యోగినః అస్మిన్ ఇతి రామః'; 'రమ యతి ఇతి రామః' లాంటి సూక్తులు బహుళ ప్రచారం పొందాయి. 'రామ' శబ్దము ఋగ్వేదంలో విభిన్న సందర్భాలలో సాక్షాత్కరిస్తుంది.

రామాయణ మహాదర్శాన్ని ఆధారంగ చేసుకొని ప్రపంచంలో అనేక రామకావ్యాలు వెలిశాయి. బౌద్ధ, జైన ధర్మాల్లో రామావతార వైశిష్ట్యం ప్రాకింది. బౌద్ధమతంలో 'దశరథ జాతకము', 'అనామకం జాతకం', 'దశరథ కథానకం' ప్రచారంలోకి వచ్చాయి. జైన ధర్మంలో 'పౌ ఉమ చరియ', 'జైన రామాయణం', 'రామ పురాణము', 'రామ చరితము' ఉద్భవించాయి. తంత్రాలోకములో శివతత్త్వమే సీతారాములుగ వ్యవహరించ బడినది.—

ఏషరామో వ్యాపకో
అత్ర శివః పరమ కారణమ్!

చైనా, టిబెట్టు, టర్కీ, జావా; కంబోడియా, ఇండోచైనా, బర్మా, సయాం మున్నగు దేశాలలో 'రామకథ' బహుళ ప్రచారం చెందింది. మహాకవి కాళిదాసు రచించిన 'రఘువంశము' విశ్వవిఖ్యాతి గాంచింది. ఆ తర్వాత సంస్కృత, ప్రాకృత, అపభ్రంశ భాషలలో 'రామగాథ' ఆధారంగ అనేక కావ్యాలు, నాటకాలు వచ్చాయి. భాసుని 'ప్రతిమ', 'అభిషేకము'; భవభూతి 'ఉత్తరరామ చరిత' నాటకాలు బహుళ ప్రసిద్ధినొందాయి. 'ఆధ్యాత్మ రామా యణం', 'రామచరిత మానస్' రామభక్తిని చాటి చెప్పాయి. ద్రావిడ భాషలకు సంబంధించి—తమిళంలో 'కంబ రామాయణము'; తెలుగులో 'రంగనాథ రామాయణము', 'భాస్కర రామాయణము', మొల్ల రామాయణము', 'గోపీనాథ రామాయణము', 'వాసుదాస రామాయణము', 'రామాయణ కల్పవృక్షము'; మలయాళములో 'రామ చరితము', కన్నడ భాషలో 'తోరవే రామాయణం' ప్రసిద్ధి గాంచినవి.

ఆదినుండి 'శ్రీరామ కథ' భారతావనికే కాక, విశ్వమంతా కడు పూజ్యంగ భావించబడుతుంది. 'వందే విష్ణు శివాది సేవ్యమనిశం భక్తేష్టసిద్ధి ప్రదమ్' అని 'రామ తత్త్వాన్ని' ఆస్తికులు సదా ధ్యానిస్తున్నారు.

ధర్మం రెండు విధాలు— (1) ఆత్మ ధర్మం, (2) శరీర ధర్మం 'ఆత్మ ధర్మ' స్వరూపమే శ్రీరాముడు. ధర్మబోధ ఆయన ఉద్దేశ్యం కాదు. ధర్మానుష్ఠానమే ఆయన తత్త్వం. అందుకే రామావతారాన్ని అనుష్ఠానావతార మన్నారు. 'రామో విగ్రహవాన్ ధర్మః' అనే సూక్తి బహుళ ప్రచారమైంది. రాముని ధర్మ సంరక్షకత్వం కావ్యారంభంలోనే స్ఫురింపచేస్తాడు కవి—

రక్షితా జీవలోకస్య, ధర్మస్య పరిరక్షితా।
రక్షితా స్వస్య ధర్మస్య, స్వజనస్య చ రక్షితా॥

కావ్య గమనంతోపాటు శ్రీరామ తత్త్వాన్ని వాల్మీకి మహర్షి వివిధ పాత్రలద్వారా సూచిస్తాడు. యాగ సంరక్షణార్థం వచ్చిన విశ్వామిత్రుడు దశరథునితో అంటాడు—

అహంవేద్మి మహాత్మానం,
రామం సత్య పరాక్రమమ్॥

అంతేకాదు, సరయూనది తీరమున నిద్రించుచున్న శ్రీరాముని మేల్కొలిపి విశ్వామిత్రుడు ధర్మనిర్వహణకు నాంది పల్కుతాడు—

కౌసల్యా సుప్రజారామ, పూర్వా సంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల, కర్తవ్యమ్ దైవమాహ్నికమ్॥

విశ్వామిత్ర మహర్షినుండి 'బల', 'అతిబల', జృంభకాది అస్త్రములు బడిసినప్పుడు ఆయా అస్త్రముల అధిదేవతలు ప్రత్యక్షమై, రాముడు నమస్క రించగా, ప్రతినమస్కారము చేసివెళ్తారు. శ్రీ సీతారామ కల్యాణ మహోత్స వాన్ని మహర్షులనేకులు సందర్శించుకుంటారు. అంతేకాదు, వనవాస సమయమున మహర్షులంతా రామదర్శనార్థము దారి చూస్తుంటారు.

దశరథుడు శ్రీరామ పట్టాభిషేక ప్రస్తావన తెచ్చినప్పుడు ప్రజలంతా ఏకకంఠంతో రాముని వాత్సల్య భావమును ప్రశంసిస్తారు—

వ్యసనేషు మనుష్యాణాం, భృశం భవతి దుఃఖితః
ఉత్సవేషుచ సర్వేషు, పితేవ పరితుష్యతి

పట్టాభిషేకవార్త, వనవాసవార్త రెండూ శ్రీరాముడు సమానభావంతో తీసుకుంటాడు—

ఖరదూషణ వధానంతరం అకంపనుడు రావణునికి రామతత్త్వం తెలియచేస్తాడు—

సనక్షత్రగ్రహ నక్షత్రం నభశ్చా ప్యవసాదయేత్।
అసౌ రామస్తు మజ్జంతీం శ్రీ మానభ్యుద్ధరేన్మహీం॥
భిత్వా వేలాం సముద్రస్య లోకా నాప్లావయేద్విభుః।
వేగం వాపి సముద్రస్య వాయుం వా విధమేచ్ఛరైః।

నతం వధ్య మహం మన్యే సర్వైర్దేవా సురైరపి।
అయం తస్య వధో పాయస్తం మమైకమనా శ్శృణు॥

శూర్పణఖ రామలక్ష్మణుల అప్రతిమానమైన సౌందర్య తత్త్వాన్ని రావణునకుపదేశిస్తుంది.

తరుణౌ రూపసంపన్నౌ, సుకుమారౌ మహాబలౌ।
పుండరీక విశాలాక్షౌ, చీరకృష్ణాజినాంబరౌ॥
ఫల మూలా శనౌ దాంతౌ తాపసౌ ధర్మచారిణౌ॥
పుత్రౌ దశరథస్యాస్తాం భ్రాతరౌ రామలక్ష్మణౌ॥
గంధర్వరాజ ప్రతిమౌ పార్థివ వ్యంజనాన్వితౌ
దేవౌవా మానుషౌ వాతౌ నతర్కయితు ముత్సహే॥ అంటుంది.

ఇంకా 'రామేణ విదితాత్మనా' అంటూ శ్లాఘిస్తుంది.

మాల్యవంతుడు రావణునికి హితవు చెప్తూ—

విష్ణుం మన్యామహేదేవం మానుషం రూపమాస్థితం।
నహి మానుష మాత్రోసౌ రాఘవో దృఢవిక్రమః॥

అంటాడు. రావణుడు మారీచుని మాయలేడిగ మారమని కోరినప్పుడు—శ్రీరాముని అప్రమేయ తేజస్సును విశదపరుస్తాడు మారీచుడు. "నాకు ఈ అరణ్యమెల్ల రామమయముగానే కన్పట్టుచున్నది. 'ర' కారముతో కూడుకున్న శబ్దములకు ఒడలు జలదరించుచున్నది" అంటాడు.

రామో విగ్రహవాన్ ధర్మః, సాధుస్సత్య పరాక్రమః।

*                *                *

అప్రమేయం హి తత్తేజో, యస్యసా జనకాత్మజా॥

*                *                *

రకారా దీని నామాని, రామత్రస్తస్య రావణ।
రత్నానిచ రథాశ్చైవ, సంత్రాసం జనయంతి మే॥

ఇంకా ప్రహస్త, కుంభకర్ణాది రాక్షసులుకూడ శ్రీరామ అప్రమేయ తత్త్వాన్ని ఉపాసిస్తారు.

రామబాణా ఘాతముచే నేలకూలిన వాలి రామతత్త్వాన్ని ధ్యానిస్తాడు— "రామ! నీవు సర్వ విషయములను ఎరిగిన వాడవు. ప్రజా హితరతుడవు. కార్యకారణ నిర్ణయమునందు నీబుద్ధి నితాంతము నిర్మలమైనది—

త్వంహి దృష్టార్థ తత్త్వజ్ఞః, ప్రజానాంచ హితేరతః।
కార్యకారణ సిద్ధౌ తే ప్రసన్నా బుద్ధి రవ్యయా॥

నీ చేతిలో మరణము కోరాను. అందుకే 'తార' హితమునుకూడ పెడ చెవిని పెట్టాను"—

త్వత్తోహి వధమా కాంక్షన్ వార్యమాణోఽపి తారయా।
సుగ్రీవేణ సహభ్రాత్రా ద్వంద్వయుద్ధ ముపాగతః॥

భర్త మరణానంతరం తార 'రాము'ని అప్రమేయ సుందరాకారం చూచి అంటుంది -

త్వమప్రమేయశ్చ దురాసదశ్చ
జితేంద్రియశ్చోత్తమ ధార్మికశ్చ।
అక్షయ్య కీర్తిశ్చ విచక్షణశ్చ
క్షితి క్షమావాన్ క్షతజోపమాక్షః॥

సుందరకాండలో ఆంజనేయుడు రావణునికి రామతత్త్వాన్ని విశద పరుస్తాడు—

దైవాశ్చ దైత్యాశ్చ నిశాచరేంద్ర
గంధర్వ విద్యాధర నాగయక్షాః।
రామస్య లోకత్రయ నాయకస్య
స్థాతుం నశక్తా సమరేషు సర్వే॥

అంతేకాదు—

బ్రహ్మా స్వయంభూ శ్చతురాననో వా
రుద్రస్త్రినేత్ర స్త్రిపురాంతకో వా।
ఇంద్రో మహేంద్ర స్సురనాయకోవా
త్రాతుం నశక్తా యుధి రామవధ్యమ్॥

అంటాడు.

విభీషణుడు రామశరణాగతిని వేడినప్పుడు—

సర్వలోక శరణ్యాయ, రాఘవాయ మహాత్మనే।
నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్॥

అని విన్నవించుకుంటాడు.

యుద్ధభూమిలో రాముని బాణా ఘాతముచే పరాభవింపబడిన రావణుడు దీనవదనుడై అంటాడు—

తం మన్యే రాఘవం వీరం, నారాయణ మనామయమ్॥

రాముని అప్రమేయతత్త్వ సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ రావణుడు యుద్ధం చేయుట మర్చిపోగా, సారథి రథాన్ని వేరే దిక్కుకు మరల్చుతాడు. అప్పుడు రావణుడు క్రోధోద్దీప్తుడయి సారథిని

త్వయా ద్యహి మమానార్య
చిరకాల సమార్జితం।
యశో వీర్యంచ తేజశ్చ
ప్రత్యయశ్చ వినాశితః॥

శత్రోః ప్రఖ్యాత వీర్యస్య
రంజనీయస్య విక్రమైః
పశ్యతో యుద్ధ లుబ్ధోహం
కృతః కాపురుష స్త్వయా

అని దూషిస్తాడు.—

ఇంద్రజిత్తు మరణార్థము లక్ష్మణుడు— "రాముడు ధర్మాత్ముడు, సత్యసంధుడు, పౌరుషమున అప్రతిద్వంద్వుడు అగునేని; ఓ శరమా! ఈ రావణాత్మజుని సంహరింపు" మంటూ ఐంద్రాస్త్రము ప్రయోగిస్తాడు—

ధర్మాత్మా సత్యసంధశ్చ, రామో దాశరథిర్యది।
పౌరుషేచా ప్రతిద్వంద్వః, శరైనం జహి రావణిమ్॥

రావణ వధానంతరము బ్రహ్మ సమస్తదేవతలతో శ్రీరాముని దర్శించుకొని స్తుతిస్తాడు—

భవాన్నారాయణో దేవః, శ్రీమాన్ చక్రాయుధో విభుః

సీతాపహరణము తర్వాత రాముడు స్వయంగ తన అప్రమేయ నారాయణ తత్త్వాన్ని మనకు స్ఫురింప చేస్తాడు. రావణునిచే నిహతుడై పడియున్న జటాయువుని ఉత్తమలోకాలకు వెళ్ళమంటాడు. అవసరమైతే నా ఆజ్ఞగా చెప్పమంటాడు—

మదాజ్ఞా సమనుజ్ఞాతః, గచ్ఛలోకా ననుత్తమాన్।

ఇచ్చట నారాయణుని మోక్షప్రదత్త్వం స్ఫురిస్తుంది. విభీషణ శరణాగతి సమయంలో రాముడు తన అభయ తత్త్వం చాటి చెప్తాడు—

అభయం సర్వభూతేభ్యో, దదామి ఏతద్వ్రతం మమ

సీతా మహాసాధ్వి రామాయణమునకు కేంద్రశక్తి, హృదయము, ప్రాణము 'సీతాయాశ్చరితం మహత్' అని వాల్మీకి మహర్షి కావ్యారంభంలోనే పలుకుతాడు. ఇంకా 'ధ్రువం విశిష్టా గుణతోహి సీతా' అంటాడు.

సీత స్వయంగా సుందరకాండలో రావణునితో అంటుంది—
"రామాజ్ఞ లేనందువలనను, నా నియమానుష్ఠాన నిరతిచేతను, నిన్ను భస్మము చేయక విడచుచున్నాను"—

అసందేశాత్తు రామస్య తపసశ్చాను పాలనాత్।
న త్వాం, కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హ తేజసా॥

రక్కసులు హనుమంతుని వాలమునకు నిప్పంటించినపుడు సర్వశ్రేయస్కరమైన తన అతిలోక రహస్యాన్ని ప్రకటిస్తూ అగ్నిహోత్రుడ్ని చల్లబడమంటుంది.

యద్యస్తి పతి శుశ్రూషా, యద్యస్తి చరితం తపః।
యది చాస్త్యేక పత్నీత్వం, శీతోభవ హనూమతః॥

అగ్ని ప్రవేశానంతరం సీతాదేవిని వాల్మీకి శక్తి స్వరూపిణిగా వర్ణిస్తాడు-

తరుణాదిత్య సంకాశాం తప్తకాంచన భూషణామ్,
రక్తాంబరధరాం బాలాం నీలకుంచిత మూర్ధజామ్।
అక్లిష్టమాల్యాభరణాం తథారూపాం మనస్వినీమ్,
దదౌ రామాయ వై దేహీమంకేకృత్వా విభావసుః॥

రాముడు కూడ 'సీత'ను విశాలాక్షిగా సంబోధిస్తాడు-

ఇమామపి విశాలాక్షీం, రక్షితాం స్వేన తేజసా
రావణో నాతివర్తేత, వేలామివ, మహోదధిః॥

అధ్యాత్మ రామాయణంలో 'ఆనందబ్రహ్మ'ను రామునిగాను, 'ఆదిశక్తి'ని సీతగాను అభివర్ణించటం జరిగింది.

భక్తకబీర్ 'రాముని' నిర్గుణతత్త్వాన్ని ఉపాశిస్తాడు-

నిరుగుణ రామ్ నిరుగుణ రామ్ జపహురే భాయీ'

హిందూ ముస్లిములు ఏకమై రాముని జపించమంటాడు-

కహేకబీర్ ఏక్‌రామ్ జపహురే
హిందు తురక నకోయీ।

చివరకు తాను రాముని బంటుగా, కుక్కగా విన్నవించుకుంటాడు-

కబీర్ కూతా రామ్ కా,
ముతియా మేరా నామ్।
గలే రామ్‌కీ జేవడీ, జిత ఖీంచై తిత జాఉ।

మహాకవి తులసీదాసు 'శ్రీ రామచరిత మానస్'లో శ్రీరాముని పరబ్రహ్మ' తత్త్వాన్ని-

యన్మాయా వశవర్తి విశ్వమఖిలం బ్రహ్మాది దేవాసురా
యత్సత్వాదమృషైవ భాతి సకలం రజ్జౌ యథా హేః భ్రమః।
యత్పాద ప్లవమేక మేవ హి భవాంభోదే స్తితీర్షావతాం
వందేఽహం తమ శేషకారణపరం రామాఖ్య మీశం హరిమ్॥

అని స్తుతిస్తాడు. ఇంకా అవతార హేతువు వివరిస్తాడు-

ఏక్ అనీహ అరూప అనామా। అజ సచ్చిదానంద పరధామా।
వ్యాపక విశ్వరూప భగవానా।తేహి ధరి దేహచరిత కృతనానా॥

అరణ్యకాండలో రావణుడు అంటాడు— "నాతో సమాన బలవంతులైన ఖరదూషణులను, ఒక్క పరబ్రహ్మ తక్క మరెవ్వరు వధించలేరు. కనుక వైరభావంతో ప్రభువును గెల్చి, వాని బాణముద్వారా మోక్షప్రాప్తి పొందుతాను"

ఖరదూషన మోహి సమబలవంతా,
తిన్హహి కో మారయి బిను భగవంతా

* * *

త ఉ మైం జాయి బయరు హరి కరహు।
ప్రభుసర్ ప్రాన్ తజే భవ తరహు॥

సీతను 'తులసి' ప్రకృతికి ప్రతీకగ, జగన్మాతగ వర్ణిస్తాడు-

ఉద్భవస్థితి సంహారకారిణీమ్।క్లేశ హారిణీమ్!
సర్వ శ్రేయస్కరీం సీతాం నతో అహం రామ వల్లభామ్ .

ఆ తర్వాత--

సీయ రామ మయ సబజగ జానీ
కరఉ ప్రనామ జోరి జగపాణీ।

అంటూ వినమ్రుడౌతాడు. అందుకే శ్రీ తులసీదాసు తన రామ కావ్యాన్ని-

'నానా పురాణ నిగమాగమ సమ్మతం
యద్రామాయణే నిగదితమ్' అంటూ ప్రారంభిస్తాడు.

సహజ పాండిత్యుడు పోతన-

అది దేవుడైన యా రామచంద్రుని
కట్టికట్టు టెంత? యసురకోటి జంపుటెంత?
కపుల సహాయ్య మది యెంత?
సురల కొరకు గ్రీడ సూపెగాక!

అని శ్రీరామ మహాత్మ్యాన్ని వివరిస్తాడు.

శ్రీరామ చరిత్ర ఎంత ఉదాత్తమైనదో, శ్రీరామనామము అంత దివ్యమైనది. హనుమంతుడు రామచంద్రునితో అంటాడు---

రామ త్వత్తోధికం నామ
ఇతి మన్యామహే వయమ్।
త్వయైకా తారితా అయోధ్యా।
నామ్నాతు భువనత్రయమ్॥

'నగాయత్ర్యాం, పరం మంత్రం' అని సాధకులు చెప్తారు. అట్టి గాయత్రియే రామాయణ తత్త్వం. వాల్మీకి కావ్యారంభంలోనే వివరిస్తాడు—

చరితం రఘునాథస్య, శతకోటి ప్రవిస్తరమ్।
ఏకైకం అక్షరం ప్రోక్తం, మహాపాతక నాశనమ్॥

'రామ' నామ మహిమలో 'తులసీ' చక్కని వివరణ యిస్తాడు. 'రా' అనగానే కొండంత పాపము బహిర్గతమై, 'మ' అనగానే కవాటము మూత పడుతుంది—

తులసీ రా క హెతెహీ
బాహర్ జాత్ పాప్ పహార్।

'రామ' నామము మణిదీపము లాంటిది. దానిని 'ముఖ' మనెడి ద్వారములో 'నాలుక' అనే గడపమీద ఉంచితే అంతః బాహ్య లోకాల్లో 'వెలుగు'

వస్తుందంటాడు పివి తులసీ.

రామనామ మని దీపధరు
జీహ దేహరీ ద్వార్।
తులసీ భీతర బాహిరౌ
జో చాహసి ఉ జి ఆర్॥

రామ తాపన్యుపనిషత్తు రాముని పరతత్త్వాన్ని—

"యస్త్యైవ పతు బీజస్థః ప్రాకృతశ్చ మహాన్ ద్రుమః
తథైవ రామ బీజస్థ జగదేత చ్చరాచరం।

అని కీర్తిస్తుంది.

ఉమా సంహితయందు—
'రా' శబ్దోచ్చారణే జాతే వక్త్రాత్ పాపం విగచ్ఛతి।
మకార ప్రవణే జాతే భస్మ భావం గమిష్యతి॥

అని రామనామ రహస్యం వివరింపబడింది.

'రా' కలుషంబులెల్ల బయలం బడ ద్రోచిన 'మా' కవాటమై
ఢీకొని ద్రోచు నిక్కమని ధీయుతులెన్న తదీయ వర్ణనల్
గైకొని భక్తిచే నుడువ గానిరుగాని విపత్పరంపరల్
దాకొనునే జగజ్జనుల దాశరథీ కరుణాపయోనిధీ॥

అని భక్త రామదాసు రామతత్త్వాన్ని ఉపాశిస్తాడు.

'తపోధనాంహి తపశ్శరీరమ్' అని ఆర్య వాక్కు. తపస్సుకు మూలం భగవద్వాచకమైన ప్రణవం. 'తస్య వాచకః ప్రణవః' అని పతంజలి మహర్షి తన యోగశాస్త్రంలో పేర్కొన్నాడు. కనుకనే వనవాస సమయమున ముందుగా నడచుచున్న రాముని, తర్వాత సీతను, ఆ తర్వాత లక్ష్మణుని దర్శించుకున్న మహర్షులకు రాము నిరంతరము ధ్యానించు ప్రణవతత్త్వము ప్రకటితమైనది. అందు 'అ'కారము రామునికి (విష్ణు), 'ఉ' కారము సీతకు (ప్రకృతి), 'మ' కారము లక్ష్మణునకు (జీవుడు) సంకేతములుగ 'స్తోత్రార్ణవము' విశద పరుస్తున్నది.

యుద్ధకాండలో రావణవధానంతరము మండోదరి, సీతామహాసాధ్వి దివ్యతత్త్వాన్ని—

వసుధాయాశ్చ వసుధాం
శ్రియశ్శ్రీం భర్తృవత్సలాం।

అని కీర్తిస్తుంది. వెంటనే రాముని అప్రమేయ తత్త్వాన్ని—

వ్యక్తమేష మహాయోగి
పరమాత్మా సనాతనః।
అనాది మధ్య నిధనః
మహతః పరమో మహాన్॥
తమసః పరమో ధాత
శంఖచక్ర గదాధరః।
శ్రీవత్స వక్షా నిత్యశ్రీః
అజైయః శాశ్వతో ధ్రువః॥

అని స్తుతిస్తుంది.

వాల్మీకిమహర్షి శ్రీమద్రామాయణంలో ఆద్యంతములు "శ్రీరాముని— సర్వలోక హితేరతః, సర్వజీవహితేరతః సర్వభూత హితేరతః, రామాయ విదితాత్మనే, రాఘవాయ మహాత్మనే, రామోయం విజితేంద్రియః—అనిన్నీ; సీతను—ధర్మచారిణీమ్, తపస్వినీమ్, మహాభాగాం, వైదేహీం, ఉపాసీనాం, అయోనిజాం" అంటూ అనేక విశిష్ట విశేషణాలతో సీతారాముల అప్రమేయ తత్త్వాన్ని వివరిస్తాడు. అయితే సీతామహాసాధ్వి నిరంతరము రామనామస్మరణంలోనే లీనమై ఉండేది. శంకరుడుకూడ పార్వతితో—

శ్రీరామ రామ రామేతి
రమే రామే మనోరమే।
సహస్రనామ తత్తుల్యం
రామనామ వరాననే।

అని రామనామ మహిమను వివరిస్తాడు.

'రామ' శబ్దము గాయత్రీ స్థితము, వేదసంజ్ఞ యుక్తము, బీజాక్షర సంయుతమైనది. 'ర'కారము 'అగ్ని'కి బీజాక్షరం, తేజస్సుకు వ్యక్తస్వరూపము. 'శంభు' దీని అధిష్ఠానదేవత, 'సుషుమ్న' నాడి దీని నివాసము. 'అ' సూర్యునికి బీజాక్షరం, ఉష్ణస్వభావం కలది; 'విష్ణువు' దీని అధిష్ఠాన దేవత. 'పింగళ' లేక 'యమున' నాడి దీని నివాసము. 'మ' చంద్రునికి బీజాక్షరం; శీతల స్వభావం కలది. బ్రహ్మ దీని అధిష్ఠాన దేవత. 'ఇడా' లేక 'గంగ' దీని నివాసము. ఈ విధంగ 'అగ్ని' అనగా శివుడు; 'సూర్యుడు' అనగా విష్ణువు: 'చంద్రుడు' అనగా విష్ణువు; 'చంద్రుడు' అనగా బ్రహ్మయొక్క సమన్వయ రూపమే త్రివేణిగా, సరస్వతిగా, శారదగా ఖ్యాతి గాంచినది. అందుకే 'రామ' మంత్రము భక్తులకు, సిద్ధులకు, యోగులకు, మహర్షులకు, జ్ఞానులకు—'తారకమంత్ర' మైనది సర్వలోకాలు—

"రామ ఏవ పరం బ్రహ్మ,
రామ ఏవ పరం తపః"

అని సర్వదా ధ్యానిస్తున్నాయి.

కెప్టెన్ షేక్ మౌలాలీ

# గ్రంథ విమర్శలు

## నన్నయ భారతములో ఉపమ

[రచన : డాక్టర్ శ్రీమతి బి. రుక్మిణి. డెమ్మి 158 పుటలు వెల రూ. 15-00 ప్రతులకు డాక్టర్ బి. రుక్మిణి, తెలుగుశాఖ, కాకతీయ విశ్వవిద్యాలయం, విద్యారణ్యపురి, వరంగల్లు-లేక-1-8-117/2 చీకటిపల్లి, హైదరాబాదు-20 ]

నన్నయ భట్టారకుని ప్రసన్న కవిత్వంగురించీ, అర్థ గాంభీర్య, ప్రయోగ విశేష, పదప్రయోగాదులనుగురించి, ఇతర విషయాలను గురించీ ఎందరో పరిశోధనలు జరిపి చాలా విమర్శగ్రంథాలను రచించి ప్రకటించారు. డాక్టర్ రుక్మిణమ్మ డాక్టర్ పట్టంకోసం సిద్ధాంత వ్యాసాన్ని రచింపదలచి, సుప్రసిద్ధ విద్వత్కవి విమర్శకులు డాక్టర్ సి. నారాయణరెడ్డిగారికి తన సంకల్పాన్ని తెలుపగా, ఆయన, భట్టారకుని ఉపమాలంకారాన్ని గురించి పరిశోధించవలెనని సలహా ఇచ్చారు. ఆయన ఆదేశానుసారం ఆమె యీ సిద్ధాంత వ్యాసాన్ని రచించి డాక్టరు పట్టా సంపాదించి కృతార్థతను పొందినది.

అలంకారాలన్నింటికీ ఉపమయే మూలం. అప్పయ దీక్షితులవారు తమ చిత్రమీమాంసలో "ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికా భేదాన్, రంజయతి కావ్యరంగే..." అని ఒక్క నర్తకియే వేర్వేరు వేషాలు ధరించి రంగస్థలంపయి నటించి ప్రేక్షకులను రంజింపజేసినట్లు, ఒక్క ఉపమాలంకారమే వేర్వేరు అలంకార రూపాలు ధరించి కావ్య శ్రోతలను, పాఠకులను రంజింపజేస్తుందని తెలియజేశారు. అందువల్ల ఉపమనుగురించి పరిశీలిస్తే అలంకారతత్త్వం అవగాహన కాగలదు. అందువల్ల పరిశీలనకు ఉపమనే తీసికొనుట సముచితంగానే ఉన్నది.

ఈ సిద్ధాంత వ్యాసంలో నాల్గు పేజీల ప్రవేశికకు తర్వాత 'అలంకార ప్రకాశనం' అనే శీర్షికలో అలంకార స్వరూప ప్రయోజనాల పరిశీలన జరిగింది. తర్వాతి శీర్షికలో ఉపమాలంకార వివేచనం ఉన్నది. తర్వాత ప్రధానాంశాన్ని గురించిన అవతారిక కానవస్తుంది. ఆ పిదప ప్రధానమైన "ప్రధానకథ" అనే శీర్షికలో నన్నయ భారత భాగంలోని కథాసంవిధానంలో ఉపమకు ఏవిధంగా సముచిత స్థానం ఇయ్యబడినదీ విశదీకరించబడినది.

అనుబంధంలో వ్యాసరచనకు ఉపయోగపడి సంస్కృతాంధ్రాంగ్ల గ్రంథాల పట్టిక ఇయ్యబడినవి. సంస్కృత గ్రంథాలలో పుంలింగాంతాలయిన గ్రంథనామాలు నపుంసకలింగంలో ఇవ్వబడడం వింతగానే కానవస్తుంది. తర్వాత నన్నయ భారతంలో ఎన్ని ఉపమలు ఉన్నదీ ఆకారాది క్రమంలో ఈయబడినవి. ఆశ్వాస, పద్య సంఖ్యలలోకూడా ఈ పట్టిక పాఠకులకు చాలా ఉపయోగకరమైనది.

నేటినాగినంతవరకూ-డాక్టరు పట్టానికి ఉద్దేశించబడిన సిద్ధాంత వ్యాసాలలో ఇది చాలా సంగ్రహరూపమైనదని చెప్పవలసియున్నది. అనవసరంగా గ్రంథకాయం పెంచకుండా, కావలసిన విషయాలే ఇందు వివరించబడినవి. ఇది వాఙ్మయ పరిశీలకులు ఆదరించవలసిన రచన.

"ఆంగీరస"

## సురవాణీ మణిహారః

[రచయిత : "ఈశ" (శ్రీ. ఈ. శఠకోపాచార్యులు) డెమ్మిసైజు-12+170 పుటలు, దేవనాగరలిపి, ప్రకాశకులు-ప్రాప్తిస్థానం - విద్వాన్ శ్రీ ఫణీంద్ర తల్పశాయి. 4-336 - జి. యస్. కె. గీతాశ్రమ రోడ్డు, ప్రొద్దుటూరు-కడప జిల్లా.]

సంస్కృత భాషలో సమర్థులైన విద్వాంసులూ, ఉత్తమ కవులూ అయిన శ్రీ "ఈశ" రచించిన పద్యరచనలు, గద్యరచనలు, దృశ్యరచనలు ఈ సురవాణీ మణిహారం"గా సమకూర్చబడినవి. ఇవి చాలాకాలం క్రిందటనే రచించబడి, యిప్పుడు తిరుమల తిరుపతి దేవస్థానంవారూ. మరికొందరు సహృదయవదాన్యులు చేసిన ఆర్థిక సహాయంవల్ల చక్కగా ముద్రింపబడినవి. సుప్రసిద్ధ విద్వాంసులు-కె. యస్. రామానుజాచార్యులుగారు, అవధాన-చంద్రశేఖర శర్మగారు, బాంఢ్ల-వేంకటరమణార్యగారు దీనిపయి సదభిప్రాయాలను ఇచ్చియున్నారు.

ఇందలి కవితలు వివిధ విషయాలకు చెందినవి, ఈ మణిహారంలో మూడు పేటలున్నవి. మొదటి సం పద్యరూపం, రెండవది గద్యాత్మకం, మూడవది దృశ్యరూపం. మొదటి సరంలో హయగ్రీవ లహరి, స్తుతిముక్తావళి, అమరవాణీ ప్రశస్తి మున్నగు పది పద్య ఖండికలున్నవి. రెండవ సరంలో భక్తిమార్గ ప్రాశస్త్యం, గురుశుశ్రూషయావిద్యా, అహింసా పరమో ధర్మః, జననీ జన్మ భూమిశ్చ...కణ్ణకి, భారతే భాషా సంఘోభః అనే గద్య రచన లున్నవి. మూడవ దానిలో ధ్రువ, కుచేల, ప్రహ్లాద, శ్రీరామ, భారతీ విజయాలనే లఘు దృశ్యాలున్నవి.

సాధారణంగా సంస్కృత విద్వాంసులు కవితలను రచిస్తే తమ పాండితీ ప్రకర్షనుకూడా అందులో ప్రతిబింబింపజేయడం పరిపాటి. ప్రజాదరాన్ని పొందాలనే సంకల్పంతో రచయిత యీ లఘుకృతులను సులభశైలిలోనే రచించడం ప్రశంసనీయం. విషయ వైవిధ్యంకూడా విద్వద్వ్రతంసులను ఆకర్షిస్తుందని చెప్పవచ్చును.—

శైలికొక ఉదాహరణ—

ఆధారో ఒభూ దమర ఫణితే
　రోధరాయా ముదారో
ధారాధీశో గుణగణ నిధి
　ర్భోజనామా సుదారః,
యస్యాస్థానే కవికుల గురుః
　కాళిదాసో వ్యరాజత్
తౌ ప్రాసూత క్షితిరియ మిహ
　కల్పమాస్థాం విజిష్ణూం

[పుట 48]

ఇది దేవనాగర లిపిలో ముద్రితం కావడంవల్ల ఆంధ్రేతరులకు కూడా అందుబాటులో ఉండగలదు: ఇది అమర భాషాభిమానుల ఆదరాన్ని పొందగలదని విశ్వసిస్తున్నాను.

బులుసు వేంకటరమణయ్య

## కుటుంబరావు సాహిత్యం

### (నాలుగవ సంపుటం)

[సంపాదకులు : డా. కేతు విశ్వనాథరెడ్డి, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-4.]

జీవితకాలాన్ని రచనా వ్యాసంగానికే అంకితం చేసిన రచయితలు తెలుగు సాహిత్య ప్రపంచంలో చాలా అరుదు. అలాంటి అరుదైన రచయితలలో కొడవటిగంటి కుటుంబరావుగారు ఒకరు. ఆధునికాంధ్ర సాహిత్య వికాసం కోసం ఆయన కావించిన కృషి మరచిపోలేనిది, మరపుకు రానిది.

కథకోసమే కథ కథ అనే భావనతో వర్ణనలు పడిలిపెడుతూ, సంభాషణలు దాటవేస్తూ కేవలం ముగింపుకోసం పరుగులుదీసే పాఠకుల పాలిటికి కుటుంబరావు సాహిత్యం మ్రింగుడుపడని కవళం. ఆయన రచనల్లో పెక్కింటికి నాటకీయమైన ముగింపులుండవు. కొన్ని రచనలు హఠాత్తుగా ఆగిపోయినట్టుంటాయి. చెప్పవలసింది యింకా బాకీ వుంది కాబోలుననికూడా అనిపించవచ్చు. కానీ యిదంతా భ్రమా ప్రమాదం మాత్రమే. కుటుంబరావుగారు మహాగడసరి రచయిత. చెప్పవలసింది కాస్తా ఎప్పుడో సూచ్యంగానో, వ్యంగ్యంగానో, ధ్వనిగానో చెప్పేసి వుంటారు. ఆ చెప్పదలచుకున్న దేదైతే వుందో అదే ఆయన రచనకు ప్రాణం. ఆ ప్రాణాన్ని మొదట దొరక పుచ్చుకుని దానికి శరీరంలాంటి కథావస్తువును ఎంపిక చేస్తారు. తనకు తెలిసిన మనుష్యుల్లోంచే పాత్రలను, తన ఎరుకలోని సంఘంలోనుంచే జీవిత సమస్యల్ని, తనకు పరిచితమైన ప్రదేశాలలోనుంచే కథారంగాన్ని స్వీకరిస్తారు. సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సాహిత్యాది విషయాలపట్ల తనకుగల నిర్దిష్టమైన అభిప్రాయాలను సందర్భోచితంగా వివరణగానో, సంభాషణల్లోనో చూపిస్తారు. వాస్తవికత తొణికిసలాడే వస్తువు, నిరాడంబరమైన శైలి, సూటిగా సాగిపోయే కథనం సహజంగా దొర్లిపోయే సంభాషణలు, విసుగు కలిగించని వర్ణనలు, నిశితమైన వ్యంగ్యం, హారంలో దారంలా ఒదిగివుండే శిల్పకౌశలం-అదీ కుటుంబరావుగారి సాహిత్య ప్రపంచం. మనిషిని ప్రేమించేవారికి, జీవితాన్ని ఆరాధించేవారికి, కొత్త రెక్కలు తొడుక్కుని అందగలిగినంత ఎత్తులకు ఎగిరి జీవిత దృశ్యాలను, సత్యాలను అవలోకించాలని అనుకునేవారికి ఆయన సాహిత్యం ఒక అమూల్యమైన నిధి. అక్షయమైన నిక్షేపం.

అడగని వాళ్ళది పాపంగా వ్రాసి పంపిన రచనలు పాత తెలుగు పత్రికల్లో వుండిపోగా, ఎప్పుడో అచ్చయిన కథా సంపుటాలు, నవలలు గ్రంథాలయాల్లోసైతం అదృశ్యంకాగా, కుటుంబరావుగారిదంటూ చెప్పకోడానికి ఒక నిండైన పుస్తకంగూడా లేని పరిస్థితిలో విశాలాంధ్ర ప్రచురణాలయంవారు ఆరు సంపుటాలుగా ప్రచురించాలని తలపెట్టిన 'కుటుంబరావు సాహిత్యం'లో యిది నాలుగవ సంపుటం. అచ్చయిన క్రమంలో మూడో సంపుటం రెండు నవలలు (పంచకళ్యాణి, అనామిక) ఒక నవలిక (ఆడజన్మ) ఇరవై ఒక్క కథలు (ఆడబ్రతుకే మధురం, ఔట్, ఒంటిస్థంభం మేడ, రాధమ్మ కూతురు, తీరని సమస్య, తిండిదొంగ, సజీవ ప్రేతం మొ॥) ఏడుగల్పికలు, నాలుగు నాటికలతో గూడిన ఈ సంపుటంలోని రచనలన్నీ స్త్రీల సమస్యలకే పరిమితం.

ప్రేమకు పెళ్ళికి పొంతన కుదరాలని ఆశించిన అయిదుగురమ్మాయిల కథ 'పంచకళ్యాణి' ఈ ప్రయత్నంలో జానకి ఓడిపోతుంది. సుశీల ఆశాభంగానికి గురవుతుంది. తాయారు, లక్ష్మి రాజీపడతారు. ఎటొచ్చీ లలితమాత్రమే గెలుపు సాధించినట్టు తోస్తుంది. 'అనామిక' ఒక దుఃఖభాగురాలి ఆర్తనాదం. అది చెవులకు వినిపించదు, మనసుకుమాత్రమే వినిపిస్తుంది, స్త్రీ వ్యక్తిత్వాన్ని పాతాళానికి అణగద్రొక్కే పురుషాహంకారం యొక్క కర్కశత్వాన్ని యిందులో రచయిత 'ఆనందరావు' ద్వారా నిరూపిస్తారు. తండ్రి నిరాదరణకు, భర్త ఉదాసీనతకు, ఆడపడుచు అఘాయిత్యానికి, మరిది ఆకతాయి తనానికి గురైన లక్ష్మి బ్రతుకు ముప్పయ్యేళ్లు నిండీనిండకముందే తుమ్మల్లో తెల్లవారినట్టయి పోతుంది. ఆమె కూతురికి, మనుమరాలికీగూడా అంతకంటే పదిలమైన భవిష్యత్తు కనిపించదు. (ఆడజన్మ) కుటుంబరావుగారు సృజించినవాటిలో బాల్యవివాహాలు, బాల వైధవ్యాలు, కత్తుల బోనుల్లాంటి సమిష్టి కాపురాలు మొదలైనవి వెనుకముఖంపట్టినా, వరకట్నంతో ముడిపడిన వైవాహిక సమస్యలు, విడిపోయే దాంపత్యాలు, ఉద్యోగంచేసే స్త్రీలకెదురయ్యే యిక్కట్లు మొదలైనవి మన సమాజంలో బలంగా వేరూనుకొనే వున్నాయి,

నారీ జీవనంలోని విషాదాన్ని గురించి రచయిత కావించిన ఈ రచనం కన్నింటికీ 'ఆడజన్మ' నవలికలోని మొదటి ప్రకరణం ఒక భూమికగా, విషయ సూచికగా కనవస్తుంది. ఒక యాభై సంవత్సరాల కాలపరిమితికి చెందిన తెలుగు వారి కుటుంబ వ్యవస్థ ఈ రచనల్లో మనకు ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. డజన్ల కొలది స్త్రీ పాత్రలు దేని స్వభావంతో అది, దేని సమస్యతో అది పాఠకుణ్ణి కలవరపెడుతూ ప్రవేశించి, అలజడి రేపుతూ నిష్క్రమిస్తాయి. నికృష్టమైన దయనీయమైన జీవన పరిస్థితులమధ్య నలిగిపోయే అభాగినుల జీవిత వృత్తాంతాలు పెద్ద ప్రశ్నార్థకపు గుర్తుల్లా ఎదురౌతాయి. జీవనరంగంలో అనేక విధాలుగా వంచించబడిన మహిళాలోకం తరపున సాహిత్య న్యాయస్థానంలో నిలబడి "మనం ఎన్ని చటనలు చేసినా, ఎన్ని బురఖాలు వేసుకున్నా మనకు పైగావున్న వాళ్ళ కోసమే. అందుచేతనే మన యదార్థస్వరూపం బయటపెట్టే శక్తి మన కింది వాళ్ళకుంటుంది. ధనికుల నగ్నసత్యానికి సాక్షులు పీడిత ప్రజలు. మగవాళ్ళ నగ్నసత్యానికి సాక్షులు ఆడవాళ్ళు" అంటూ ఉద్ఘోషిస్తారు కుటుంబరావుగారు.

సాహిత్యం సాంఘిక చరిత్రకు ఒక ప్రత్యామ్నాయంగా రూపొందాలని కుటుంబరావుగారు ఆశించారు. "కవులు ఎవరికాలపు జీవితాన్ని వాళ్లు వ్రాసుకున్నట్టయితే పదకొండో శతాబ్దంనుంచి ఈనాటిదాకా ఎంతటి అపూర్వమైన సాంఘిక చరిత్ర తయారయి వుండేది" అనుకుంటూ నిర్వేదానికి లోనయ్యారు. ఈ అభిప్రాయానికి అనుగుణ్యంగా ఆయన సమకాలీన సామాజిక జీవితాన్ని ఏ చిన్న అంశంగూడా చేయిజారిపోకుండా చెరిగిపోని వాస్తవికతా ముద్రతో సాహిత్యంలో నిక్షేపించారు.

కుటుంబరావు సాహిత్యం భావికాలపు జిజ్ఞాసువులకు ఒక సాంఘిక చరిత్ర. రచయితలకు అధ్యయనశాల, భావుకులకు ఆలోచనామృతం. తన రచనల గురించి వ్రాసుకుంటూ ఆయన ఒకచోట "నాకు ఒకటే ఆశయం. నా రచనలవల్లగూడా మనోవికాసం పొందగలిగినవాళ్లు తెలుగువాళ్ళల్లో వుండి తీరాలి. వారందరూ నా కథలు చదవాలని నా కోరిక" అన్నారు. కుటుంబరావుగారు స్థితప్రజ్ఞులు మాత్రమేగాదు సిద్ధ సంకల్పులుగూడా. అందమైన, ఆదర్శప్రాయమయిన, సంస్కార శోభితమయిన ఒక నవ సమాజానికి దారిదీసే భావ విప్లవం ఒకటితెలుగుదేశంలో వ్యాపించడానికివెనుక ఆయన పాత్ర చాలావుంది.

వీలయినంతవరకు కుటుంబరావుగారి రచనలు సేకరించి, వర్గీకరించి, ప్రతి సంపుటానికీ ఒక ప్రసిద్ధ సాహితీవేత్తచేత విషయ పరిచయంచేసే ఆ ముఖ్య వ్యాసాలు వ్రాయించి, అరుదైన ఛాయాచిత్రాలుగూడా జోడించి. ఎంతో శ్రద్ధాగౌరవాలతో ఈ సంపుటాలకు రూపకల్పనగావిస్తున్న డా. కేతు విశ్వనాథ రెడ్డిగారు అభినందనీయులు.

**మధురాంతకం రాజారాం**

# 'శ్రీ' అహోబల నరసింహస్వామి టెంపుల్

శ్రీ అహోబల నరసింహస్వామి టెంపుల్ (మోనోగ్రాఫ్)

[రచయిత పిడతల సీతాపతి, ప్రచురణ: డైరెక్టరు, ఆర్కియాలజీ మరియు మ్యూజియమ్స్,ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.]

అసురసామ్రాట్టు హిరణ్యకశిపుని నరసింహదేవుడు చీల్చిచంపిన దివ్య క్షేత్రం అహోబలం. అంతేగాదు- "చెట్టులెక్కగలవా నరహరి పుట్టలెక్కగలవా" అంటూ చెంచులక్ష్మి స్వామి జూలు పట్టుకొని ఆలయించిన దివ్యప్రణయక్షేత్రం కూడా యిదే.

శ్రీ కంచికామకోటి పీఠాధిపతి శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి సూచనాదేశాలతో, శ్రీ అహోబల మఠాధిపతి శ్రీ వేదాంతదేశిక యతీంద్రమహాదేశికుల ఆశీస్సులు, సహకారాలతో పురావస్తుశాఖ కమీషనరు శ్రీ పిడతల సీతాపతి యీ పుస్తకంలో అహోబల క్షేత్ర వివరాలను, విశేషాలను మనకు అందించారు.

నవనరసింహక్షేత్రమైన అహోబలం చాళుక్యరాజులైన జగదేకమల్లుడు, భువనైకమల్లుడు, త్రిభువనమల్లుడు, కాకతీయ చక్రవర్తి, ప్రతాపరుద్రదేవుడు, గణపతిదేవ చక్రవర్తి, కొండవీటిరెడ్డి రాజ్యస్థాపకుడు ప్రోలయవేమారెడ్డి, విజయనగర చక్రవర్తి శ్రీ కృష్ణదేవరాయలు మొదలైనవారి సేవలను అందుకున్నది. వీరిలో ప్రతాపరుద్రదేవుడు అహోబలస్వామి ఉత్సవ విగ్రహాలను చేయించి సమర్పించినట్టు కైఫీయత్తు కధనం.

క్రీ.శ. 14 వ శతాబ్దంనుండి యీ క్షేత్రానికి సంబంధించిన చారిత్రక ఆధారాలు లభిస్తున్నాయి. కొండవీటిరెడ్డి రాజ్యస్థాపకుడు ప్రోలయవేమారెడ్డి శ్రీశైలానికి, అహోబలానికి సోపానమార్గాలు నిర్మింపజేసినట్లు శ్రీశైల శాసనం తెలుపుతోంది. కాటయవేమారెడ్డి స్వామి "నిత్యావసరాల"కు ఒక గ్రామాన్ని సమర్పించినట్లు 1410 డిసెంబరు 11 వ తేదీన వేయించిన శాసనం వెల్లడిస్తోంది.

విజయనగర మహారాజులు యీ క్షేత్రానికి అసాధారణ సేవ చేశారు. క్రీ.శ. 1385-86లలో హరిహరరాయలు ముఖమంటప నిర్మాణం జరిపినట్లు ఒక శిథిల శాసనం తెలుపుతోందని కైఫీయత్తు వెల్లడించింది. తరువాత శాతవాహన శకం 1438 యువసంవత్సరంలో శ్రీ కృష్ణదేవరాయ మహాప్రభువు వేయించిన ముఖ్యమైన శాసనం యీ క్షేత్రంలో లభించింది. కళింగ దండయాత్రకు వెడుతున్న రాయలు యీ క్షేత్రాన్ని సందర్శించి స్వామికి ఒక కంఠమాల, పచ్చలు పొదిగిన వజ్రమాణిక్య పతకం, మాణిక్య కడియాల జత, బంగారుపళ్ళెం, వేయి వరహాలు సమర్పించారు. స్వామి 'అంగరంగ భోగాల' నిమిత్తం చాగలమర్రి మండలంలోని మద్దూరు గ్రామాన్ని కానుక చేశాడు. ఈ శాసనం శ్రీ కృష్ణ దేవరాయల విజయాలను కీర్తిస్తూ "పూర్వపశ్చిమ దక్షిణ సముద్రాధీశ్వర, యవనరాజ్య స్థాపనాచార్య, గజపతిదళవిభాడ" బిరుదములను పేర్కొంది. రాయల ఆస్థానంలోని ఆంధ్రకవితా పితామహుడు అల్లసాని పెద్దన ఆనాటి అహోబల మఠాధిపతి శఠగోపయతి శిష్యుడనే విషయం మనుచరిత్ర పాఠకులకు విదితమే.

సదాశివరాయల కాలంలో యీ క్షేత్రం ప్రాచుర్యాన్ని పొందింది. ఆ కాలానికి చెందిన అనేక దాన శాసనాలు లభిస్తున్నాయి. ఆ తరువాతి కాలంలో యీ క్షేత్రం ముస్లింల దాడికి గురై, కొన్ని సంవత్సరాలు వారి అధీనంలో వున్నట్లు మొదటి శ్రీరంగరాయల శాసనం తెలుపుతోంది. 'మల్కిభరాము'నిగా వ్యవహరింపబడిన ఇబ్రహీం కుతుబ్‌షా సైన్యాలు క్రీ.శ. 1500లో క్షేత్రాన్ని స్వాధీనం చేసుకోవటం చారిత్రక సత్యం. 1578లో కుతుబ్‌షా సైన్యనాయకుల లోని మురహరిరావు అనే మరాఠీ సర్దారు యీ క్షేత్రంలోని నరసింహ విగ్రహాన్ని కుతుబ్‌షా వద్దకు తెచ్చాడని, షా ఆ విగ్రహాన్ని చూసి నెత్తురు క్రక్కుని మరణించాడని పరంపరయా వినవస్తున్న కథ. దానికి ప్రోద్బలకంగా షా మరణం కూడా విచిత్రంగానే వుంది.

తరువాత నాటి మఠాధిపతి శ్రీ పరాంకుశ మహాముని శిష్యుడు శఠగోపస్వామి కోరికమేరకు మొదటి శ్రీరంగరాయలు తెలుగుచోడ నాయకులైన కొండ్రాజు వెంకటరాజు, తిరుమలరాజులను పంపి యీ క్షేత్రాన్ని విముక్తం చేశాడు. ఈ విషయాన్ని 1584 ఏప్రిల్ 18 వ తేదీన శ్రీరంగరాయలు వేయించిన శాసనం తెలుపుతోంది. తరువాత కూడా మున్వర్‌ఖాన్, మీరా సాహెబ్ మొదలైనవారు స్వామి స్వర్ణాభరణాలను, సువర్ణ, రజత పాత్రలను దోచుకున్నారు.

1810 ప్రాంతాలలో ఆలయానికి సహాయం చేసేవారెవరూ లేరని. ఒక్క పూజారి, ఇద్దరు శూద్రులు మాత్రం దిగువ అహోబలంలో నివసిస్తూ. పూజాదికాలు నిర్వహించేవారని కైఫీయత్తుల కధనం. అప్పటికి గర్భగుడి, ప్రాకారం మాత్రమే మిగిలాయి. ఈ విషయాలన్నీ శ్రీ సీతాపతి రూపొందించిన మోనోగ్రాఫ్‌లో తెలిపారు.

ఇక యిప్పటి పరిస్థితి చూస్తే యీ క్షేత్రం అహోబల మఠాధిపతుల అధీనంలోనే వుంది. దేవాదాయశాఖ స్వీకరించలేదు. రవాణా సౌకర్యం లేదు. ఒక రోజు బసచేసే అవకాశం లేదు. భోజనాదిక వసతులులేవు. ఇవన్నీ దేవాదాయశాఖ దృష్టికి రావలసిన అంశాలని శ్రీసీతాపతి సూచించారు. అంతేకాక ఎగువ అహోబలంలోని ఉగ్రనరసింహ దేవాలయంలో గిరిజనులు యిప్పటికీ జంతుబలులు సాగిస్తున్నారు. ఈ కార్యక్రమాన్ని అరికట్టి, సాత్త్విక పూజాదికాలు నెలకొల్పవలసిన బాధ్యత మఠాధిపతులపైన ప్రభుత్వం పైనా వుంది. ఈ విషయాన్ని శ్రీ సీతాపతి సూచించటం అభినందనీయం.

బార్గవదేవ

## ఎనిమల్ సిటిజన్ (ఇంగ్లీషు)

[భారత మృగ సంక్షేమమండలి అధికారపత్రిక త్రైమాసిక ప్రతులకు-ఎనిమల్ వెల్ ఫేర్ బోర్డ్ ఆఫ్ ఇండియా, గాంధీనగర్, మద్రాస్-600 020: వెల-రు 1]

ఇది త్రైమాసిక పత్రిక. అధ్యక్షురాలి లేఖ. మండలి కార్యకలాపాల నివేదిక, రాజకీయరంగంలో మృగాల హక్కులు, మృగశాలలు అంధకూపాలు, మహావీర ది ఇన్‌కారనేషన్ ఆఫ్ అహింసా. అవర్ లెస్సర్ బ్రదర్స్ ది ఎనిమల్స్ ఇన్ గాడ్స్ అస్ ది నీడ్ ఫర్ నాన్ మెడికల్ ఆల్‌టర్‌నేటివ్స్ అండ్ ప్రివెంటివ్ మెడిసిన్—48 పుటల ఈ సంచికలోని ముఖ్యమైన వ్యాసాలు.

అనాదికాలంనుంచి మృగాలకు మానవునికి సంబంధాలున్నాయి. మధ్యయుగంలో జంతుబలి ఆహారంకోసం మృగాలను చంపడంవంటివి వచ్చాయని విజ్ఞులు చెబుతారు.

మృగాలపట్లనే కాదు మానవులపట్లనే కారుణ్యం లుప్తమైపోయి పోతున్నది. ఇందుకు కారణాలేమయినా కావచ్చు. కాని మృగాలవల్ల తనకు జరిగే మేలును మానవునికి అవగాహన లేకపోవడం ప్రధానకారణం. జడభరతుడు మృగాలను ప్రేమించాడు. "తనయందు నఖిల భూతములందు" మక్కువను ప్రహ్లాదుడు వ్యవహరించాడు. ఇటువంటి భారతదేశంలో మృగసంక్షేమ మండలి అలా యీ ప్రత్యేకంగా అవసరం కావడం ఎంత దురదృష్టం ?

ఏ. ఎస్. అవధాని

## ఇస్లాం శిక్షణ

[మూలం : ముహమ్మద్ అబ్దుష్ షా. అనువాదం : అబుల్ ఇర్ఫాన్. క్రవునుసైజు 184 పేజీలు. వెల రు. 7.00 ప్రకాశకులు : తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, లక్కడ్‌కోట్, ఛత్తా బజార్, హైదరాబాద్-500 002.

'ఇస్లాం కీ తాలిమ్' అనే ఉర్దూ పుస్తకానికి 'ఇస్లాంశిక్షణ' సరియైన తెలుగు అనువాదం. ఈ చిరుపుస్తకములో ఇస్లాం ధర్మంలోని విశ్వాసాలు, నిత్యజీవితంలో పాటించవలసిన వివిధ నియమాలు క్లుప్తంగా అత్యంతసులభశైలిలో తెలుపబడినవి. అరబీ, ఉర్దూ లిపిరాని ముస్లిములకు ఈ పుస్తకము ఎంతగానో ఉపకరిస్తుంది.

ఏకేశ్వరోపాసన ప్రాముఖ్యము; ముస్లిము, కాఫిర్ శబ్దముల వివరణ; ప్రవక్తల దివ్యఉపదేశాలు, టవ్వఖుర్ ఆన్ సంశాదేలు, పరలోకం-ఖియామత్, ఈమాన్, ఇబాదత్ (ఆరాధన), రోజా, జకాత్, హజ్, నమాజ్, కుర్బానీ మున్నగు ధార్మిక విషయాలను విశదపరిచాడు రచయిత

ఆరాధనా విధానములలో నమాజుచేసే పద్ధతి, నమాజు చేయవలసిన సమయాలు, రకాత్‌లు, సూరాల వివరణ, తహారత్, ఇస్తింజా, ఉజూ, గుసుల్, తయమ్ముం, విత్రనమాజ్, అజా, అఖామత్‌లను విశదీకరించటం జరిగింది. నమాజ్‌చేసే సమయంలో జరిగే పొరపాటులను సరిదిద్దుట, నమాజ్‌ను భంగపరిచే

విషయాలు తెలుపబడినవి తరా వీహ్ నమాజ్ వ్యాధిగ్రస్తులు చేయు నమాజు ప్రయాణీకుని నమాజ్, జుమా నమాజ్, ఈద్ నమాజు, జనాజా నమాజు, ఉపవాస వ్రతం, నఫిల్ రోజా మున్నగు విషయాలు వివరింపబడినవి

దివ్యఖుర్ఆన్ అరబీభాషలో వ్రాయబడినది. కనుక సందేశాలు అరబీలోనే ఉంటాయి చాలమంది ముసల్మానులు సూరాలకు అర్థం తెలియకుండ చదివిస్తుంటారు. కొందరకు నమాజుసూరాలకు అన్వయంకూడా తెలియదు. వాని విశ్లేషణ ఈ పుస్తకములో యివ్వబడినది.

'ఇస్లాం శిక్షణ' ప్రతి ముస్లిము సోదరుడు పఠించతగిన పుస్తకము. ప్రతి యింటిలో, ప్రతి మజీద్‌లో ఉంటే అనేకులు అధ్యయనం, చేయటానికి వీలవుతుంది. పెద్ద పెద్ద గ్రంథాలను చదవలేనివారు సయితం ఈ పుస్తకం సహాయంతో ఇస్లామ్‌కు సంబంధించిన ముఖ్యవిషయాలు తెలుసుకొనవచ్చును.

అయితే ఈ పుస్తకములో కొంత లోపముకూడా ఉంది. రచయిత కొన్ని సందర్భాలలో అన్యమతాల విశ్వాసాలను అవహేళన చేశారు. రచయితకు కొంత మతసామరస్యం లోపించిందనిపిస్తుంది.

కేప్టెన్ షేక్ మౌలాలీ

# గడ్డిపరకలు

[ఆలపాటి లక్ష్మీనరసింహారావు. ఉదయభారతి ప్రచురణలు ఖమ్మం పదిరూపాయలు]

పదిరూపాయల ఖరీదున్న యీ 160 పేజీల పుస్తకంలో మొత్తం ఆరు కథలున్నాయి. గడ్డిపరకలో రంగారావు పాత్ర చదువరికేగాక రచయితకూడ అంతు పట్టదు అర్థమూ అవ్వదు. అతనిపాత్ర స్పష్టంగా సృష్టించబడలేదు "నాలుగో కోతి"లో కథావస్తువు లేదు. "క్యాబరే"లో అసభ్యం తారకస్థాయిలో వుంది కాబరే హాలులోకి బిచ్చగాడు రావడం. వాణ్ణి అక్కడివారు నగ్నంబరుణ్ణి చేయడం అంతా ఉపన్యాసాలివ్వడం వంటి అభూత కల్పనలున్నాయి. కాబరేలలో డాన్సరును పట్టుకుని నగ్నంగా చేయడంవంటి చర్యలు జరగనివ్వరు దానికి తగిన మందీ మార్బలమూ వారివద్ద వుంటాయి మహాబరాటాలో ఓ దంపతులు-వారి బహు సంతతి-ఆ సంతతికి బహుసంతతి-తతంగం.. ఈ కథ కొంచెం బాగున్నది. ఈ కథలన్నీ లోగడ వివిధ పత్రికల్లో పడ్డట్టు రచయిత ప్రకటించారు.

# పంజరం

[పులిపాక శ్రీరామచంద్ర మూర్తి. నవోదయ పబ్లిషర్స్: విజయవాడ పది రూపాయలు]

కథానాయకుడు శ్రీహరి జీవితకథ ఇది. కథలో 23వ పేజీలో వస్తాడతను. చిన్నతనం నుంచీ జులాయ్ తిరుగుళ్ళు తిరిగి ఇల్లువదలి పారిపోయి వో హోటలు (వంటిది)లో క్లీనరు కుర్రాడుగా జేర్తాడు. కథ శ్రీహరి తండ్రి చిన్నతనంనుంచి శ్రీహరి చిన్నతనం వరకూ నడుస్తుందీ కథ. సాధారణ కుటుంబ ఆర్థికపరిస్థితి వగైరాలతో కుటుంబ ఒడుదుడుకుల సంఘటనలతో నడుస్తుందీ కథ.

కథలో కొత్తదనంలేదు కథనంలో కొత్తదనం వుంది. రచయిత భాషను చాలా పొదుపుగాను, పూర్తి అర్థం వొచ్చేట్టు పొందికగానూ వాడారు.

కథకి పంజరం అన్న పేరు పుస్తకానికి అట్టమీద బొమ్మ వివరణ ఎంత వరకూ సరిపోతాయో చదువరే తేల్చుకోవాలి.

భూపతిరాజు

# ఆడదానికి మరోపేరు

[డా॥ సి. ఆనందారామం. న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్: విజయవాడ. వెల పన్నెండు రూపాయలు]

ఈనవల చదువుతూంటే చిన్నప్పటి నీతికథలు గుర్తుకు వస్తాయి. ప్రతి సంఘటననూ రచయిత్రి వో విభాగంగా మార్చి అంతంలో ఆడదంటే ఏమిటో నిర్వచిస్తూ వచ్చారు. ఆడదానికి మరోపేరు పిచ్చిదని 17, 32, 47, 58, 61,69 పేజీల్లోనూ, ఆదిశక్తి అని 76వ పేజీలోనూ, చ-అబలేనా అని 80వ పేజీలోనూ వొట్టి అమ్మ అని 102, 112 పేజీల్లోనూ, అహో వ్రజసంకల్పని అని 123, 135 వ పేజీల్లోనూ, సుధీర అని 145, 167 పేజీల్లోనూ, బలిపశువని 176, 184 పేజీల్లోనూ, ప్రణయోన్మాదిని అని 202వ పేజీలోనూ, చివరికి 215వ పేజీలో మాధుర్యము, పారవశ్యమూ, స్థయిర్యమూ, లాలిత్యమూ, దారుఢ్యమూ, అనురాగమూ, ఆత్మాభిమానమూ, అన్నీ తనలోనే రంగరించుకున్నది ఆడదని నిర్వచించారు. కానీ ఇవన్నీ మగవాడు రంగరించుకోకూడదా, రంగరించుకుంటే మగవాడవడా అనే ప్రశ్న మగచదువరికుదయిస్తే దానికి సమాధానం యీ పుస్తకంలో దొరకదు.

నాయకి కుసుం పిలాస్, వినోద్ అనే ఇద్దరు యువకులలో తనకెవరు అనుగుణంగా వుంటారో అని కథ పొడుగునా తూకంవేస్తూనే వుంటుంది. చివరికి విలాస్‌కే తనను అర్పించుకోవాలన్న నిశ్చయానికి వచ్చి అతనికోసం అమెరికా వగైరాలు వెళ్ళి అక్కడ 214వ పేజీలో వినోద్ కనుపించేసరికి కాస్త మళ్ళీ తటపటాయించి, చివరికి వినోద్ ఆమెను మరోవారం ఆగమంటే "సారీ వినోద్" ఉంటుది.

కుసుం మనోస్థితి ఏమిటో చదువరికి బొత్తిగా కొరుకు పడదు. ఇద్దరు మగవాళ్ళని 115 పేజీల పొడుగునా తూచుతూ తాను సతమతమయ్యే స్త్రీని .... చపలమా నీపేరుస్త్రీ ... అన్నట్టుంది ఆమె ప్రవర్తన.

కథ శైలి బాగున్నది.

చదువరిని కథ తనతో చక్కగా తీసుకు వెళ్తుంది.

ఫాలాక్షుడు




*Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd , by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phone: 75667 & 61247.*






# ఆంధ్రపత్రిక సంస్థ నుంచి మరో ఆణిముత్యం
# నవ వనితా సచిత్ర పక్షపత్రిక

* అభ్యుదయానికి మనోవికాసానికి, లలితమైన వినోదానికి దర్పణాలైన వ్యాసాలు, చర్చలు.
* కాలక్షేపానికి రకరకాల హాబీలు, గృహాలంకరణలు తెలిపే శీర్షికలు.
* బొమ్మల కథలు, కమ్మని కథలు వాటికి తీర్చైన బొమ్మలు.
* ఒక పూర్తి నవల + 2 సీరియల్స్.
* పొదుపుకు, సదుపాయానికి అవసరమైన చిట్కాలు, రకరకాల వంటలు; వంటలకి ఉత్తరాలకి అల్లికలు, డిజైనులు, కవితలు, గేయాలు, రాశిఫలం కూడా ... బహుమతులు అన్నీ రంగులు హంగులు కలబోసిన అందమైన హరివిల్లు!
* ఆధునిక మహిళల ఏకైక పక్షపత్రిక. అందరూ చదువతగిన సచిత్ర పత్రిక వెల : 2-50

వివరాలకు :

'కలువబాల', కేరాఫ్ ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 3.

ఏడ్రప్రతి వెల : రు. 2.50

**చందా వివరాలు**

| | ఏజెంట్ ద్వారా | | పోస్ట్ ద్వారా |
|---|---|---|---|
| 3 నెలలకు | రు. 15-00 | - | 15-90 |
| 6 నెలలకు | రు. 30-00 | - | 31-80 |
| 9 నెలలకు | రు. 45-00 | - | 45-00 |
| 12 నెలలకు | రు. 60-00 | - | 60-00 |

